

బొంబాయి నగరపరిపాలనసభయొక్క కట్టడములు.

III

# ప్రజాధర్మసంగ్రహము

విద్యార్థులకు ను, ఉపాధ్యాయులకు ను నుపయోగపడునట్లు,
అనేకచిత్రపటములతోఁ జేర్చి
చెన్నరాజధానిసర్వకలాశాలయందు
చరిత్రవిశారదుఁడగు

**తి. సే. సుబ్రహ్మణ్యయ్యర్‌గారిచే**

రచియింపఁబడి,

మద్రాస్ టెక్స్‌బుక్ కమిటీవారిచే
నంగీకరింపఁబడినది.

మాక్మిల్లన్ అండ్ కంపెనీ లిమిటెడ్
లండన్, బొంబాయి, కలకత్తా, చెన్నపురి.
1915

 వెల, అణాలు 12

# పీఠిక

ప్రజలు, తమకట్టుదిట్టములను బాగుగాఁ దెలిసికొని, చట్టములకుఁ బ్రతికూలముగాఁ గాక, నడచుకొనునట్లు చేయుట విద్యను వ్యాపింపఁజేయు నుద్దేశములలో నొక్కటి యై యున్నది.

అమెరికాయందును, ఇంగ్లాండునందును విద్యాశాఖాధికారు లీవిషయమునం దెక్కువ శ్రద్ధ వహించియున్నా రని తెలియుచున్నది.

ఆంగ్లేయులు పరిపాలించునట్టి యీ యిండియాయందును రాజ్యపాలనపద్ధతులను, ప్రభుత్వమువారియుద్దేశములను బాగుగా విశదపఱచుట ప్రజలకు నెమ్మదిని తృప్తిని గలిగించును గనుక, యిండియాలో దీనికి సంబంధించినపాఠ మొక్కటి బోధించుట యావశ్యక మను విషయము చెప్పవలెనా?

కొంతకాలమునుండి చెన్నరాజధానియందలి బోధనాభ్యాసకపాఠశాలలయందలి యుపాధ్యాయులకును, బాలపాఠశాలలోనిబాలురకును నీవిషయ మొక్కపాఠముగా నియమింపఁబడియున్నది; అట్లేర్పఱచి యున్నను, ఈవిషయమై వారు స్వయముగా చదివి తెలిసికొనఁదగిన గ్రంథము లేవియు లేకుండుటచేతను, ఆంగ్లభాషలోనున్న గ్రంథములు వారికి దురవగాహము లగుటచేతను, ఈవిషయమును, వారికిని సామాన్యజనులకును లెస్సగాఁ దెలియవలె నని యెంచి, యాంగ్లేయప్రభుత్వము యొక్క పద్ధతులను, వారియొక్క పరిపాలనముమూలమున జనులకు లభించియుండు మేలులను జనులయొక్కవిహితకృత్యములను వివరింపఁ

దగిన "ప్రజాధర్మసంగ్రహము" అను నీగ్రంథము రచియించి ప్రచురింపఁబడినది. అభిప్రాయభేదములు గలిగించునట్టి విషయము లిందు దఱచు వ్రాయబడవయ్యె.

దొరతనమువారు కల్పించు మేలులును, వారికై జనులొనర్పవలసిన సాహాయ్యములును, పైమేలులు చేయునట్టిపద్ధతులు ను, హిందూదేశము యొక్క సంక్షిప్తచరిత్రము నను నీనాలుగుభాగము లీగ్రంథమునం దడఁగి యున్నవి.

'తెలిసినవిషయముచేఁ దెలియనివిషయమును బోధింపవలయును' అను మేలైనబోధనపద్ధతి ననుసరించి, యందఱెఱిఁగినట్టి వగు కుటుంబము, గ్రామము, పంచాయతీ మొదలగువానిమూలమున, ప్రభుత్వము, దేశము, న్యాయస్థానములు మొదలగు విషయము లిందు వివరింపఁబడినవి.

ఈగ్రంథస్థవిషయము నూతన మగుటచే నీగ్రంథమున సవరింపవలసిన సవరణలు మెండుగా నుండవచ్చును; కనుక, ఈగ్రంథము ను జదువునట్టి బుద్ధిమంతులు, ఇందు చేయవలసిన సవరణ లివి యని నాకుఁ దెలిపినంతట, వానిని మిగుల వినయముతో నంగీకరించి, వారియెడలఁ గృతజ్ఞత గలవాఁడనై యుందును గాక.

చెన్నపురి,
10—9—15.

తి. సే. సు.

VII

# విషయసూచిక

## మొదటి భాగము.



## రెండవ భాగము.

అధ్యాయసంఖ్య. పుటసంఖ్య.

## మూడవ భాగము.



## నాలవ భాగము.

# ఉపాధ్యాయులు గమనింపవలసిన విషయములు.



1. విద్యార్థుల కుపయుక్తములు గాని విషయములను వివరింపవలసినది లేదు. సర్కారుయొక్క యొక్కొక్కశాఖలోనియన్ని కట్టుదిట్టములను బోధింపవలసినది లేదు. బోధింపఁబడువిషయములకంటె బోధనక్రమ ముతెలియుటయే మేలైనది.

2. విద్యార్థులకుఁ దెలిసినవిషయములను బెట్టుకొని వారికిఁదెలియని విషయములను బోధింపవలయును. చిత్తరువులు, చిత్రపటములు, ఆకారములు, వస్తువులు, కచ్చేరీలలో వాడఁబడుపత్రములు, దస్తావేజులు, మొదలగువాని నుంచుకొని, వస్తుపాఠములను వలెనె రాజ్యాంగపద్ధతులను, ప్రజాధర్మములను వివరింపవలయును.

3. ఆయా ప్రదేశములం దున్నవృత్తులను, కచ్చేరీలను, ప్రభుత్వలక్షణములను జూచి తెలిసికొనునట్లు విద్యార్థులను పలుమాఱు బయటిప్రదేశములందుఁ దిరుగుటకుఁ బిలుచుకొనిపోవలయును. మొదటమొదటనే పైయధికారులయొక్క పనుల నన్నిటి నెత్తి చెప్పవలసినది లేదు. పెక్కుతెగలగు శాఖలవలన జనులకుఁ గలిగెడి మేలులను వివరించుటయె చాలును.

4. చరిత్రపాఠము, వస్తుపాఠము, సంభాషణము, వ్యవసాయశాస్త్రపాఠము పాటలు మొదలగువానితో సంబంధపడునట్లే యీప్రజాధర్మసంగ్రహమును గూడ బోధించుచు రావలెను.

**5.** కాలక్రమమునఁ బ్రభుత్వధర్మములు నెలకొని మేలులను వృద్ధిపఱచుచున్నవి యని యు, నిలుకడ గల జీవితమునకును, భాగ్యవృద్ధికిని నావశ్యకమయిన ప్రభుత్వమునకు సహాయపడుచుండుట యందఱికి ముఖ్యవిధి యనియు మాటిమాటికి బోధింపవలెను. దొరతనమువారికిఁ జేయవలసినవిధులవలెనె తమతమతెగవారికిని జేయవలసినవిధు లున్నవనియు నెత్తిచూపవలెను.

6. పాఠములు నడచుసమయమునను, ఆట లాడువేళలయందును, సాముచేయువేళలందును, న్యాయ్యము లగు చట్టదిట్టముల నవలంబించుటచేఁ గలుగు లాభములను విద్యార్థులే తెలిసికొనునట్లును వారి కవకాశముఁ గల్పింపవలెను. ఇట్టియలవాటులచేత మేలైననడతలు ను, వాడుకలు ను గలవారయి, కాలక్రమమున విద్యార్థులు జ్ఞానమును వివేకమును గలవార లగుదురు.

**7.** ప్రకృత ముండురాజ్యాంగముయొక్కపద్ధతిని, మేలిమిని బాగుగా వివరింపఁ బ్రకృతకాలమును పూర్వికకాలముతోఁ బలుమాఱుపోల్చి చూపవచ్చును. అయినను, నిష్కారణముగాఁ బూర్వకాలమును దూషించి, ప్రకృతకాలమును భూషించుట తగదు.

8. రాజ్యాంగపద్ధతులను, ప్రజాధర్మములను బోధించునప్పుడు నిష్కారణముగా నాంగ్లేయపదముల నుపయోగింపను వలదు. తగినయాంధ్రపదములు దొరకనపుడు, బాగుగా విశదపడని భాషాంతరీకృతపదములను వెదకను వలదు.

# ప్రజాధర్మసంగ్రహము

## మొదటి భాగము



### 1. కుటుంబము, దానిధర్మములు.

మానవులనానావిధావస్థలు — సాంసారికవృత్తి — సాంసారికధర్మములు — వీనిని ఆచరించుట మనశ్రేయమునకే — పిత్రధికారమును, కుటుంబప్రేమయు — గొప్ప కుటుంబమునకుఁ గలలక్షణములును, గౌరవమును.

ప్రపంచమం దపరిమితము లగుజీవరాసులు గలవు. వానిలో బుద్ధిచాతుర్యమునుబట్టియుఁ జేయు పనులను బట్టియు మనుష్యజన్మమున కుత్తమత్వము గలిగినది. ఆ మనుష్యులు వారివారి బుద్ధివికాసమునుబట్టి వేఱువేఱు తెగలవారుగ నున్నారు. విద్యనుబట్టియు, మతమునుబట్టియు, నాగరికతనుబట్టియు వేఱువేఱు జాతులవారు వేఱువేఱు

తెగలుగ నున్నారు. ఒకతల్లికడుపునఁ బుట్టినవారుసైత మొక్కరీతిగా నుండుట లేదు గదా. ఈ తీరుననే కొన్ని దేశములవారు తమతమబుద్ధివికాసమునుబట్టి విద్యయం దును, శ్రద్ధయందును, చేతిపనులయందును, నాగరికత యందును బేరిమివహించియున్నారు. మఱికొన్ని దేశముల వారు తమకును మృగములకు నేవిషయమునను తారత మ్యము లేశమాత్రమును లేక యున్నారు. దక్షిణ



తోడులు.

హిందూదేశమున నీలగిరియందు **తోడులు** (Todas) అను నడవిజాతివారు చెట్లక్రింద గుడిసెలను గట్టుకొని పశువు

లను మేపుకొనుచు నడవిలోనిదుంపలను పండ్లను దిని బ్రదుకుచున్నారు. మఱికొన్నిప్రదేశములవారు పసులను మేపుకొనుటయే జీవనోపాయముగ నుంచుకొనక యడవి లోని చెట్లను నఱికి పాఱవైచి చదునునేలలను గావించి యా నేలలలోఁ గృషిసల్పి సంవత్సరమంతటికి సరిపోవునట్లు ధాన్యములను బండించికొనుచు వ్యవసాయపద్ధతుల యందు సులభమార్గములను యోచించుచుందురు. ఈ తీరుననే వేఱువేఱు దేశములవారు నిట్టిపనులనుబట్టియే నాగరికతాభివృద్ధిని జెందుచున్నారు. నాగరికత యించుక యైనను లేని మృగప్రాయుఁడయినను ఒక్కొక్కఁడుగ నుండక తనవారనెడికొందఱితోఁ జేరియుండును. ఇట్లే నాగరికతాభివృద్ధి నొందినచక్రవర్తియుఁ దనవారనెడి కొందఱితోఁ జేరియే యుండును. జనులయందు నాగరికత హెచ్చినకొలఁదిని నైకమత్య మెచ్చుచుండును. ఇట్లే యొక్కొక్కరును దమతమయిష్టజనులను జేర్చుకొని యొక యింటఁ గాపురము చేయుచుందురు. ఇట్టి కాఁపురమునకే కుటుంబ మని పేరు. ఒకయింట రక్తస్పర్శగలవా రైకమత్య ముతో నివసించుటనే కుటుంబ మనవలయునుగాని గుం పులుగుంపులుగాఁ గూడియుండు జనసమూహములను కుటుంబము లనరాదు.

కుటుంబముతో నున్నవాని కందఱియెడను ప్రీతి,

పెద్దలయెడ వినయము, ఇతరులకష్టసుఖముల నెఱుఁగఁ గోరుట, దైవభక్తి, పాపభీతి, శాంతము, పేదలయెడఁ గని కరము, కృతజ్ఞత, పరోపకారబుద్ధి లోనుగాఁగల యుత్తమ గుణము లనేకము లలవడును. కుటుంబము దృఢముగ నుండవలయు ననుచో నందలి వారియం దైకమత్య మెక్కువగ నుండవలయును. నాగరికత యించుకైనను లేనివాఁడును దనకుటుంబమువారితోఁ దగవులాడక వారియెడఁ బ్రీతి గలిగియుండును. ఒకకుటుంబములో నుండువా రందఱును దమ కందఱకును మూలపురుషుఁ డొక్కఁడే యని యెఱిఁగినవా రగుటచేఁ బరస్పరానురాగము గల వారై యుండుటను మనము చూచుచున్నారము. ఒక కుటుంబములోనున్న తల్లి, తండ్రి, బిడ్డలు మొదలగువా రెంతకాలము తమలోఁ దాము కలహములు లేక తమ తమపనులను నిర్వహించుకొనుచుఁ గుటుంబగౌరవమును, గుటుంబక్రమమును గాపాడుకొనుచు నుందురో యంత కాల మాకుటుంబము క్షేమముగ వర్ధిల్లుచుండును. ఒకని నడవడికనుబట్టి యతనికుటుంబస్వభావమును మనము దెలిసికొనవచ్చును.

ఆఁకలిగొనినవారి కన్నముపెట్టుట, నొచ్చినవారి యిడుమలఁ దీర్చుట, పేదల కన్నసత్త్రములఁ గట్టించుట, రోగుల కయి ధర్మవైద్యశాలల నేర్పఱచుట లోనుగాఁగలయవి

యుత్తమ ధర్మకార్యములు. వీనికంటె నెక్కుడు ధర్మకార్య మొండు గలదు. అదేదియనఁగా — కుటుంబములయం దున్నవారు తత్కుటుంబ నిర్వాహణమునకయి తమతమ విధాయకకృత్యముల నెఱిఁగి వాని నొనర్చుచుండుటయే. దీనికి **కుటుంబధర్మ** మని పేరు. ఈ యుత్తమధర్మము నాచ రించువాఁ డితరధర్మములను జేసినవాఁడగును. తల్లిదండ్రులు తమబిడ్డలకు విద్యాబుద్ధులఁ గఱపి యుచితరీతిని గాపా డుట, బిడ్డలు తమతల్లిదండ్రులు ముసలివారైనప్పుడు వారి యందు భక్తి యుంచి, వారిని బోషించుట, అన్న తమ్మునిఁ బుత్రవాత్సల్యముతోఁ జూచుకొనుచుండుట, తమ్ముఁ డన్న యందుఁ బితృభావ ముంచి గౌరవించుచుండుట, భార్య తనభర్తయే తనకు దైవత మని నిష్కపటముగా నాతనికిఁ బరిచర్యలు సేయుచుండుట, భర్త తనభార్య పతివ్రత యని నమ్మి యామెకోరికలఁ దీర్చుచుండుట ఈయవి కుటుంబ ధర్మములు. ఇట్లు కుటుంబమున నుండువారు తమతమధర్మ ములను నెఱవేర్చుచుండుట తమక్షేమమునకే యని తెలియవలయు.'

ఇట్లు కుటుంబధర్మములను దెలుపు గ్రంథము లన్నిమత ములయందును విస్తారముగా నున్నవి. హిందూమతమున నట్టి ధర్మములను సమగ్రముగఁ దెలుపుగ్రంథములు

భారతరామాయణములు. వీనికథాంశము లందఱకును దెలిసిన వగుటచే నిచ్చటఁ జెప్పఁదలఁచుకొనలేదు.

కుటుంబమున నుండువారు తమతమధర్మములను నడుపుచుండుట తమక్షేమముకొఱకే యనువిషయమును వివరించుట కొక చిన్న కథ గలదు.

ఒకనాఁ డవయవము లన్నియు నుదరముతోఁ గలహించి, కాళ్లీపాడుపొట్టకయి మే మేల యెండవానలలో ఱాలయందును ముళ్లయందును నడిచిపోవలెననియుఁ, జేతు లీ సోమరిపొట్ట దొరవలెఁ గూరుచుండుట యేల మేము కష్టపడుట యేల యనియు, దంతము లీపాడుపొట్టను మేపుటకయి మాకొనలు మొక్కలు వోవునట్లు వస్తువుల నేల నమలవలయుననియు, నోరు 'నే నేల ముద్దలను మ్రింగవలయు' ననియుఁ జెప్పుచు నేవియు నేపనియుఁ జేయకుండెను. ఇట్లు గొన్ని దినములు గడచినతరువాత నవి యన్నియు దుర్బలములయి, కాళ్లకొక యడుగు దూరమయినను నడచుటకును, చేతుల కొకగడ్డిపరకనయిన నెత్తుటకును, దంతముల కొక మెతుకునయిన నమలుటకును, నోటి కొక మెతుకునయిన మ్రింగుటకును శక్తి లేకపోయెను. అప్పు డవి యన్నియుఁ దాము చేసిన తప్పును దెలిసికొని నాఁటినుండి యుదరముతో నైకమత్యము గలిగి తమతమపనులను జేయుచుండెను.

ఈవిధముగఁ గుటుంబమున నున్నవా రందఱుఁ దమ తమ పనులను జేసికొనుచున్న యెడలఁ గుటుంబము చక్కఁగ వర్ధిల్లుచుండును.

ఈవిధముగఁ గుటుంబములో నున్నవారందఱు తమ తమపనులను జక్కఁగఁ జేయుచున్నారా లేదా యని విచారించుకొనువాఁ డెవ్వఁడు? యజమానుఁడు లేక తండ్రి. కుటుంబమున నున్న వారి నందఱిని బోషించుటయు, వారికిఁ గుటుంబధర్మములఁ గఱపుటయుఁ గుటుంబమునకు గౌరవము సంపాదించుటయు నీతనిముఖ్యకార్యము. పిత యను పదమున కిదియే యర్థము. తండ్రి చెప్పినట్లు నడచుకొనుట బిడ్డలకు విధి. తండ్రిలేనట్టి, లేక, తండ్రి చెప్పినమాట విననట్టివారికుటుంబముగతి యేమగును? కొడుకు లొకరితో నొకరు జగడము లాడుకొనుచుఁ దమతమపనులను విడిచి పెట్టి, ఆస్తి నంతటిని బాడుచేసికొని, తమపెద్దలగౌరవమునకును కీర్తికిని చెడ్డపేరు దెచ్చుటయేగాక తామును జెడిపోదురు. మనశరీరమున నొక యవయవమున కొక యపాయము కలిగినప్పు డా యపాయమును దీర్చుట కితరావయవము లెంత జాగరూకతతోఁ బనిచేయునో యట్లే కుటుంబమున నొకని కేదయిన నాపద గలిగినప్పు డా కుటుంబమున నున్న యితరు లాతనికిఁ గలిగినయాపద తమకుఁ గలిగినట్టులే భావించి యాతనియాపదను తీర్చిన

యెడల నాతఁడును దాసును క్షేమముగ నుందురు. దీనికే **కుటుంబవాత్సల్య** మని పేరు.

ఒక కుటుంబము నొక **చిన్నరాజ్యము**తోఁ బోల్ప వచ్చును. దానికి **తండ్రియే** రాజు. కుటుంబమే **ప్రజలు**. తండ్రి యింటివెలుపలికార్యములను జక్కఁబెట్టుకొనుచుండునట్లు పెనిమిటికిఁ గష్టమియ్యక గృహకృత్యములను సవరించుకొనుచుండునది **యజమానురాలు** లేక తల్లి. దీనినిబట్టియే యీమె కిల్లాలనియు గృహిణి యనియుఁ బేళ్లు కలిగినవి.

క్రమము దప్పక నడచుచుండుకుటుంబమే యుత్తమ కుటుంబము. ఒక గొప్పకుటుంబమువాని నెల్లరు గౌరవింతురు. ఒకని కొకయుద్యోగ మిచ్చునపుడు ప్రభువు లాతనికుటుంబగౌరవమును విచారింతురు. గొప్పకుటుంబములోనివాఁడుగా నుండుటయే యొకనికి గొప్ప యోగ్యతగ నుండును. కావునఁ బ్రతిమనుష్యుఁడును దన కుటుంబగౌరవమును జక్కఁగఁ గాపాడుకొనుచుండవలయును.



## 2. కుటుంబము, దొరతనము.

మానవులయల్పవిభాగములును, గొప్పవిభాగములును — వీనినెమ్మదికిం గారణము — దొరతనమును, పరిపాలకులగుణవిశేషములును — శాంతమునకుం గారణము ప్రభుత్వమే—చీమలు, ఈఁగలు, మృగములు వీని యొక్క దొరతనమును, పద్ధతియు—దొరతనమువలనిలాభములు.

మానవులచిన్నగుంపొక కుటుంబ మని వెనుకటి యధ్యాయమునఁ జెప్పియున్నాము. ఒకకుటుంబమువారు సాధారణముగా నొకయింటనే నివసించుచుందురు. కాని యా కుటుంబము పెద్దది యగునెడల దానిలోఁ గొందఱు తమతమయాస్తులను దీసికొని తమజీవనాధారమును సంపాదించుకొనుటకై వేఱువేఱిండ్లయందు నివసించుచుందురు. అయినను వారు తమ పెద్దలయందు గౌరవమును భక్తి విశ్వాసములను నెన్నటికిని విడువరు. ఇట్లు చీలిపోయిన కుటుంబములు కొంతకాల మగునప్పటికి దేశకాలవ్యత్యాసములనుబట్టి పరస్పరసంబంధములను మఱచిపోయి, క్రొత్త (భిన్న) కుటుంబములవలె నగును. ఇట్టి కుటుంబములు కొన్ని చేరి యొక గ్రామ మగును. ఇట్టి గ్రామములు కొన్ని చేరి యొక జిల్లా యగును. ఇట్టి జిల్లాలు కొన్ని చేరి యొక దేశ మగును. అప్పుడు జనసంఖ్య హెచ్చుయి నందున జనులకుఁ బూర్వపుకుటుంబాభిమానము పోయి

నను వారికి నొక గ్రామవాసులము, ఒక జిల్లావారము, ఒక దేశమువారము, ఒక రాజ్యములోనివారము, ఒక జాతివారము అనునట్టి యభిమానము పుట్టును.

ఇట్లొక దేశమున నివసించుజనసముదాయముయొక్క క్షేమము నభిలషించి, వారికొఱంతలను దీర్చుచు వారిజగడముల నణఁచుచు నుండువా రెవ్వరు? దొరతనమువారు. కుటుంబయజమానుఁడు తండ్రి యనియు, నతఁడు తన కుటుంబమువారు తమతమపనులను జక్కగా నెఱవేర్చు చుండునట్లు చూచుకొనుచుండు ననియు వెనుకఁ జెప్పి యున్నాముగదా. కుటుంబమునకుఁ దండ్రి యెట్లో దేశమునకు దొరతనమువా రట్టివారుగ నుందురు. వారు దేశమున నుండుప్రజలక్షేమమును గోరుచు, వారి కష్టములను దొలఁగించుచు, వారియభివృద్ధికి వలయుసాధనములను గల్పించుచుందురు. దొరతనమువారు తాము గమనింపవలసినవిషయము లనేకము లుండుటవలనను, అన్నిటిని దాము గమనించుచుండుటకు వీలులేకపోవుటవలనను విషయములను వేఱువేఱుగా విభజించి వేఱువేఱుద్యోగస్థుల వశమున నప్పగించుచున్నారు. మనకు నివాసస్థానమయిన యీ హిందూదేశమును బరిపాలించువారికి 'ఆంగ్లేయు'లని పేరు. వారు యూరపుఖండమునఁ బశ్చిమమహాసముద్రమున నుండు 'ఇంగ్లండు' అనుద్వీపమున నుండువారు;

విద్యయందును, ధనమునందును, నాగరికతయందును మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచినవారు.

నలుగు రైదుగురుగల యొక చిన్న కుటుంబమును జూచుకొనుచుండుయజమానున కే దయ, దాక్షిణ్యము, శాంతము మొదలయిన గుణము లెంత విస్తారముగనో యుండవలసి యుండఁగా, కోట్లకొలఁదికుటుంబములు గల యొక రాజ్యమును బరిపాలించుచున్న దొరతనమువారి కెంత దయయు, నెంత శాంతమును నుండవలెను! పూర్వకాలమున నయోధ్యాపట్టణముననుండి యీ దేశమును బరిపాలించుచుండిన 'శ్రీరాముఁడు' సమస్తసద్గుణములు గలవాఁడనియును, నాతనిరాజ్యమునఁ బ్రజలు క్షామభయము, చోరభయము, దారిద్ర్యభయము మొదలగు భయము లెంతమాత్రమును లేక సర్వసౌఖ్యముల ననుభవించుచుండిరనియు మనము రామాయణమునఁ జదివియున్నాము గదా. ఆ కాలపుజను లంత సౌఖ్యపడుచుండినందుల కా రామునిసద్గుణములే కారణము. కావుననే యాతఁడు దయాసముద్రుఁడనియు, గొప్పదాత యనియు ప్రసిద్ధి చెందెను. ఇట్లే మగధదేశమును పాలించుచుండిన అశోకుఁడు,చంద్రగుప్తుఁడు మొదలగువారు ప్రజలను తమ బిడ్డలనుబోలెఁ జూచుకొనుచు, వారి కెట్టి కొఱఁతలను గలుగనీయక దేశమును బరిపాలించుచుండిరని మనము

చరిత్రలయందుఁ జదివియున్నాముగదా! మఱియు మన దేశమును బరిపాలించుచుండినమహామ్మదీయచక్రవర్తులలో



అక్బరు.

అక్బరు చక్రవర్తి ధర్మరాజని ప్రఖ్యాతిపొంది ప్రజలకేవిధమైనకష్టములును కలుగనీయక తాను మహామ్మదీయుఁడయినను మహామ్మదీయులను హిందువులను సమదృష్టితోఁ జూచుకొనుచు దేశము నేలుచుండె నని మనము చదివియున్నాముగదా! ఈ యుదాహరణములవలన, రాజ్యమును పరిపాలించుట సామాన్యప్రభువులకు సాధ్యము కాదనియును, రాజ్యమును పాలించువారికి దయ, శాంతి, ఔదార్యము, అనుభవము మొదలగుసుగుణములు విశేషముగ నుండవలయు ననియుఁ దెలియవచ్చుచున్నది.

ప్రజలను స్వాధీనపఱచుకొని వారికిఁ గావలసిన సౌకర్యములను గలిగించుచు, దేశములను బరిపాలించుటకు రాజు లేనియెడల, ప్రపంచమున జనులు బ్రదుకుటయే

కష్టముగా నుండును. నలుగురయిదుగురుగల యొక చిన్న కుటుంబము సైతము యజమానుఁ డొకఁడు లేనియెడల నెట్టిస్థితియం దుండునో వెనుకఁ జెప్పియున్నాముగదా! సాధారణముగ నొక పాఠశాలయం దుపాధ్యాయుఁడు లేని సమయమున బాలురప్రవర్తనమును చూచువారికి రాజు లేనిదేశమునందలి జనులస్థితి చక్కఁగఁ దెలియవచ్చును. ఉపాధ్యాయుఁడు లేనియెడల బాలు రొకరితో నొకరు తగువులాడుకొనుచుఁ గాలమంతయు వృథాగాఁ బాడుచేసి కొనుచు బుద్ధిహీను లగుదురు. ఉపాధ్యాయుఁ డున్న యెడల, బాలురు భయభక్తులు గలిగి తమకుఁదెలియని విషయముల నడిగి తెలిసికొనుచు ముందు తమజీవనాధార మునకుఁ గావలసినసద్విద్యను సంపాదించుకొందురు. చట్ట దిట్టములకు లోఁబడి జనులు ప్రవర్తింపవలసినయేర్పాటు లెచ్చటెచ్చట నుండునో యచ్చటచ్చట దొరతన మున్నదని మన మెఱుఁగవలయును.

చెన్నపట్టణమున ప్రతిసంవత్సరము పీపిల్సుపార్కులో జరుగుచుండు క్రిస్టమస్ వేడుకలను జూచుట కా యూరి వారుమాత్రమేకాక యితరస్థలములనుండి కూడ వేల కొలఁది జనులు గుంపులుగుంపులుగా పోవుచుందురు. ఇట్లే పండ్రెండు సంవత్సరముల కొకపర్యాయము కుంభ కోణమున వచ్చు మహామఖమునకును, గోదావరీపుష్కర

మునకును దేశదేశములనుండి జనులు పోవుచుందురు. ఇట్టి స్థలములయందు దొంగతనములు, హత్యలు మొదలయినవి జరుగకుండునట్లు సర్కారువా రధికారుల నియమించి కొన్నినిబంధనల నేర్పఱచి జను లా యా నిబంధనల ప్రకారము నడుచుకొనవలయు నని యేర్పాటులు చేసి జనులకు వలయుసౌకర్యములను గలుగఁజేసియున్నారు. ఇట్టి యేర్పాటులు లేనియెడల పీపిల్సుపార్కు నిర్మూలమై పోయియుండును. దొంగతనములు, హత్యలు మొదలగు నుపద్రవములసంగతి చెప్పవలసినదే లేదు. కనుక జనుల కిట్టి బాధలు కలుగకుండఁ గాపాడుటకు దొరతనమువా రుండుట యత్యావశ్యకము.

ఇట్టి నిబంధనలు మనుష్యులలో మాత్రమే కాదు. మృగములలోను, పక్షులలోను గూడ నైకమత్యము, కుటుంబవాత్సల్యము మొదలగునవి యున్నవి. అవియు కొన్ని యేర్పాటులను జేసికొని వాని ననుసరించియే ప్రవర్తించుచున్నవి. చీమలు మిక్కిలి చిన్నవైనప్పటికిని వానియైకమత్యమును వానిబుద్ధికుశలతను జూచినయెడల మనకు మిక్కిలి యాశ్చర్యమగును. తేనెటీఁగలయైకమత్యమును వానియేర్పాటును జూడుఁడు. తేనెతెట్టె నొక రాజ్యముతోఁ బోల్పవచ్చును. ఆ యీఁగలలో కొన్ని మైనముతో గూళ్లను కట్టుచునేయుండును. కొన్ని వెలు

పలికి పోయి పూవులలోని తేనెను తెచ్చుచునేయుండును. కొన్ని, మనుష్యులు దగ్గఱకు రాకుండునట్లు తెట్టెను గాపాడుచు దగ్గఱకు వచ్చినవారిని గుట్టి పాఱిపోవునట్లు చేయుచుండును. ఈ యీఁగలకన్నిటికిని ప్రభువుగా నొక యీఁగ యా తెట్టెపైని గూరుచుండియుండును. ఆ యీఁగయెడఁ దక్కిన యీఁగలన్నియు భయభక్తులు గలిగి నడుచుకొనుచుండును. నాగరికత యభివృద్ధియైన యొక రాజ్యము యొక్క పద్ధతియును, ఏర్పాటులును తేనెటీఁగలపద్ధతియును, నేర్పాటులును నొక్కరీతిగనేయున్నవి. ఈ యైకమత్యము మృగములయందును గలదు. అడవులలో నేనుఁగు లెల్లప్పుడును గుంపులు గుంపులుగనే పోవుచుండును. ఒక్కొక్క గుంపునకును నొక్కొక్క పెద్ద యేనుఁగు ప్రభువుగ నుండును. ఆ యేనుఁగు పోవుదారినే మిగిలిన యేనుఁగు లన్నియును పోవుచుండును. ఏ యపాయ మయిన రానున్నప్పుడు ముసలియేనుఁగులన్నియు చుట్టును నిలువఁబడి మధ్యను చిన్నవానినుంచును. ఈవిధముగ ఐకమత్యమును, ఏర్పాటులును కలిగించుటకు మృగములకుఁగూడ ప్రభుత్వ మనునది యొకటి యత్యావశ్యకమయియుండఁగా వేలువేలు తెగలు గల మనుష్యుల కట్టి దొరతన ముండవలసినది యెంత యవశ్యమో మనమే యోచింపవచ్చును.

రాజ్యమేలుట సులభకార్యము కాదు. జాతిమతాచారములనుబట్టి వేఱువేఱు తెగలుగల జనులు నివసించు దేశమును పరిపాలించుట సులభమయిన పని యని యెవరనఁగలరు? మహాసముద్రమధ్యమున నోడ నడుపుచుండునపుడు మాలిమికి మనస్సెట్లుండునో దేశమును పరిపాలించుదొరతనమువారిమనస్సట్లుండు ననుట నిశ్చయము. ఓడమాలిమి (నడుపువాఁడు) సముద్రమున మునిఁగియుండు కొండలవలనను, నాకస్మికముగ వచ్చు నలలతాఁకుళ్లవలనను, తుపానువలనను, నీటిదొంగలవలనను నే యపాయమును గలుగకుండ నోడను సురక్షితముగ రేవు చేర్చును. అట్లే కోట్లకొలఁదిజనులకును, నపరిమితమయిన ద్రవ్యమునకును స్థానమయిన యీ దేశమనెడు నోడను దొరతనమువా రనెడుమాలిమి యీ దేశముననే దాఁగియుండు శత్రువు లనెడుకొండలవలనను, క్షామము లనెడుతుపానులవలనను, పరదేశరాజు లనెడునీటిదొంగలవలనను నే యపాయమును గలుగనీయక తృప్తి యనెడు రేవున సురక్షితముగఁ జేర్చుచున్నాఁడు.



## 3. సర్కారువారు మనకుఁ జేసెడియుపకారములు.

గ్రామములయక్కఱలు, దేశములయక్కఱలు — విద్యాభివృద్ధి — వ్యవసాయసాధనములు — గ్రామజగడములును, వానిని దీర్చెడి యుపాయములును—గ్రామరక్షణము, దుష్టదండనము — దూత్యము — ప్రభుత్వధర్మములు – ఆంగ్లేయప్రభుత్వముయొక్క మేలులు—పరిపాలన పద్ధతులు.

మనుష్యులకు రాజొకఁడుండుట యత్యావశ్యక మనియు, నాతఁడు లేనియెడలఁ బ్రాణహాని, ధనహాని, కలహములు మొదలగు నాపదలు విశేషముగ సంభవించు ననియు, దేశము పాడయిపోవుననియు, నాగరికత యభివృద్ధియగుటకు దొరతనమే ముఖ్యకారణమనియు వెనుకఁ గ్రమముగఁ జెప్పియున్నాము. ఇప్పుడు మనలను పరిపాలించు నాంగ్లేయులు మనకష్టముల నెట్లు తొలఁగించుచున్నారను విషయమును, నే యే విధములగు కష్టముల నే యే యుపాయములచేతఁ దొలఁగించుచున్నారను విషయమును మనము విచారింపవలసియున్నది. అనేక కుటుంబములు చేరి యొక గ్రామ మగు ననియు, ననేక గ్రామములు చేరి యొక దేశ మగు ననియు వెనుకఁ జెప్పియున్నాము. కనుక, గ్రామవాసులకు సర్వసామాన్యముగఁ గావలయువస్తువులను, వారికష్టములను దెలిసికొన్నయెడల, దేశమువారికిఁ గావలసినవస్తువులను, వారికష్ట

ములను దెలిసికొన్నట్లే యగును. గ్రామవాసులస్థితి ప్రభుత్వముయొక్క స్థితిని నద్దమువలె నగపఱచును. పట్టణవాసులవలెనే గ్రామవాసులును, విద్య, ఐశ్వర్యము, నాగరికత మొదలగు విషయములయం దభివృద్ధి నొంది ప్రభుభక్తి నగపఱచుచున్నప్పుడే దొరతన ముత్తమస్థితియందున్నదని చెప్పవచ్చును. కావున గ్రామ మభివృద్ధి చెందినయెడల, నగర మభివృద్ధి చెందును; నగర మభివృద్ధి చెందినచో దేశ మభివృద్ధిచెందును. దేశ మభివృద్ధి చెందినచోఁ బ్రభుత్వ మభివృద్ధిచెందును.

గ్రామవాసులకు సర్వసామాన్యముగఁ గావలసిన వానిలో మొదటిది బాల్యవిద్యాభ్యాసము (Elementary Education). బాలురకు విద్యాభ్యాసము చేయించుటయు, మంచినడత నేర్పుటయుఁ బెద్దల కవశ్యకృత్యము. కావుననే యొక్కొక్క గ్రామమునందును మహానీయు లేర్పఱచినపాఠశాలలయందు బాలురు వ్రాయుటకును, చదువుటకును, లెక్కలువేయుటకును నేర్చుకొనుచున్నారు. ఇట్టి విద్యాభ్యాస మందఱకును గావలసినదే. తమబిడ్డల కన్నపానాదుల నిచ్చి సంరక్షించునట్లే విద్యాభ్యాసము చేయించుటయుఁ దల్లిదండ్రుల కవశ్యకర్తవ్యము. తల్లిదండ్రులు తమబిడ్డల కింటియొద్దఁ బ్రత్యేకముగ నొకయుపాధ్యాయునిచే విద్య చెప్పించుటకంటెఁ బాఠశాలలోఁ బదిమంది

బాలురతోఁ గూరిచి విద్య చెప్పించుట చాల మంచిది. దానివలన బాలురకు శీఘ్రముగ విద్యాభివృద్ధి యగును. ఒకగ్రామ మున్నచో దానియందొక బడి యుండకమానదు. ఒక క్రొత్తవాఁడొక గ్రామమునకుఁ బోఁగానే దానియందొకబడి యున్నదనువిషయ మా గ్రామము నందలి బాలురకేకలవలననే తెలియవచ్చును.

గ్రామవాసులకు ముఖ్యమైన వృత్తి వ్యవసాయము.



బెజవాడ కాలువలు.

వ్యవసాయము చేయువానికి సంవత్సరము పొడుగునను నానెలలో నేదో యొకపని యుండును. మొదట నేల దున్ని

సమముచేసి విత్తనములను నాఁటి నీరుపెట్టి మొలకలను పెంచి కలుపుతీసి పక్షులును మృగములును పైరు తిని పోకుండఁ గాఁచి పండినపంటను గోసి యింటికిఁదెచ్చి ధాన్యమును భద్రముగఁ గాపాడుకోవలెను. మఱియు, గ్రామవాసు లందఱు ను చేరి తమగ్రామములో నున్న కాలువలు, చెఱువులు, బావులు మొదలగు జలాధార ములగట్లను భద్రముగఁ గాపాడుచు, నీరు వచ్చుతూము లను, కాలువలను సంవత్సరము పొడుగునను చక్కఁబఱచు కొనుచు సంరక్షించుచు నుండవలెను. లేనియెడల నేలపై మన్ను చేరి మెట్టయి నీ రెక్కదు. కనుక నందఱిభూములకు సరిగా నీరు వచ్చుచుండునట్లు చూచుకొనుచుండుట గ్రామస్థులకు ముఖ్యకార్యము. నీటివసతి తక్కువయగు కాలమున నొక్కొకఁడును తనతనభూమికి నీరు కావలె నను విషయమునుగూర్చి యొకనితో నొకఁడు జగడము లాడుచుండుట తటస్థించును. కావున నన్ని భూములకును సమముగ నీటిని పంచిపెట్టుట కొకనిని నియమించియుం డుట గ్రామస్థులకు విధాయకకృత్యము.

గ్రామవాసులు జగడము లాడుచుండునది నీటిని గుఱించిమాత్రమే కాదు. గ్రామమున నుండువా రందఱు నైకమత్యముతో నుండవలసినవిషయమున, వారు తమ తమకుఁ గల బాధ్యతలను హక్కులను దమకుఁ దెలిసియో

తెలియకయో, యితరులబాధ్యతలను హక్కులను తాము పంచుకొనవలయునను నుద్దేశముతోడనో యప్పుడప్పుడు తగువులాడుచుందురు. ఈ విధముగ వారికి నీతివిషయమునను, ద్రవ్యవిషయమునను, మతవిషయమునను, వ్యాపారవిషయమునను, జ్ఞాతులవిషయమునను నీ మొదలైన విషయములయందు సాధారణముగ జగడములు జరుగుచునే యుండును.

ఈ జగడములను సులభముగఁ దీర్పఁదగినయేర్పాటులను జేసియుండనియెడలఁ బ్రజలు జీవించుటయే కష్టముగ నుండియుండును. దుర్మార్గులను శిక్షించి సన్మార్గులను కాపాడుటకును బలహీనులహక్కులను స్థిరపఱచుటకును దగిన యేర్పాటులను జేసియుండకపోయినయెడలఁ గలహములు ప్రబలి బలవంతులు పెట్టుబాధలకు బలహీనులు గుఱియగుట దటస్థించియుండును. కావుననే గ్రామమున నప్పుడప్పుడు జరుగు కలహములను జక్కఁబఱచుట కా గ్రామమున నుండు ప్రముఖులను నలుగురైదుగురను పంచాయతీ నేర్పఱచుకొని యుందురు. ఆ పంచాయతీవారా గ్రామమున నుండువారగుటచేతను, ఆ గ్రామవాసులస్థితిగతులను జక్కఁగ నెఱిఁగినవారగుటచేతను నీలాటికలహముల ననాయాసముగ న్యాయమార్గమునఁ దీర్చుచుందురు

గ్రామముయొక్క మంచిస్థితి దానియంతఃకలహముల

వలనను, వెలుపలివారివలన సంభవించునపాయములవల నను జెడిపోవుచుండును. గ్రామవాసులను భయపెట్టి వారిసర్వస్వమును గొల్లగొనుటయే జీవనముగ నేర్పఱచు కొనువా రనేకులు దేశమునఁ బ్రబలియున్నారు. కొందఱు దొంగ లర్ధరాత్రమున నెరికిఁ దెలియకుండ గుంటనక్కల వలెఁ గన్నము త్రవ్వి లోనఁ బ్రవేశించి యింటివారివస్త్రాభర ణాదుల నపహరించికొనిపోవుచుందురు. మఱికొందఱు దివిటీదొంగలు బహిరంగముగనే కాగడాలను వెలిఁగించు కొని గుంపుగ గ్రామమునఁ బ్రవేశించి యందలి భాగ్య వంతునియింటఁ దూఱి యింటివారిని స్తంభములకుఁ గట్టి వైచి ద్రవ్య మున్నచోటుఁ దెలుపుఁ డని బాధించి వారి చేతనే ద్రవ్యమును దెప్పించి తీసికొని యెవరికిని దెలియ కుండనే తెల్లవాఱులోపలఁ బాఱిపోవుచుందురు. వీరికి **దివిటీదొంగ** లని పేరు. ఈ దక్షిణహిందూదేశమునఁ గొన్ని జిల్లాలలోఁ బశువులను దొంగిలించుటయందు నిపుణు లగువారు పలువురు గలరు. ఇట్టి దొంగలవలని యుపద్రవములు లేక గ్రామవాసులు జీవింపవలసినవారు కావున నట్టిదొంగలను జక్కఁగ గుర్తెఱుఁగఁగల యొకనిని వారు నియమించుకొనియుందురు.

ఇట్లు నియమింపఁబడిన కావలివాఁడు గ్రామవాసులకు దొంగలు మొదలగు క్రూరజనులవలనను, వైరులకు

జంతువులవలనను హానికలుగకుండునట్లు చూచుకొనుచుం డును. బళ్లారి, అనంతపురముజిల్లాలలోఁ బ్రతిగ్రామము చుట్టును కోటకు గోడవలె గ్రామవాసులు ముండ్లకంచె లను పెంచి పగ లంతయు జాగ్రత్తతోఁ గాచుచుండి, రాత్రి యెనిమిదిగంటలు కాఁగానే దారులను మూసివేయు చుందురు. దొంగలు మొదలగువారివలనియుపద్రవములు రాకుండ నిట్టి యేర్పాటులను గావించికొనుట వారి కవశ్య కర్తవ్యము.

ఇట్లొక కావలివానిని నియమించుకొనుట మాత్రమె గాక గ్రామవాసు లందఱుఁ జేరి చేసికొనవలసిన యేర్పాటు లింకను గలవు. వారు తమగ్రామమునుండి యితరగ్రామ ములకు జాబులను దీసికొనిపోవుచుండుట కొకని నియ మించుకొందురు. గ్రామమున నొక్కొకఁడు నొక్కొకని నియమించికొని వానిచేత జాబులను బంపుచుండుటకంటె నందఱుఁ జేరి యొక్కని నియమించుకొనుట యెంతయు బాగుగ నుండును. నాగరికత యభివృద్ధియగుచుండుటచే ననాయాసముగ దూరస్థలములవారితో నుత్తరప్రత్యుత్తర ములను జరుపుచుండు నీ కాలపువారికి నాగరికతయొ కించుకయు లేని పూర్వకాలపువారు దూరస్థలములవారితో నుత్తరప్రత్యుత్తరములను జరుపుకొనవలసివచ్చునపుడు, వారు పడుచుండెడు కడగండ్లను గొంతవఱకు సూచింప

వలసియున్నది. స్వల్పమైన వెచ్చముతో దూరప్రయాణము చేయుటకు సాకర్యము లేకుండుటచేతను, దొంగలభయ మెక్కువగ నుండుటచేతను, యాత్రాపరులు నిర్భయముగ ప్రయాణము చేయఁదగిన రాజమార్గములు లేకుండుట చేతను బూర్వకాలమున దూరస్థలములతో నుత్తరప్రత్యు త్తరములు జరుపుట చాల దుష్కరముగ నుండెను.

ఇంతవఱకు గ్రామవాసులకొఱఁతలను దెలిపితిమి. గొప్ప పట్టణములయం దుండువారికొఱఁతలు నిట్టివే. స్థాలీపులాకన్యాయానుసారముగ గ్రామవాసులకొఱఁత లను జూచి పట్టణవాసులకొఱఁతలను దెలిసికొనవచ్చును. గ్రామవాసులు తమబిడ్డలకు విద్య నేర్పుటకును, సొత్తు లను కాపాడుటకును, వివాదములను దీర్చుటకును, నుత్తర ప్రత్యుత్తరములను జరుపుటకును సేద్యము చేయుటకును వలయు నేర్పాటుల నెట్లు తామె చేసికొనుదురో, యట్లే కోట్లకొలఁది జనులు వసించు నీ దేశమునకు వలయుమేలు లను దొరతనమువారు సమకూర్చుచున్నారు. దొరతనము వారు ప్రజలకొఱఁతలను దీర్చుటయు, బాలురవిద్యాభి వృద్ధికి వలయుసాకర్యముల నేర్పఱచుటయు, దొంగ తనము, బొంకులాడుట, జూదము, హత్య, బందిపోటు లోనగు దుష్కృత్యములు జరుగనీకుండుటయు, పరరాష్ట్ర రాజులభయము కలుగనీకుండుటయు, దూరస్థలముల

వారితోఁ నచిరకాలమున ననాయాసముగ నుత్తరప్రత్యు త్తరములను జరుపుకొనుటకు సులభమార్గముల నేర్పఱచుటయు లోనుగాఁగల మహోపకారముల నెన్నియో చేయుచున్నారు. దీనివలనఁ బ్రజలకు సంతుష్టి, సత్ప్రవర్తనము, సమృద్ధి లోనగునవి గలుగును. దొరతనమువారు గ్రామములయందున్న చిన్నచిన్న పాఠశాలలను బోలెనే పట్టణములయందును విద్యారంభమునకు వలయు చిన్న పాఠశాలలను మాత్రమే కాక యున్నతవిద్యాబోధకములగు కలాశాలలను (Colleges) స్వయముగ నేర్పఱచియు, నితరు లేర్పఱచెడుపాఠశాలలకును, గలాశాలలకును సాహాయ్య మొనర్చియుఁ బ్రజలకు విద్యాదానము సేయుచున్నారు. నీటిపాఱుదల కనుకూలము లగు కాలువలను ద్రవ్వించుచు, నదులు, చెరువులు మొదలగువానిగట్లను మరమ్మతుచేయించుచు, నదులలోని నీరు వృథాగాఁ బోకుండ నానకట్టలను గట్టించుచును చుట్టుప్రక్కల నున్న గ్రామములకు మంచి నీటివసతిని గలిగించుచునున్నారు. గ్రామములను గావలికాచువానివలెనే దొరతనమువారు సేనల నుంచియు, బంట్రౌతుల నుంచియు జనులను గాపాడుచున్నారు. జనులవివాదములను దీర్చుటకును, గష్టములను నివారణసేయుటకును న్యాయస్థానముల నేర్పఱచియు

న్నారు. ప్రయాణికులు నిర్భయముగఁ బోఁదగిన రాజమార్గములను, వర్తకులు కొంచెము వెచ్చముతోడనే దూరప్రయాణము సేయఁదగినయినుపదారులను, జనులనాయాసముగ దూరస్థలములతో నుత్తరప్రత్యుత్తరములను జరుపుకొనఁదగినట్లు తపాలాఫీసులను, టెల్లిగ్రాఫు ఆఫీసులను, బీదసాదలు నదులను దాఁటిపోవుటకు సేతువులను, జనులు మార్గాయాస మపనయించుకొనుటకు మార్గములయందచ్చటచ్చట విశ్రమస్థానములను (Rest-houses) నేర్పఱచియున్నారు.

ఈవిధముగ దొరతనమువారు మన కొనరించుచుండు మహోపకారము లసంఖ్యాకములుగ నున్నయవి. పట్టణములయందు మాత్రము గాక, పల్లెలయందును ధర్మవైద్యశాలలను స్థాపించి యాబాలవృద్ధముగ స్త్రీపురుషులకు వారివారివయస్సులకును రోగములకును దగిన యౌషధముల నిప్పించియు, గాయములకును వ్రణములకును శస్త్రవైద్యము సేయించియుఁ బ్రజలను గాపాడుచున్నారు. జనుల కుపద్రవమును గలిగించు పిచ్చివాండ్రకును, కుష్ఠరోగులకును, సుఖరోగులకును వేఱువేఱు ధర్మవైద్యశాలలను స్థాపించియు, కలరా, మహామారి, మశూచి మొదలగు నంటురోగములు గలవారి నూరివెలుపలఁ బాకలలో నుంచియు నౌషధముల నిప్పించుచున్నారు. మనుష్యులరోగములకు వలెనే జంతు

వులరోగములకును వైద్యశాలలను స్థాపించియున్నారు. ఈవిధముగ మనుష్యులరోగములకును జంతువుల రోగములకును వైద్యశాలలను స్థాపించి కాపాడుచుండిన మహానుభావుఁడు రెండువేలసంవత్సరములకు ముందు బౌద్ధమతప్రచారకుఁడగునశోకచక్రవర్తి యని మనము చరిత్రలయందుఁ జదివియున్నాము. అతనియనంతరమున నిట్టి మహోపకారమును గావించుచుండువారీయాంగ్లేయప్రభుత్వమువారే. వర్తకమునకుఁ గావలసినసౌకర్యము లీయాంగ్లేయులవలననే మనకుఁ గలుగుచున్నవి.

మనదేశమునకును బరదేశమునకును నెద్దియైనఁ గలహము పొసఁగునేని, జనులకుఁ బ్రాణహాని యేని ద్రవ్యహాని యేని గలుగనీకయు దేశగౌరవము చెడనీకయు వారు మనలను గాపాడుచున్నారు. వర్తకులకు వర్తకవిషయమునను, గ్రామవాసులకు గ్రామములసరిహద్దులవిషయమునను, జనులకు మానహానివిషయమునను, బరస్పర కలహములు పొసఁగునప్పుడొక దొరతనమువారికి మఱియొక దొరతనమువారితోఁ బైవిషయములనుగుఱించి కలహములు పొసఁగుచుండును. జనులు తమలోఁ దాము వివాదములు పడుచుందురేని, వారివివాదములను న్యాయస్థానములవారు తీర్చుదురు; దొరతనమువారు తమలోఁ దాము తగవులాడుకొనుచుందురేనిఁ దీర్చువారెవ్వరు? కావున

వారే తమలోఁ దా మెవ్వియో కొన్ని కట్టుపాట్లు నేర్పఱచి కొని సమాధానపడుదురు. అట్లు గావించికొననిచో నుభయదేశములయందలి ప్రజలకును బ్రాణహానియు ద్రవ్యహానియు మిక్కిలి కలుగును. దొరతనమువారికి సహనము, దయ, దూరాలోచనయు నున్నయెడల, శాంతి శీఘ్రముగనే కలుగును. మనదొరతనమువారియం దీగుణ త్రయమును సంపూర్ణముగ నున్న దనుటకు మనదేశము నందు నూఱుసంవత్సరములనుండి నెలకొనియున్నవారి స్థితియే ప్రబలనిదర్శనము. ప్రజలస్వాతంత్ర్యములను చెడ నీకయు, వారిలో వారికి వృథాకలహములు పొసఁగ నీకయుఁ గాపాడుచుండుటవలననే మనదొరతనమువారి గౌరవము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిఁ గాంచు చున్నది.

పైనిఁ జెప్పఁబడిన వివిధమహోపకారములను మనకు వర్షించి యాసేతుహిమాచలపర్యంతముగ నున్న జనసము దాయమునకుఁ గల వర్ణాశ్రమధర్మములను వారివారిస్థిర చరాస్తులను నిష్పక్షపాతముగ మనదొరతనమువారు గాపాడుచుండుట యెంతయు సంస్తవనీయము. నాటకరంగ స్థలమున సూత్రధారుఁడు నేపథ్యములోపలనుండియే వేష ధారుల నాడించి సభ్యులకు హృదయరంజనమును, నేత్రా నందమును గలిగించునట్లు, మనదొరతనమువారును మన

కంటికిఁ గనఁబడకయే క్రింది యుద్యోగులమూలమున మనకొఱంతలను దెలిసికొని వానిం దీఱిచి మనకు హృదయానందమును గలిగించుచున్నారు. ఈవిధముగ మన దొరతనమువారు మన కొనరించుచున్న యమితమహోపకారములలో నొక్కొక్కదానిని గుఱించియు నిఁకముందు సవిస్తరముగఁ దెలుపుట యవశ్యకర్తవ్యము.



## 4. దొరతనమువారును, బాల్యవిద్యయు.

బాలబోధనావశ్యకత — బాలబోధనయు, దొరతనమువారిపైవిచారణయు—దొరతనమువారిసహాయద్రవ్యము—ఏతన్నిర్ణాయకపద్ధతులు — దీనినుపయోగించుమార్గములు — బాలబోధనయొక్క తాత్కాలికస్థితి — ప్రకృతము బాలబోధనమునఁ జేయఁబడినసవరణములు — విద్యాశాలల నియామకులు — స్త్రీవిద్య—తాత్కాలికవిద్యాభివృద్ధి.

ఏపని చేయుటకును విద్య ముఖ్యసాధనము. ఇట్టి విద్యను మనము సంపాదించుటకు దొరతనమువారు చేయుచున్నపని సర్వోత్తమమయినది. ప్రతిగ్రామమునందును బాలురు చదువుటకును, వ్రాయుటకును, లెక్కలు వేయుటకు నుపయుక్తములయిన చిన్నచిన్న పాఠశాలలను స్థాపించియున్నారు. అట్టివానియందు బాలురకు మత వైషమ్య మించుకయు లేక సమదృష్టితో విద్యారంభము

చేయఁబడుచున్నది. ఆ బాలురు యుక్తవయస్సువచ్చిన తరువాత ప్రౌఢవిద్య నభ్యసించుటకును, దన్మూలమున జీవనోపాధి సంపాదించుకొనఁ దనువుపడువర్తకమును, చేతిపనులను, ఉద్యోగములను సంపాదించుకొనుట కంతకును నీ బాల్యవిద్యయే ముఖ్యసాధన మగును. దేశమున నెంత విస్తారముగ బాల్యవిద్య ప్రబలి, వాణిజ్యము, వ్యవసాయము, శిల్పములు లోనగువానివలన జనులకు జీవనోపాధి యేర్పడుచుండునో, యంతవిస్తారముగ దేశమున నాగరికతయు క్షేమమును విస్తరిల్లుచుండును. జనుల సౌజన్యమును, గుణసంపత్తియు వారు బాల్యమునఁ బడసిన విద్యాభ్యాసమును, సుశిక్ష ననుసరించి యుండును. ఎట్టి చెడునడత గలవానినైనను బాల్యమున గట్టిశిక్షమూలమున సత్ప్రవర్తనమునకుఁ దేవచ్చును. వయసు వచ్చినతరువాతఁ దెచ్చుట యసాధ్యము. మ్రానివంకరను దాని మొలక ప్రాయమునఁ దీర్చుట సులభసాధ్య మగును గాని యెదిగినతరువాత నగునా? కావుననే మనదొరతనమువారు విశేషధనము వ్యయపఱచి బాల్యవిద్యను విస్తరింపఁజేయుచున్నారు.

గ్రామములయందును, బట్టణములయందును గల విద్యాశాలలయందలి బాలురు చక్కఁగ విద్యాభ్యాసమును

జేయుచుండుటను, ఉపాధ్యాయులు చక్కఁగ విద్యను గఱపుచుండుటను విచారించుచుండుటకును, వారికిఁ దెలియని విషయములను దెలుపుచుండుటకును, విద్యాశాలలను నడుపుచుండుయజమానులు తమవిధాయకకృత్యములను జక్కఁగ నిర్వహించుచుండుటను విచారించుటకును ఇన్‌స్పెక్టర్లను, సూపర్వైజర్లను నియమించియున్నారు. ఈ సూపర్వైజర్లు పల్లెలయందలి పాఠశాలలకుఁ బలుతడవలు హఠాత్తుగఁ బోయి వానినామావళి, హాజరుపట్టీలను, జమఖర్చులెక్కలను బరీక్షించి, సద్విద్యోపదేశమునకు నావశ్యకము లగువిషయములను ఉపాధ్యాయులకుఁ దెలియనివానిని దెలుపుచుందురు. ఇన్‌స్పెక్టర్లును సంవత్సరమున కొకపర్యాయమో రెండుపర్యాయములో యీ పాఠశాలలకు వెళ్లి యీవిధముగనే పరీక్షించుచుందురు.

ఈవిధముగ దొరతనమువారు పాఠశాలలను బరీక్షించుటమాత్రము కాక కొన్నిటికి వానివానిస్థితులకుఁ దగినట్లు ద్రవ్యసాహాయ్యమును జేయుచుందురు. ఉపాధ్యాయులకు జీతముల నిచ్చుట, విద్యాశాలలను కట్టుట ఆ శాలలకు వలయు కుర్చీలు, బెంచీలు మొదలగు సాధనములను జేర్చుట లోనుగాఁ గల యనేకవిషయములకయి ధనవ్యయము చేసి యొక పాఠశాలను జరుపుకొనుట యెంత కష్టముగ నుండును! ఇంతకును గావలసినద్రవ్యము విద్యా

ర్థులనుండి యైనను, స్థాపకులనుండి యైనను రావలయును గదా. ఈ దేశమునఁ బ్రజలలో బీదలు విస్తారముగా నుండుటచేతను, బాల్యవిద్యాభ్యాసప్రయోజన మెఱుఁగనివా రగుటచేతను, వీరు దమ బిడ్డల కెక్కువ జీతముల నిచ్చి చదువు చెప్పింపఁజాలరు; కావున విద్యార్థులనుండి విశేషద్రవ్యమును జేర్చుట కనువుపడదు. పాఠశాలల యందు విద్యార్థు లిప్పు డిచ్చుచున్న జీతముల నింకను దగ్గించి బాల్యవిద్యను బ్రబలఁజేయవలయును. విద్యాశాలాస్థాపకులు పలువురు పాఠశాలలకుఁ గావలయునంత ద్రవ్యసాహాయ్యము చేసి విద్యాభివృద్ధిఁ గావింపవలయునను పరోపకారచింత గలవారుగ నుండరు. గ్రామపాఠశాల లనేకములు వానియందలి యుపాధ్యాయులచేతనే పోషింపఁబడుచున్నవి. వీరు నిఱుపేదలుగనే యుందురు. కావునఁ జదువుచెప్పుటయే జీవనాధారముగఁ బెట్టుకొందురు. ఇది లాభకరమైన వృత్తి కా దనుట యంద ఱెఱిఁగినదియే. చదువు చెప్పి భాగ్యవంతుఁడయినవానిఁ దఱచుగా నీలోకమున మన మెన్నఁడును విని కని యెఱుఁగము. వనపాలకుఁడు వృక్షములయం దంకురించిన పుష్పములకు దోహదము లొనర్చి వానికి గుణాభివృద్ధిని గావించున ట్లుపాధ్యాయుఁడు విద్యార్థులకు సుశిక్షయు, విద్యాదానమును గావించి, వారికి గుణాభివృద్ధి నొసఁగినను నాతని

కాదాయఫలము చాల తక్కువగ నుండును. ధనాదాయము లేకున్నను బాలశాలలను జరుపుకొనుచుండువారికి సహాయద్రవ్యము (Grant-in-aid.) నొసంగి కాపాడుచున్నారు. ఇట్లు సహాయద్రవ్యమును బడయువారు పాటింపవలసిననిబంధనలను దొరతనమువారేర్పఱచియున్నారు. సహాయద్రవ్యమును బడయనిపాఠశాలలవారు నిఁకముందా సాహాయ్యమును బడయఁగోరి యానిబంధనముల ననుసరించియే నడుచుకొనుచుందురు.

ఇట్లు దొరతనమువా రిచ్చుసహాయద్రవ్య ముపాధ్యాయులజీతములకును, పాఠశాలలను కట్టుకొనుటకును, కుర్చీలు మొదలగుసామానులను కొనుటకును, పేదవిద్యార్థులకు ద్రవ్యసాహాయ్యము చేయుటకును జాలియుండును. కొన్ని సంవత్సరములక్రిందటివఱకు నీ దేశమునందును, ఇంగ్లాండుదేశమునందును దొరతనమువా రిచ్చుచుండు సహాయద్రవ్యము ప్రతిసంవత్సరము ఇన్‌స్పెక్టర్లుచేయుపరీక్షలఫలితము ననుసరించియుండినది. దానివలన నుపాధ్యాయు లిన్‌స్పెక్టర్లు పరీక్షకు వచ్చు కొన్నిదినములకు ముందుగ మాత్రము బాలురు చక్కఁగ పరీక్ష నిచ్చుటకుఁ దగినట్టి ముఖ్యవిషయములను శ్రద్ధతో నేర్పుచుండిరి గాని వారిసత్ప్రవర్తనమునకు వలసిననీతిబోధమును గఱపుచుండిన

వారుకారు. పరీక్ష చేసి పరీక్షాధికారు లిచ్చుసహాయ ద్రవ్యము వారిచిత్తవృత్తి ననుసరించియు విద్యార్థుల నైపుణ్యము ననుసరించియు నుండుచుండినది. కావున సహాయద్రవ్యముయొక్క మొత్తము ప్రతిసంవత్సరమునను మాఱుచుండినది. ఇట్లు మాఱుచుండుటవలన నుపాధ్యాయులు బాలురకు విద్య గఱపువిషయమున నొక స్థిరపద్ధతి ననుసరించుటకు వీలులేకుండినది. ఉపాధ్యాయులకును విద్యార్థులకు ననేకము లగు నష్టములు గలుగుచుండినవి. ఇట్టినష్టములను దొలఁగించుటకై దొరతనమువా రిప్పుడొక క్రొత్తయేర్పాటును జేసియున్నారు. విద్యాశాలయందలి బాలురసంఖ్య, ఉపాధ్యాయులయోగ్యత, వారు బోధించు విషయము, విద్యాశాలకు వచ్చు నాదాయము, విద్యాశాల యుండు స్థలము లోనుగాఁగల విషయములను జక్కఁగ యోచించి యొక్కొక్క విద్యాశాలకు నింత మొత్తమని యొక శాశ్వతమైన ద్రవ్యనిర్ణయమును జేసియున్నారు. కావున నిప్పు డుపాధ్యాయులు తమపూర్వపద్ధతులను విడిచిపెట్టి యక్కఱతో బాలురకు విద్య గఱపుచుఁ బాఠశాల నుత్తమస్థితియం దుంచఁ బ్రయత్నించుచున్నారు. దొరతనమువారు మధ్యపరగణాలయందు (Central Provinces)మాత్రము పూర్వపద్ధతులను క్రొత్త పద్ధతులను ననుసరించి కొన్ని యేర్పాటులను జేసియున్నారు.

చెన్నపురిమాగాణమున వాడఁబడు విద్యావిధులంబట్టి, యుపాధ్యాయులకు జీతము లిచ్చుటకును, ఉపాధ్యాయవృత్తి నభ్యసించువారికి నుపకారవేతనముల నొసఁగుటకును, పాఠశాలకుఁ గావలసిన కట్టడములు, విద్యార్థుల బసలు, భోజనశాలలు మొదలగువానిని గట్టుటకును, పుస్తకములు, నల్లబల్లలు, కూర్చుండుబల్లలు, మేజాలు, కుర్చీలు, వస్తుపరీక్షోపకరణములు, కుట్టుపని మొదలగు శిల్పపాఠములకు వలయుసాధనములు మొదలగునవి కొనుటకును, క్రొత్తగా నొకశాస్త్రభాగము నేర్పఱచుటకును, విద్యార్థులకు ద్రవ్యసాహాయ్య మొనర్చుటకును, విద్యావినోదశాలలు, శిల్పశాలలు, వస్తుపరీక్షాశాలలు మొదలగువానికై ద్రవ్యసాహాయ్యము చేయువారి కుత్సాహము గలిగించుటకును బ్రభుత్వమువారు ద్రవ్యసాహాయ్యము చేయుచున్నారు. సంవత్సర మొక్కటికి, నొక్కొక్కయుపాధ్యాయునికి ముప్పదియాఱురూపాయలవంతునను, సంవత్సరము పొడుగునను నిర్ణీతము లైనదినములకంటె నెక్కువగ హాజరయ్యెడు విద్యార్థులకుఁ దల యొక్కటికి నెనిమిదియణాలవంతునను, నొకలెక్కడవగా నీ యుపకారద్రవ్య మొసఁగఁబడుచున్నది. బాలురకు శిక్ష చెప్పుటయందును, దేహపరిశ్రమము, చిత్రలేఖనము మొదలగువాని నేర్పుటయందును మేలుబంతి యని తమకుఁ దోఁచిన

పాఠశాలలకుఁ బైఁజెప్పిన మొత్తమును, దానిలో నాలవపా లెక్కువగను నొసఁగుటకును, మంచిస్థితిలో నుండనివాని కియ్యవలసిన మొత్తమున నాలవవంతు తక్కువగా నొసఁగుటకును బైవిచారణాధికారు లధికారమును బొందియున్నారు. పాఠశాలాభవననిర్మాణమున కైనవ్యయములో మూడింట నొకభాగమును, సామగ్రులవెలలో నర్ధభాగమును, విద్యాశాలాభివృద్ధికై ఘను లగుధనవంతులొసఁగుచందాధనంబున సగముకంటె నెక్కువ కాకుండు మొత్తమును సాహాయ్యము చేయఁబడుచున్నది. ఇట్లు ద్రవ్యసాహాయ్యము చేయుటయేగాక యే యుద్దేశముతో విద్యాశాలలు స్థాపింపఁబడినవో యా యుద్దేశము నిర్విఘ్నముగ సాగుచుండునట్లు చూచుకొనుచున్నారు. ద్రవ్యసాహాయ్యసంబంధ మయినని బంధనము లన్నియు నిచ్చట నుండునట్లె యితరప్రాంతములయందు నప్పు డప్పుడు మాఱుచునే యుండును.

దొరతనమువా రింతగా ద్రవ్యసాహాయ్యము చేయుచున్నను, నీ దేశమున విద్యాభివృద్ధి హీనదశయందే యున్నది. 1901 సం॥ జనాభా లెక్కలవలన 1000-కి 98 మంది మగవారును 7-గురు ఆఁడువాండ్రును వ్రాయను జదువను నేర్చినవారుగ నున్నట్లు కానఁబడుచున్నది.

ముప్పదికోట్లజనసంఖ్య కల యీ దేశమున 1900 సం॥న,

1,50,000 పాఠశాలలును, 45,00,000 విద్యార్థులును, 1858 సం॥నందు 2,000 పాఠశాలలును, వానియందు 2,00,000 విద్యార్థులు నుండిరి. కడచిన యేఁబది సంవత్సరములలో బాల్యవిద్య యింత యభివృద్ధి చెందుచుండినను, బాల్యవిద్య నింక నభివృద్ధిచెందింపవలయు నని దొరతనము వారు ప్రయత్నముచేయుచున్నారు. ఇంగ్లండు, జర్మనీ దేశములయందు వలె నీదేశమునఁగూడ విద్యార్థులు జీతముల నీయక నిర్బంధవిద్య నభ్యసించునట్లు చేయుటకు

| మాగాణము. | 1000-కి వ్రాయను జదువను నేర్చినవారు. | |
|---|---|---|
| | పురుషులు. | స్త్రీలు. |
| బర్మా ... | 378 | 45 |
| తిరువాన్కూరు ... | 215 | 31 |
| బరోడా ... | 163 | 8 |
| మదరాసు ... | 119 | 9 |
| బొంబాయి ... | 116 | 9 |
| బంగాళము ... | 104 | 5 |
| మైసూరు ... | 93 | 8 |
| పంజాబు ... | 64 | 3 |
| హైదరాబాదు ... | 55 | 3 |
| కాశ్మీరము ... | 38 | 1 |

ప్రయత్నపడుచున్నారు. దీనికి వలయుకర్మి వారికిఁ గలిగి నప్పుడిట్లు నడచుట కేమియు సంశయ ముండదు. ఈవిధ ముగ వేలు వేలు మాగాణములయందుఁ జదువుచుండు విద్యార్థులసంఖ్య యీ క్రింది పట్టీవలనఁ దెలియ వచ్చును.

బాల్యవిద్యాభ్యాసముయొక్క యుపయోగము పల్లెల యం దుండువారికంటెఁ బట్టణములయం దుండువారి కెక్కు వగఁ దెలియును గనుకఁ బట్టణములయందు బాల్యవిద్య యెక్కువ యగుచున్నది. పల్లెలయం దుండువారి కనేకు లకు చేవ్రాలు చేయుటయే తెలియదు. ఈ దేశమునఁ బల్లెలయందుండువారు చాలవఱకు వ్యవసాయమువలననే జీవించుచుండుటచేత విద్యాభ్యాసమునుగూర్చి వారు యో చించుటయే లేదు. వారు వ్యవసాయమునకుఁ దోడుగ విద్యనుగూడ నభ్యసించినయెడలఁ దమనేలలను క్రొత్త పద్ధతులవలన బలపఱచి వ్యవసాయము నభివృద్ధిపఱచుకోఁ గలుగుదురు. తమగ్రామములయం దంటురోగములు వ్యాపింపకుండుటకుఁ దగినమార్గములను గనిపెట్టఁగలుగు దురు. రైలుమార్గములప్రయోజనములను దెలిసికొనఁ గలుగుదురు. దేశాభివృద్ధికిని, నాగరికతాభివృద్ధికిని వలయు సాధనములను గనిపెట్టఁగలుగుదురు. సద్విషయములందు ద్రవ్యమును వ్యయము చేయఁగోరుదురు.

అయినను, నింతకుముందు ప్రచారమున నుండిన బాల బోధనపద్ధతులవలన, బాలురు వ్రాయను జదువను నేర్చి కొనిరేకాని, యుత్తరకాలమున జీవికాధారములుగాఁ గైకొనవలసిన శిల్పములను గూర్చిన విద్యను నేర్చుకొనరైరి. కావున నిప్పుడు గ్రామబడులయందుఁ జదువను, వ్రాయను, లెక్కలువేయను నేర్పుటయే కాక, తత్తద్దేశానుగుణంబుగ వృక్షజాతులను, మృగజాతులను, గాజులు మొదలగు వస్తువులనుగూర్చియు, మన దేశమునకుఁ గావలసినలెక్కపక్కలను, ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగు విషయములనుగూర్చియు, ఆరోగ్యశాస్త్రము, ప్రకృతి శాస్త్రము వీనినిగూర్చియు వస్తుపాఠములమూలముననుఁ, చిత్తరువులు మున్నగుసాధనములమూలమునను బోధన చేయఁబడుచున్నది. కొన్ని సమయములందు బాలురను బయటియూళ్లకుఁ బిల్చికొనిపోయియు నవసరములగు విషయములను నేర్పుటయుఁ గలదు. యుక్తములైన వృత్తుల నెఱిఁగిన విద్వాంసులు విశేషముగా లేమిచే, నిట్టి జీవికాధారవిద్యను బర్వఁజేయుట ప్రభుత్వమువారికిఁ బ్రయాసాస్పదముగా నున్నది. ఇప్పుడీ దేశమున ముప్పదిలక్షల మంది బాలురు ప్రభుత్వమువారిపాఠశాలలలో వృత్తి విద్యల నభ్యసించుచున్నారు. వీరికి బోధనార్థమై మితి మీఱిన విద్వాంసులు గావలయును. చాలినంత వేతన

మొసఁగినను, శిల్పవిద్యావిచక్షణులు విశేషముగా లభించుట యరుదుగా నున్నది.

పారిశ్రామికవిద్యలకై రాజ్యాంగమువారిచే స్థాపింపఁబడినపాఠశాలలు కొన్నియె యున్నవి. అనేకపాఠశాలలు **నగరవిచారణసంఘములచేతను**, **జిల్లావిచారణసంఘములచేతను**, శాస్త్రవిద్యను, నాగరికతను మొట్టమొదట నీ దేశమున వ్యాపింపఁజేసిన **క్రైస్తవపాదిరీలచేతను**, **క్రైస్తవసంఘములచేతను**, **జనులచేతను**, **జనసంఘములచేతను** బరిపాలింపఁబడుచున్నవి. **బంగాళము**, **బర్మా** మొదలగు ప్రాంతములలో జనకూటములచే నేర్పఱుపఁబడిన పాఠశాలలే మెండుగాఁ గలవు. **బొంబాయిభాగాణమునందుఁ** దఱుచుగాఁ బాఠశాలలు నగరవిచారణసంఘములచేతను, జిల్లావిచారణసంఘములచేతను మాత్రమే జరిపింపఁబడుచున్నవి. మనభాగాణమున నిరుతెగలగుపాఠశాలలు నున్నవి. ప్రభుత్వమువారిపాఠశాలలకును, జిల్లాసంఘములపాఠశాలలకును మెండుగాఁ దారతమ్యము లేదు.

ఇత్తెఱఁగున బాలురకుఁ జదువు నేర్పించుటయె కాక, విద్వాంసు లుపాధ్యాయవృత్తిని జక్కఁగా నభ్యసించుటకై పలుపాఠశాలలను గూడఁ బ్రభుత్వమువా రేర్పఱచి యున్నారు. ప్రకృతమున శిష్యులను సామోపాయప్రయోగముచేతనే కాని, దండోపాయప్రయోగముచే విద్య

నేర్పరా దనుట విధియైయున్నది. పూర్వమున "మర్దనం గుణవర్ధనమ్" అను లోకోక్త్యనుసారంబుగ నుపాధ్యాయులు బాలురను ఖైదీలనువలెను, నడవిమృగంబులను వలెను నెంచి, కోదండముతీయుట, సంకిళ్లువేయుట, పేముతోఁగొట్టుట మొదలగు శిక్షలచే లోఁబఱచుకొని, ఎక్కాలు, తగ్గులెక్కలు మొదలగువానిని నేర్పుచు వచ్చిరి. కాని, యిప్పుడు పాఠశాలలలో బాలురు మిక్కిలి ప్రేమతోఁ జూడఁబడి, పటములు, చిత్రములు, ఆటపాటలు, దేహపరిశ్రమము, వస్తుపాఠములు, అభ్యాసపాఠములు, బంకమట్టిబొమ్మలుచేయుట మొదలగు సన్మార్గములచే నీషత్తయినను శ్రమపెట్టఁబడక విద్య నేర్పింపఁబడుచున్నారు. దొరతనమువారు బాలికలకును నివ్విధంబుననే ప్రత్యేకపాఠశాలలను నిర్మించి, వ్రాఁత, గణితము మొదలగువానిని నేర్పించి, ముఖ్యముగా కుటుంబోపయుక్తములయిన కుట్టుపని, సంగీతము మొదలగువానిని నేర్పుచున్నారు. అయినను, బాలికావిద్య యీ దేశమున ననేక కారణములచేత బాగుగా వ్యాప్తము గాలేదు. కొంతమందికి స్త్రీవిద్యయందుఁ బ్రేమ లేదు. కొందఱు ప్రేమవంతులుగా నున్నను దమబాలికలను వివాహానంతరమునఁ బాఠశాలలకుఁ బంపఁజాలరు. ఆ వివాహము సైతము మించుమించుగాఁ బదునొకండవ యేటిలోపలనే ముగియు

చున్నది. మహమ్మదీయులు, రాజపుత్రులు మున్నగు జాతులవారవలంబించు "గోషా" పద్ధతులం దాఁడువారు వెలుపట వచ్చుట తగదు. కావున వారికిని బడి చదువున కును జాల దూరము. అంతియకాక మగపిల్లలనే చదివింపఁ జాలని యీదేశస్థు లెట్లు తమయాఁడుపిల్లలకుఁ జదువు చెప్పింపఁగలుగుదురు. స్త్రీవిద్య యనునది యీదేశస్త్రీల కలంకారమగు వినయమును, గౌరవమును నశింపఁజేయు నని కొందఱు జనులు తలంతురు. ఈ కారణములచేత స్త్రీవిద్య యించుమించుగా నొకస్థితిలో నిలఁబడియు న్నట్లు కనఁబడుచున్నది. కాఁబట్టి దొరతనమువారు స్త్రీ విద్యకుఁ గావలసిన సాయమును జేయుటకు పట్టుదల గల వారై యున్నారు. ఈదేశమున వివాహానంతరమున బాలి కలు విశేషముగాఁ బాఠశాలలకుఁ బోవమిచే, వారియిం డ్లకుఁ బోయి విద్య నేర్పుటకై కొందఱు పాదికీలును, నాషనల్ ఇండియన్ అసోసియేషన్ (National Indian Association) అను సంఘమువారును గొంత యేర్పాటు చేసియున్నారు. ఇట్టి యేర్పాటు ప్రభుత్వమువారు తామే చేయకపోయినను, పైసంఘములవారికి ద్రవ్యసాహాయ్య ము చేయుచున్నారు. బాలికాబోధనక్రమములను నేర్పు టకై పూనాలో పాధ్యాయాబోధనాభ్యాస పాఠశాల

(Presidency Training School for Mistresses) యను పాఠశాలను జెన్నపురియందు నెలకొల్పియున్నారు.

అసంఖ్యాకు లగు బాలురకును బాలికలకును నిత్తెఱంగున విద్య నేర్పింపఁ దొడఁగుట గడచినయేఁబది సంవత్సరములనుండియే. లోకమాతంబోలు విక్టోరియా మహాచక్రవర్తినిగారు ఈ దేశమును తమఘనపరిపాలనమునకు లోఁబఱచికొన్న పిమ్మటనే, యీ దేశమువారి కున్నత విద్యయు, జ్ఞానాభివృద్ధియుఁగలుగుటకై దొరతనమువారు పలు తెఱఁగులైన యేర్పాట్లను జేయుచున్నారు. ఆంగ్లేయ ప్రభుత్వమునకు పూర్వము, శిష్యులు విద్యయందును, జ్ఞానమునందును, నడతలందును శ్రేష్ఠు లయిన గురువుల కడకుఁ బోయి, గురుకులవాసముఁ జేసి, గురుశుశ్రూష లొనర్చి, విద్యాభ్యాసము చేయుచు వచ్చినట్లుగాఁ దెలియుచున్నది. మహమ్మదీయబాలురు బళ్లయందును, ధనికులు తమయిండ్లలో నేర్పఱచియుండు చిన్నపాఠశాలలందును "ఖోరాన్" మొదలగు మతగ్రంథములను "మౌల్వీలు" అను మహమ్మదీయపండితులయొద్దఁ జదువుచు వచ్చిరి. అయినను, ఇక్కాలంబున వేలసంఖ్యగా బాలురు చదువునట్లు పూర్వ మెప్పుడును జదివినట్లు కానంబడదు. ఆంగ్లేయ ప్రభుత్వమువలనఁ గలిగిన లాభములలో నజ్ఞానాంధకార

మును బోఁగొట్టెడు విద్యాదానము మహాలాభ మని చెప్పవలయును.



## 5. దొరతనమువారును, ప్రౌఢవిద్యయును.

ఉన్నతవిద్యాశాలలు — వీనియమరిక — మాదిరిపాఠశాలలయుప యోగమును, ఆవశ్యకతయు — ప్రాంతపద్ధతులు, క్రొత్తపద్ధతులు — ప్రకృతము చేయఁబడు సవరణలు—కలాశాలలును, సర్వకలాసభలును— వీనియొక్క తాత్కాలికస్థితి — వీనికిఁ బ్రభుత్వమువారు చేయుసాహా య్యము — శిల్పవిద్యాశాలలు — శిల్పవిద్యాశాలలపైవిచారణలును, తాత్కాలికస్థితియు—విద్యాశాఖయమరిక.

పేదలుగ నుండుటవలనను, వలయునంతటిజ్ఞానము లేని వారుగ నుండుటవలనను బాలురలో ననేకులు బాల్య విద్యనుమాత్ర మభ్యసించి నిలిపివేయుచున్నారు. ప్రౌఢ విద్యాభ్యాసమునం దభిరుచి గలవారికొఱకు దొరతనము వారు పట్టణములయందుఁ బ్రౌఢవిద్యాశాలలను, కలా శాలలను స్థాపించియున్నారు. ఈ ప్రౌఢవిద్యాశాలలలో స్వదేశభాషాపాఠశాలలనియు, ఆంగ్లేయభాషాపాఠశాల లనియు రెండు విధము లున్నవి. ఈ స్వదేశభాషాపాఠశాల లలో మూ డంతర్భాగములు గలవు. ఆ మూటియందును లక్ష్యలక్షణగ్రంథములును, గణితమును, భూగోళమును,

హిందూదేశచరిత్రమును నేర్పఁబడుచున్నవి. పై గ్రంథములతోఁగూడ విద్యార్థు లాంగ్లేయదేశచరిత్రము (English History), రేఖాగణితము (Geometry), అక్షరగణితము (Algebra), వ్యావహారికవిషయములు (Technical Subjects) వీనిలో దేనినైన నొకదానినిగూడ నేర్చుకొనవచ్చును.

ఆంగ్లేయపాఠశాలలలో నాఱుతరగతు లుండును. వానిలో మొదటిమూడుతరగతులభాగమునకు లోవర్ సెకండరీ (Lower Secondary) పాఠశాల లనియును; ఆఱుతరగతులభాగమునకు అప్పర్ సెకండరీ (Upper Secondary) పాఠశాలలనియును పేళ్లు. ఇట్లు రెండుపేళ్లు కలవియైనను రెండు తెగల పాఠశాలలు నొకపద్ధతినే యనుసరించి పనిచేయుచుండును. ఇంగ్లీషుభాషయందభిరుచి కలవా రగుటచే నీ రెంటియందును విద్యార్థులు విశేషముగఁ జేరి చదువుచున్నారు. ఇప్పు డీదేశములో నీపాఠశాలలందు సుమారు నాలుగున్నరలక్షలవిద్యార్థులు చదువుచున్నారు. వీరిలో నీ చెన్నపురి మాగాణములోనే (Madras Presidency) యెక్కువమంది విద్యార్థు లున్నారను విషయ మీ రాజధానియొక్క జనసంఖ్యను, విద్యార్థులసంఖ్యను సరిచూచినయెడల స్పష్టపడును.

ఈ పాఠశాలలు తఱచుగా మహాజనులచేతను, సాధా

రణజనసంఘములచేతను, పాదిరీలసంఘములచేతను మాత్రమే పోషింపఁబడుచుండుటచే, దొరతనమువారు వానికి సహాయద్రవ్యమును మాత్ర మిచ్చుచున్నారు. ఇట్లున్నను, బాలురకు సద్విద్యను నేర్పుపద్ధతులను దెలుపుటకుఁగాను దొరతనమువారొక్కొక జిల్లాయం దొక్కొకమాదిరి పాఠశాలను (Model School) స్థాపింపవలయు నని యోచించుచున్నారు. ఇట్టి మాదిరిపాఠశాలలయందు బోధనాపద్ధతులను జక్కఁగఁ దెలిసినయుపాధ్యాయుల కెచ్చుజీతముల నిచ్చి బోధించుటకు వలయు నుపకరణముల నమర్చి బాలురకు జ్ఞానామృతమును బోయుచున్నయెడల నితర పాఠశాలలు గూడ నుత్తమస్థితియం దుండు ననుటకు లేశమైనను సందేహ ముండదు.

అప్పర్ సెకండరీపాఠశాలలయందు ఆంగ్లేయభాషాకావ్యములు, గణితము, చరిత్రము, భూగోళము, దేశభాషలు, పూర్వికభాషలలో నేదైన నొకటి, మూలాధారశాస్త్రమును (Elementary Science) నేర్పఁబడుచున్నవి. ఇట్లాపాఠశాలలయం దాఱుసంవత్సరములు చదివిన తరువాత విద్యార్థులు కట్టవలసినపైకము కట్టి "మెట్రిక్యులేషన్" అను పేరు గల కలాశాలాప్రవేశపరీక్షకుఁ బోవుదురు. ఆ పరీక్షలోఁ దేఱినవా రుద్యోగముల కర్హులుగ నుందురని దొరతనమువా రేర్పఱచినందున, నుపాధ్యాయు లావిద్యా

ర్థులకు భవిష్యత్తున నవి వారి కుపయోగపడునా పడవా యను విషయమును యోచింపక పరీక్షకు వలయు విషయములను మాత్రము నేర్పి విద్యార్థులను పరీక్షలోఁ గృతార్థులనుగఁ జేయుచుందురు. 1901 సం॥న, రమారమి ఈపరీక్ష కిరువదిమూఁడు వేలమంది విద్యార్థులు దరఖాస్తులు పంపుకొనియుండిరి. పసితనముననే తమబిడ్డలు పెద్దపెద్దపరీక్షలిచ్చి, గొప్పయుద్యోగములు చేయుచుఁ దమ్ముఁ బోషింపవలయు నని యెంచి వారిశరీరారోగ్యస్థితిని గూడ యోచింపక, పిందెనే పండుచేయఁదలఁచెడుతోఁటవానివలెఁ దల్లిదండ్రులు తమ బిడ్డలను గష్టపెట్టి చదివించుచుండిరి. ఇది యెఱిఁగి దొరతనమువారు పదునైదు సంవత్సరములవయస్సునకు లోపల నున్న విద్యార్థు లీపరీక్షకు రాఁగూడ దని యొక నిబంధన యేర్పఱచిరి.

ఈ మెట్రిక్యులేషన్‌పరీక్ష విద్యార్థులకుఁ గాలేజితరగతులలోఁ జేరుట కర్హత గలిగించినదేకాని యంతటితోఁ జదువు చాలించుకొని లోకమున నేవిధముగనైన జీవనము సంపాదించుకొనఁ గోరువారి కేవిధమైనసాధనములను గలిగింపలేదు. కావుననే, 1882 సం॥న నియమింపఁబడిన విద్యావిచారణసంఘమువారు (Educational Commission) పైతరగతులలో రెండువిధములగు విద్యాభ్యాసపద్ధతులను నియమించి రెండువిధములగుపరీక్షల నేర్పాటు

చేసిరి. బొంబాయి మొదలగుమాగాణములయందు మెట్రిక్యులేషన్‌తోఁ గూడ పాఠశాలాంత్యపరీక్ష (School Final Examination) యను నొక పరీక్ష గూడ నేర్పాటుచేయఁబడినది. మనమాగాణమునందు మెట్రిక్యులేషన్‌తోఁగూడ అప్పర్ సెకండరీ అను పరీక్ష యేర్పఱుపఁబడెను. అయిన నీరెండు పరీక్షలు సర్కారుద్యోగములకు సమముగా భావింపఁబడుచున్నను, బలువురకుఁ గలాశాలా విద్యయం దభిరుచి మిక్కుటముగా నుండుటచేత మెట్రిక్యులేషన్ పరీక్షకే యెక్కుడు విద్యార్థులు చదువుచు వచ్చిరి. ఈ మెట్రిక్యులేషన్ పరీక్షపైనుండు మోహమును బాలుర కెల్లనఁ దప్పించి జీవనోపాయసాధనములను గల్పింపఁగల పాఠశాలాంత్యపరీక్షను దొరతనము వా రిప్పు డీమనమాగాణమున స్థాపించిరి. ప్రౌఢవిద్యాభ్యాసము కలాశాలా విద్యాభ్యాసమున కర్హత కలిగించునదిగ మాత్రముండక విద్యార్థులకు జీవనోపాయములను గలిగించునదిగఁగూడ నుండవలయును.

ఈ ప్రౌఢవిద్యాభ్యాసముతో మాత్రమే దొరతనము వారు మనలను విడిచిపెట్టరైరి. ఈ దేశపువిద్యను, తమ దేశపువిద్యను బాలురకు సంపూర్ణముగ నేర్పి దానివలని లాభములను బాలురు పొందవలయు నను నుద్దేశముతో



బొంబాయి సర్వకలా భవనము.

దేశమం దంతటను కలాశాలలను (Colleges) స్థాపించియున్నారు. ఈ కలాశాలలు రమారమి యేఁబదిసంవత్సరములక్రిందటనే స్థాపింపఁబడినవిగాని యంతకు ముందు లేవు. వానిలో ననేకములు దొరతనమువారిచేతను, మఱియనేకములు క్రైస్తవసంఘములచేతను, కొన్ని జనసంఘములచేతను, నేవో కొన్ని నగరవిచారణసంఘములచేతను బోషింపఁబడుచున్నవి. ఈ కలాశాలలలోనివిద్యార్థులకు విద్య నేర్పుటకును, వారిని బరీక్షించుటకును, వారికి

యోగ్యతాపత్రికల నిచ్చుటకును సర్వకలాభవనములను (Universities) చెన్నపట్టణము బొంబాయి, కలకత్తా, అలహాబాదు, లాహూరు అను నైదునగరములలో స్థాపించియున్నారు. ఈ సభవారు, విద్యాబోధనపద్ధతుల నేర్పఱచుటయే కాక, కలాశాలలలో నన్నులయిన గొప్ప పండితులు నియమింపఁబడి, విద్యార్థులు సన్మార్గమునకుఁ దేఁబడుచున్నారా లేదా యను విషయమునుగూడ గమనింపవలయును. మఱియు సర్వకలాశాలలయందలి సభ్యులు (Fellows) విద్యానైపుణ్యతారతమ్యమును గనిపెట్టఁ దగినంతటి సమర్థులుగ నుండవలయును. అయినను, 1904 సం॥ మువఱకు నీ సర్వకలాశాలలయందు సమర్థు లయిన సభ్యులతోఁ బలువు రసమర్థులు గూడ గౌరవార్థము చేర్చుకొనఁబడుచుండిరి. కావునఁ గలాశాలలయందు విద్యాభివృద్ధి వలయునంత తృప్తికరముగ నుండ కుండెను. కాఁబట్టి పైనిచెప్పిన 1904 సం॥న, దొరతనమువారు సర్వకలాశాలా సభలను (Senates) చిన్నవిగఁజేసి వివిధవిద్యాశాఖలయందుఁ బ్రావీణ్యముగలవారిని మాత్రమే సభ్యులనుగ నియమించునొకచట్టము నేర్పఱచిరి. ఈ క్రొత్త సభవారు విద్యార్థులను బరీక్షించి యోగ్యతాపత్రికల నిచ్చుటకును, విద్యార్థులకు వివిధవిద్యాశాఖలయందలి విషయములను గుఱించి యన్నికలాశాలలకు నుపయోగపడులాగున నుప

న్యాసముల నిచ్చుటకై సమర్థులగు నుపన్యాసకుల నేర్పాటు సేయుటకును, విద్యార్థులు దుర్వృత్తులయందుఁ బ్రవేశింపకుండునట్లు వారి నందఱిని గలాశాలాధికారులపైవిచారణక్రిందనుండు కట్టడములలో నుంచుటకును, విద్యార్థుల యుపయోగమునకయి పుస్తకభాండాగారములను, వస్తుపరీక్షాశాలలను, స్థాపించుటకును యోచించుచున్నారు. వీరు యోచించుచున్న యీ యేర్పాటులన్నియు నిప్పుడు ఉత్తరహిందూస్థానమున మహమ్మదీయులకయి యేర్పడియున్న అలీఘుర్ కాలేజియం దున్నవి. ఆచారవ్యవహారములును, వేషభాషలును వేఱువేఱుగ నుండుటచే వేఱువేఱు స్థలములయం దున్నకలాశాలలలో నీ యేర్పాటులన్నియుఁ జేయుట యసాధ్యముగ నున్నది. అయినను, విద్యార్థులవిద్యాభివృద్ధికి వలయుసౌకర్యములను గలిగించుటకు దొరతనమువారు ప్రయత్నపడుచున్నారు.

ఈ దేశమున నిప్పుడు 145 కలాశాల లున్నట్లును, వానియందుఁ బదునెనిమిదివేలమంది విద్యార్థులు చదువుచున్నట్లును దెలియవచ్చుచున్నది. ఈ కలాశాలలలో మొదటితరగతికలాశాల (First Grade Colleges) లనియు రెండవతరగతికలాశాల (Second Grade Colleges) లనియు రెండువిధము లున్నవి. మొదటితరగతివానియందు విద్యార్థులు నాలుగు సంవత్సరములును, రెండవతరగతి

వానియందు మొదటి రెండు సంవత్సరములును మాత్రము చదువవచ్చును. ఈ ప్రాంతమం దున్న కలాశాలలలో చెన్నపట్టణమున దొరతనమువా రేర్పఱచిన ప్రెసిడెన్సీ కాలేజియు, క్రైస్తవసంఘముచే నేర్పఱుపఁబడిన క్రిస్టియన్ కాలేజియు, పచ్చయప్పమొదలియారిచే నేర్పఱుపఁబడిన పచ్చయప్ప కాలేజియు, బెంగుళూరున మైసూరుమహారాజుచే నేర్పఱుపఁబడిన సెంట్రల్ కాలేజియు, విజయనగరమున నుండు మహారాజుగారి కాలేజియు ముఖ్యములైనవి. ప్రౌఢవిద్యను నేర్పుచుండు నాంగ్లేయవిద్యాశాలలకును, కలాశాలలకును వలయు సాధనములను, వానిజమాఖర్చులను దెలిసికొని మూడు సంవత్సరముల కొకపర్యాయము దొరతనమువారు వానికి సహాయద్రవ్యము నిచ్చుచున్నారు. ఈ ద్రవ్యసాహాయ్య మాయా విద్యాశాలలస్థితి ననుసరించి ప్రతిసంవత్సరమును మాఱుచుండును. ఈ విధమైన సాహాయ్యము మాత్రమే గాక కట్టడములకును పుస్తకనిలయములకును గూడ ద్రవ్యసాహాయ్యము చేయఁబడుచున్నది.

మఱియు వ్యవసాయము, ధర్మశాస్త్రము, వర్తకము, శిల్పము, వైద్యము, చిత్రలేఖనము మొదలగువానిని నేర్పుటకును కలాశాల లేర్పఱుపఁబడినవి. ఒక్కొక్కజిల్లాయందును నుపాధ్యాయుల కుపాధ్యాయత్వము నేర్పుటకు విద్యాశాలల



చెన్నరాజధాని కలాశాల.

నేర్పఱచి మంచిపద్ధతులను నేర్పుచున్నారు. ఈ విద్యాశాలలు కూడ నొక యిన్స్పెక్టరుయొక్క (Inspector of Training and European Schools) యధికారముక్రింద నుండినవి. ఇవి 1909 సం॥ ఏప్రెల్ మాసము మొదలాయా జిల్లాలయిన్స్పెక్టరులక్రిందఁ గూడ నుండునట్లు తీర్మానింపఁబడినది. కనుక, ఇప్పుడీ బోధనాభ్యసనశాలలకు (Training Schools) ఇద్దఱేసిలు ఇన్స్పెక్టర్లున్నారు. ఈ



చెన్నరాజధాని ధర్మశాస్త్రకలాశాల.

బోధనాభ్యాసశాలలు మాటిమాటికిఁ బరీక్షింపఁబడుచుండ వలయు ననియే యిట్టి యేర్పాటు చేయఁబడినది. జనుల విద్యాభ్యాసమునకును, సత్ప్రవర్తనమునకును ఉపాధ్యాయు లాధారభూతు లగుటచేతను, ఉపాధ్యాయులవిద్యకును, సత్ప్రవర్తనమునకు నీ యభ్యాసశాల లాధారభూతము లగుటి చేతను, జనులక్షేమమున కంతకును దా మాధారభూతు లగుటచేతను దొరతనమువా రీశాలల నన్నిటిని దామే

పోషించుచున్నారు. ఉత్తమబోధనాపద్ధతులను తెలుపు వస్తుపరీక్షాశాలలు, అర్థశాస్త్రశాలలు, శిల్పకలాశాలలు, చిత్రకలాశాలలు ఈ మొదలైనకలాశాలల నేర్పఱచుట కమిత ద్రవ్యము కావలసియుండుటచేత వీని నేర్పఱచుటకు దొరతనమువారికే గాని యితరులకు సాధ్యము కాదు. ఇప్పుడీ మాగాణమున 110 యుపాధ్యాయబోధనాభ్యాసశాలలున్నట్టును, వానియందు 4,500 ఉపాధ్యాయులు బోధనాపద్ధతుల నభ్యసించుచున్నట్టును తెలియవచ్చుచున్నది. ఈ సంఖ్యలో 50 విద్యాశాల లుపాధ్యాయులకయి యేర్పడియున్నవి. వీనిలో స్త్రీల కుపయోగపడుపద్ధతులే నేర్పఁబడుచున్నవి. ఈ పాఠశాలలలో 1,250 ఉపాధ్యాయులు చదువుచున్నారు. ఇంచుమించుగ నీ పాఠశాల లన్నియు పాదిరీలసంఘములచేఁ బోషింపఁబడుచున్నవి. ఇతరమాగాణములయం దున్నవానికంటె నీ పాఠశాలలస్థితి యీ మాగాణమునందు చాల బాగుగ నున్నది. చెన్నపట్టణమునకు సమీపమున నున్న సైదాపేటయందు గొప్ప బోధనాభ్యాసకలాశాల యొకటి (Training College) యేర్పఱుపఁబడియున్నది. అది యీ దేశమునం దున్నవానియన్నిటికంటెను సర్వోత్తమ మయిన దని చెప్పవచ్చును. ఇతర మాగాణములయందుఁ గూడ నిట్టి కలాశాలలను స్థాపింపవలయు నని దొరతనమువారు యోచించుచున్నారు.

చెన్నపట్టణమున నుపాధ్యాయులు చదువుట కొరకు పాఠశాల (Presidency Training School for Mistresses) యేర్పడియున్న దని యిదివఱకే తెలిపియున్నాము. భర్తృవిహీన లయి సదా దుఃఖసముద్రమున మునిఁగి పరితాపపడుచుండుస్త్రీలు విద్యాభ్యాసము చేసి సుఖజీవనము చేయుచుండవలయు నని యుద్దేశించి దొరతనమువారీ పాఠశాలయందుఁ జదువు వితంతువులగు నుపాధ్యాయినులకు వలయు ద్రవ్యసాహాయ్యము చేయుచున్నారు. దొరతనమువా రింతగా ద్రవ్యసాహాయ్యము చేయుచున్నను, తమస్థితిని, తమయొద్దఁ జదువుకొను నితరస్త్రీలస్థితిని బాగుపఱపవలయు నను నుద్దేశముతో విద్యాభ్యాసముచేయు వితంతువులసంఖ్య తృప్తికరముగ నుండలేదు.

ఇట్లసంఖ్యాకము లయినవిద్యాశాలలను బరీక్షించుచుండుట యెంతయుఁ గష్టతరమైన పని యగుటచే దొరతనము వారెందఱినో ఇన్‌స్పెక్టర్లను నియమించియున్నారు. 1901 సం॥ జనాభాలెక్కలవల్ల నీ దేశమున నున్న విద్యాశాలలను బరీక్షించుటకు 35-గురు ఇన్‌స్పెక్టర్లును, 6-గురు స్త్రీ ఇన్‌స్పెక్ట్రెస్లును, 36 అసిస్టెంటు ఇన్‌స్పెక్టర్లును, 660 చిన్నయధికారులును నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇదిగాక చిన్నచిన్న గ్రామములయందున్న పాఠశాలలను బరీక్షించుచుండుటకు సూపర్వైజర్లనెడు క్రిందియుద్యోగస్థు

లనేకులును నియమింపఁబడియున్నారు. ఈ మాగాణము నను 260 సూపర్వైజర్లున్నట్లు తెలియవచ్చుచున్నది. వీ రిదివఱకు జిల్లావిచారణసంఘములయధికారముక్రింద నుండిరి. ఇప్పుడు వీరిని దొరతనమువారు తమయధికారముక్రింద నుంచుకొనిరి. ఈ విద్యాశాలలను బరీక్షించుట కిందఱు ఇన్స్పెక్టరు లుండవలయునా యని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని యీదేశమున నున్నవిద్యాశాలలసంఖ్యను విద్యార్థులసంఖ్యను యోచించితి మేని, ఈ యిన్స్పెక్టర్లసంఖ్య చాల దనియే చెప్పవచ్చును.

| పాఠశాలల వివరణము. | పాఠశాలల సంఖ్య. | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| ప్రథమవిద్యాపాఠశాలలు (Elementary Schools) ... | 97,854 | 32,04,336 |
| ఆంగ్లేయభాషాపాఠశాలలు (Secondary Schools) ... | 5,493 | 6,22,768 |
| కలాశాలలు (Colleges) ... | 145 | 17,651 |
| శిల్పశాస్త్రపాఠశాలలు (Colleges for Professional Training) ... | 46 | 5,358 |
| చిల్లరపాఠశాలలు (Schools for Special Instruction) ... | 1,084 | 36,380 |
| మొత్తము .. | 1,04,622 | 38,86,493 |

కడచినజనాభాలెక్కలప్రకారము తెలియవచ్చినయీ దేశపువిద్యాభ్యాసస్థితి యీ ప్రక్కపుటలోని పట్టీవలనఁ దెలిసికొనవచ్చును.

ఈ విద్యావిషయమున దొరతనమువారు సంవత్సరమునకు సుమారు నాలుగుకోట్లరూపాయలు వెచ్చపెట్టుచున్నారు.

విద్యాశాలల నన్నిటిని విచారించుట కిన్స్పెక్టర్లను మాత్రమే కాక తమ సొంతవిద్యాశాలలయం దుపాధ్యాయులను గుమాస్తాలను దొరతనమువా రేర్పఱచి యున్నారు.

ఈ విద్యావిషయమున దొరతనమువారు మూఁడుతరగతుల యుద్యోగస్థులను నియమించియున్నారు. కొందఱు ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీసుకు చేరినవారు. వీరు ఇంగ్లండునందే నియమింపఁబడి యీ దేశమునకు వత్తురు. వీరు మొదటితరగతివారు. కొందఱు ప్రావిన్షియల్ సర్వీసుకు చేరినవారు. వీరీ దేశముననే నియమింపఁబడుదురు. వీరు రెండవతరగతివారు. కొందఱు సబార్డినేట్ సర్వీసుకు చేరినవారు. వీరు మూఁడవతరగతివారు. ఒక్కొక్క ప్రెసిడెన్సీలోను విద్యావిషయమునఁ బనిచేయుచున్నయుద్యోగస్థుల కందఱికిని పై యధికారిగ నొక్కరు డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ (Director of Public Instruction) అను

వారు నియమింపఁబడియున్నారు. అప్పుడప్పుడు విద్యా శాఖలోనివిషయములు బాగుగ దొరతనమువారికి విశద పడునిమిత్తమై యిప్పుడు హిందూదేశములోని యన్ని మాగాణములలోనివిద్యాశాఖలపైవిచారణకై యిండియా గవర్నమెంటులో నొక ప్రత్యేకమైనశాఖ యేర్పడి యున్నది.

ఆయామాగాణములయం దున్నయధికారులస్వాతం త్ర్యములను విస్తారముగ తగ్గింపకయే విద్యాబోధనవిషయ మున మంచిమంచిపద్ధతుల నేర్పఱచుచు, దొరతనమువారు విద్యాభివృద్ధి చేయుచున్నారు. దొరతనమువా రింతశ్రద్ధ వహించుచున్నను, మనదేశమున నింక నెన్నియో కోట్ల జను లజ్ఞానాంధకారమున మునిఁగియుండుటను జూడఁగా, దొరతనమువారును, దేశాభిమానులును విద్యాభివృద్ధికి వలయుసాధనముల నింక నెన్నిటినో కల్పింపవలసియున్నదని చెప్పవచ్చును. దేశాభిమానులు, విద్యానిధులును దొర తనమువారికి విద్యాభివృద్ధివిషయమున నెంత త్వరగా తోడుపడుదురో యంత త్వరగా నీ దేశప్రజనుల యజ్ఞా నాంధకారము తొలఁగిపోవుననుటకు సంశయము లేదు. ఈ యాంగ్లేయప్రభుత్వమున దేశీయవిద్యయు, నాంగ్లేయ విద్యయు నింతగాఁ బ్రబలుచుండుట జనుల మహాభాగ్య మని చెప్పవచ్చును.



## 6. దొరతనమువారును, న్యాయవిచారణసభలును.

జనులవివాదములును, వానిహేతువులును — మధ్యస్థులుగ నుండు ప్రభుత్వమువారు చేయు తోడ్పాటు — గ్రామపంచాయతీల యేర్పాటును, వాని యధికారములును — హెచ్చు న్యాయస్థలముల ఏర్పాటు — న్యాయవిచారణపద్ధతులు — పూర్వకాలపు బద్ధతులును, ఇప్పటి యేర్పాటులును.

మన మెంగిలివిస్తళ్లను వీధిలోఁ బాఱవైచినప్పుడు వానిని దినవలయు నని యెన్నియో కుక్కలు వచ్చి వానిని దినుటకు మాఱుగ నొకదానిపై నొకటి పడి జగడము లాడుకొని యా యాకులపై మన్నుపోసి తల యొకదారిని పాఱిపోవును. చిన్నబిడ్డలు పదిమంది చేరి యాట లాడుకొనుచుండునపుడు వారిలో నొకనిచేతిలో నొకబొమ్మ యున్నపక్షమున దాని నూడఁదీసికొనవలయు నని మిగిలినవా రందఱు వానితోఁ దగవులాడుదురు. అప్పుడు వారందఱిలో నెక్కువబలముగలవానిచేతి కాబొమ్మ దొరకును. అయినను, ఒక్కొక్కప్పు డూడఁదీసికొనునప్పు డా బొమ్మ క్రిందఁబడి ముక్కముక్కలై పోవచ్చును. కుక్కలెంగిలి విస్తళ్లను దినవలయు నని వచ్చి తగవులాడక దేనికి దొరకినది యది తినిపోవచ్చునుగదా! అట్లు చేయక జగడము లాడుకొని యాకులపై మన్ను పోయుటవలనఁగదా

దేనికి నేమియు దొరకక యన్నియు వచ్చినదారిని పోవలసి వచ్చెను. అట్లే మనలో ననేకులు దమస్నేహితులు, బంధువులు నని యోచింపక యజ్ఞానమువలనఁ జివరకుఁ గలుగులాభనష్టములను దలంపక వృథాగా జగడము లాడు కొందురు. కుక్క లెంగిలియాకులకొఱకువలె మూఢులు భూములకొఱకును, ద్రవ్యముకొఱకును, వ్యాపారముకొఱకును, నీటికొఱకును, మతముకొఱకును జగడము లాడు కొందురు. సాధారణముగ జనసామాన్యమున కిట్లు జగడము లాడుకొనుచుండుట స్వాభావికమే యని చెప్ప వచ్చును.

బలమువలననే తమహక్కును స్థిరపఱచుకొనుచుండుట పూర్వకాలపుపద్ధతి. ఇట్టిజనులు మృగములవంటివారు. ఈ కాలమునఁ గూడ నాగరికత లేనివా రనేకులు కఱ్ఱలతోఁ గొట్టుకొని జగడము లాడుచునే తమకార్యములను సాధించుకొనుచుందురు. నాగరికత కలిగినవారు తమలో జగడ మాడుకొనవలసిన విషయము కలిగినపుడు జగడము లాడుకొనక తమమేలు కోరువారితో నా విషయమును తెలిపి వారు చెప్పినప్రకారము నడుచుకొనుచుందురు. ఇట్లు కానియెడల బలవంతుఁడు చేయు దుర్మార్గకార్యము లన్నియు నెఱవేఱుచుండును. కావున జనులలో నిట్టి కలహములు పొసఁగినపుడు తాము మధ్యవర్తులుగ నిలిచి

వారిజగడములను నివారించుచుండుట దొరతనమువారికి ముఖ్యకార్యము.

కొన్ని గ్రామములయం దిట్టి జగడములు పొసఁగి నప్పుడా గ్రామములం దుండు పెద్దమనుష్యులే వారివివాదములను తీర్చుచుందురు. వారికే పంచాయతీ యని పేరు. సాధారణముగా నీ పంచాయతీని కక్షిదారులే నియమించుకొనవచ్చును. వారికి కక్షిదారు లేమియు నియ్య నక్కఱ లేదు. వా రా గ్రామమునఁ జాలకాలమునుండి నివసించుచున్నవా రగుటచే వారికి వివాదాంశములు చక్కఁగఁ దెలిసియుండును గనుక వారు చెప్పు తీర్పు నిష్పక్షపాతముగనే యుండును. కనుకనే దొరతనమువారుకూడ నీ పద్ధతి నంగీకరించియున్నారు. చిన్నచిన్నతగవులను తీర్చుటకీ పద్ధతికంటె తృప్తికరమైన వేఱొకపద్ధతి లేదు. ఈ పంచాయతీవారి ఇఱువదిరూపాయలకు లోపలి వ్యాజ్యములను తీర్పవచ్చును. కక్షిదారు లొప్పుకొన్నయెడల రెండువందల రూపాయలవఱకుఁ గూడ వారు తీర్పు చెప్పవచ్చును. ఈ తీర్పును దొరతనమువా రంగీకరింతురు. పంచాయతీ లేని గ్రామమునందు గ్రామమున్సిఫ్ (Village Munsiff) అని యొకఁ డుండును. అతఁ డా గ్రామమున నందఱికంటె నెక్కువ ధనవంతుఁడుగను, నెక్కువ మర్యాదకలవాఁడుగ నెక్కువ పలుకుబడి కలవాఁడుగనుండును. ఆతఁడు గ్రామ



మద్రాసు ప్రధానన్యాయస్థానము.

మునసబుగలిగెడి యన్ని వివాదములను తీర్చుచుండును. ఆతనితీర్పును దొరతనమువా రంగీకరింతురు.

చిన్నచిన్నవివాదములను తీర్చుచుండుటకు పైనిచెప్పిన యేర్పాటులు చాలియున్నవి. నాగరికతయు, చట్టదిట్టములు నెక్కువయైనందున, గొప్పవివాదములను దీర్చుటకు దొరతనమువా రింకను గొప్పయేర్పాట్లను చేయవలసి యున్నది. గ్రామమునస బెంత నిష్పక్షపాతియైనను, కొన్నిసమయములందు తన జాతివారియెడల నభిమానము

నితరులయెడ నసూయయు వహింపవచ్చును. కావున గ్రామాధికారులతీర్పులను విచారించుటకుఁ బైయధికారులు కావలయు. కనుకనే తఱచుగా ప్రతితాలూకాయందు నొక్కొక్క యధికారి నియమింపఁబడి యున్నాఁడు. ఆతనికి డిస్ట్రిక్టు మున్సిఫ్ (District Munsiff) అని పేరు. ఆతఁడు రెండువేలయేనూఱురూపాయలమొత్తము వఱకు వ్యాజ్యములలో తీర్పు చెప్పవచ్చును. ఇట్లు తాలూకాయందున్న న్యాయస్థలమే న్యాయవిచారణకు మూలస్థల మని చెప్పవచ్చును. గొప్పగొప్పవ్యాజ్యములను తీర్చుటకు ప్రతి జిల్లాయందును జిల్లాజడ్జి (District Judge) అని యొక రేర్పడియున్నారు. వీరికిఁ గొంచెము క్రిందుగా సబ్‌జడ్జీలు (Sub-Judges) ఏర్పడియున్నారు. పైనిచెప్పఁబడిన చిన్నన్యాయస్థలములయందును, జిల్లాకోర్టులయందును చేయఁబడుతీర్పులను విచారించుచుండుటకు ప్రతిమాగాణముఖ్యపట్టణమునందును ప్రధానన్యాయస్థానము (High Court) అని యొకన్యాయస్థల మేర్పడియున్నది. ఇట్టి న్యాయస్థలములు చెన్నపట్టణము, బొంబాయి కలకత్తా, అలహాబాదు అను పట్టణములందు నేర్పడియున్నవి. బర్మాయందును, పంజాబునందును నున్న వానికి చీఫ్‌కోర్టులు (Chief Courts) అని పేరు.

ఈ విధముగ దొరతనమువారీగొప్పదేశమున 2,200



కలకత్తా ప్రధానన్యాయస్థానము.

న్యాయస్థానముల నేర్పఱచి ప్రజలజాతివర్ణాచారవిషయములయం దించుకయుఁ బక్షపాతము చూపక మధ్యవర్తిత్వమును వహించియున్నారు. మఱియుఁ దమదేశమున నున్న చట్టములనే యీదేశమునందును వాడక యీదేశమువారి కౌణాచులు, దత్తత, దాయవిభాగము మొదలగువానివిషయమున నీదేశపు పూర్వమర్యాదల ననుసరించియే వ్యాజ్యములను విమర్శించుచున్నారు. క్రింది న్యాయస్థలములయందుఁ దఱచుగా నీ దేశమువారే న్యా



బొంబాయి ప్రధానన్యాయస్థానము.

యాధిపతులుగ నియమింపఁబడుటయేకాక, ప్రధాన న్యాయస్థానములందును యూరోపియనులతోఁగూడ నీ దేశపువారును గొందఱు న్యాయాధిపతులుగ నియమింపఁ బడుచున్నారు. ఈ దేశస్థులయాచారవ్యవహారము లింగ్లీషువారికిఁ జక్కఁగఁ దెలియవు కావున వానిని జక్కఁ గఁదెలిసిన యీ దేశపువారిని నియమించియే వివాదములఁ దీర్చుచున్నారు.

ఈ విధముగఁ బ్రజలవివాదములను దీర్చుచుండుట కిన్ని విధములగు న్యాయస్థలముల నీదేశమున నేర్పఱచుటయేగాక వీనిలోనియభిప్రాయభేదములను సరిదీర్చుటకును, గొప్పగొప్ప మొత్తములుగల వ్యాజ్యములను దీర్చుటకును నింగ్లండునందు మనచక్రవర్తిగారిమంత్రాలోచనసభ (Privy Council) కుఁ జేరిన యొకన్యాయసభ (Judicial Committee) యందు వలయు నేర్పాటులను చేసియున్నారు. ఇట్లు గ్రామపంచాయతీలు మొదలుకొని చక్రవర్తిమంత్రాలోచనసభవఱకు నెన్నియో న్యాయస్థలములున్నను, నవి యన్నియు గొలుసునందలి యుంగరములవలెఁ బరస్పరసంబంధము గలిగియేయున్నవి. ఇట్టి యేర్పాటి యాంగ్లేయప్రభుత్వమున నీదేశమున నేర్పడినక్రొత్త యేర్పా టని చెప్పవచ్చును. పూర్వరాజులకాలములో గ్రామవాసులు తమవివాదముల నేదోయొకవిధముగఁ దామే చక్కఁబఱచుకొనుచుండెడువారు. ముఖ్యపట్టణముల నుండువారు మాత్రము రాజుగారు కొలువుకూటమునకు వచ్చుసమయమును గనిపెట్టుకొనియుండి తమవివాదాంశములను విన్నవించుకొని, రాజు తనచిత్తవృత్తి ననుసరించి చెప్పినతీర్మానముప్రకారము నడచుకొనుచుండెడువారని తెలియుచున్నది. దేశమునం దెల్లయెడల నొకవిధమైన న్యాయనిబంధనము లుండినట్లు కానరాదు. జనులకు

నెమ్మదియు, సొత్తులకు రక్షణయు, నాంగ్లేయప్రభుత్వము వలనఁ గలిగిన మహోపకారము లని చెప్పవచ్చును. వీనికి వారేర్పఱచినన్యాయనిబంధనములే ముఖ్యకారణము.



## 7. దొరతనమువారును, నగరరక్షణమును.

తప్పుచేసినవారిని దండించునధికారులును, ఆ పద్ధతులును—జూరీలు —గ్రామకాపుదల, దాని మేలులు — ఈ యుద్యోగము చేయువారి స్థితి—వీరికిఁగల చట్టములు—ఈ యిలాకాలో జరిగిన నూతనసవరణలు.

హక్కులు, లేవాదేవీలు, వ్యాపారము మున్నగు విషయములయందుఁ గలిగిన వ్యాజ్యములను తీర్చునట్టి న్యాయస్థలములు సివిల్‌కోర్టు లనియును, జగడములు, దొంగతనములు, హత్యలు మొదలగు నేరములను విమర్శించి శిక్షించు న్యాయస్థలములు క్రిమినల్‌కోర్టు లనియును పిలువఁబడుచున్నవి. హత్యలు మొదలగు గొప్పనేరములను విమర్శించుట కొక్కొక జిల్లాయందును, కొన్ని ప్రదేశములయందు రెండుమూడుజిల్లాలకు చేరి యొక జిల్లాయందును, ఒక్కొక్క సెషన్సుజడ్జి (న్యాయాధికారి) నియమింపఁబడియున్నాఁడు. ఈ సెషన్సుజడ్జిక్రింద నేరములను విచారించుట కెందఱో మాజిస్ట్రేట్లు నియమింపఁబడి

యున్నారు. వీరిలో మూఁడుతరగతులవా రున్నారు. రెండేండ్లకు మించకుండు కారాగృహశిక్ష వేయిరూపాయల జుల్మానాయు విధించువారు **మొదటితరగతివారు.** ఆఱు మాసములకు మించని కారాగృహశిక్ష నిన్నూఱురూపాయలజుల్మానాయు విధించువారు **రెండవతరగతివారు.** ఒక మాసముశిక్ష నూఱురూపాయలజుల్మానాయు విధించువారు **మూఁడవతరగతివారు.** ఇటువంటియిటువంటి నేరములను నిటువంటియిటువంటి మాజిస్ట్రేట్లే విచారింపవలయునని విధు లున్నను, వారు తమయధికారమునకు మీఱిన నేరములనుగూడ పైయధికారులయనుమతిని పొంది తాము విచారించి శిక్షలను విధించుటకు సెషన్సుకోర్టులకుఁ దెలుపవచ్చుననియు నిబంధనలు చేసియున్నారు. అంతేకాక, పట్టణములయందు నూసెన్సుకేసులను, చిన్న జగడములను, బండ్లవారికేసులను విచారించుటకు జీతములు లేకయే గౌరవార్హ మాజిస్ట్రేట్లును, మఱికొన్నిస్థలములయందు చిన్నకేసులను విచారించుటకు స్వల్పజీతముల గైకొను బెంచిమాజిస్ట్రేట్లును, రాజధానిస్థలముల యందు చిన్నకేసులను విచారించి శిక్షించుటకును గొప్పకేసులను విచారించి పైయధికారులకుఁ బంపుటకును గొప్పజీతముల నిచ్చి ప్రెసిడెన్సీమాజిస్ట్రేట్లను నియమించి యున్నారు.

ఈ విధముగ నేరములను విచారించు న్యాయస్థానము లీ దేశమందు 6,300 ఉన్నవి. ఉన్నతన్యాయస్థలములకు విచారణకొఱకు పంపఁబడువివాదము లన్నియును క్రింది కోర్టు లన్నిటినుండియును పంపఁబడుచుండును. సెషన్సు కోర్టువారి కెట్టి గొప్ప శిక్షలను విధించుట కైన నధికార మున్నను వారు విధించుమరణదండనమును మాత్రము హైకోర్టువా రంగీకరింపవలయును. మరణదండనము మనుష్యునకు విధించుదండనములలో గొప్పదియును ప్రాణమునె పోఁగొట్టునదియును నగుటచేతను, ఎట్లయిన నాదండనమును తప్పించుట యుత్తమనాగరికతయొక్క లక్షణ మగుటచేతను, మరణదండనమును పైవారియను మతికి పంపుట యెంతయు ముఖ్యమని తోఁచుచున్నది. మరణదండనము విధింపఁబడిన ఖైదీని విడిపించుట కేవి యైన స్వల్పకారణము లగపడినయెడల, వానిని గవర్నర్ జనరలును గవర్నరును విడిపింపఁగలరు.

మఱియు, ఉన్నతన్యాయస్థలములయందును, జిల్లా న్యాయస్థలములయందును, నేరస్థులను విచారించునప్పుడు జడ్జీతోఁగూడ నా యూరియందు ప్రముఖులగువారు తొమ్మండ్రుగురు కూడఁ గూరుచుండి విచారణను విను చుందురు. వీరికి జూరీలని పేరు. విచారణ ముగియఁగనే జడ్జీ వారియభిప్రాయము ననుసరించియే శిక్షను విధిం

చును. జడ్జీయు జూరీలును భిన్నాభిప్రాయు లయినప్పుడు వ్యాజ్యెము ప్రధానన్యాయస్థలమునకుఁ దెలుపఁబడును. ఈ విధముగ దండనీయు లిన్ని సౌకర్యములతో విచారింపఁబడునప్పుడు వారికి నిష్పక్షపాతమైన న్యాయము దొరకు నని వేఱుగ చెప్ప నక్కఱ లేదు. జూరీలవలెనే జడ్జీకి విచారణలో సహాయముచేయువారు మఱికొంద ఱుందురు. వారికి అసెసర్లు అని పేరు. జూరీల కుండునధికారము వీరి కున్నను, వీరియభిప్రాయమును జడ్జీ విధాయకముగ అంగీకరింపవలసినది లేదు.

ఈ ప్రకారము, నేరముచేసినవారిని శిక్షించుట దొరతనమువారికి ముఖ్యకర్తవ్య మని వెనుకనే చెప్పియున్నాము గదా! అయినను, శరీరమునకు వ్యాధి వచ్చినతరువాత ఆ వ్యాధిని బోఁగొట్టుకొనుటకు ప్రయత్నించుటకంటె వ్యాధి రాకుండఁగనే దేహమును కాపాడుకొనుట యుత్తమకార్యము గావున తప్పుచేసినవారిని దండించుటకంటె ప్రజలు తప్పులు చేయకుండుటకుఁ దగినయేర్పాట్లను చేయుట ముఖ్యకార్యమైయున్నది. ఈ కారణమునుబట్టియే యనేక గ్రామములయందు గ్రామసంరక్షణమునకై గ్రామస్థులందఱు చేరి తలారి నొకనిని నియమించుకొందురు. వీఁడు గ్రామస్థులచేలను, పొలములను, తోఁటలను, వారిసొత్తులను, జాగ్రత్తగఁ గాపాడుచుండుటయేగాక దొంగ లెత్తు

కొనిపోయినసొత్తును కనిపెట్టుచుండవలయును. పూర్వ కాలమునందు, దొంగ లెత్తుకొనిపోయినసొత్తును కావలివాఁడు కనిపెట్టలేకపోయినయెడల నా సొత్తుయొక్క వెలను నా కావలివాఁ డచ్చుకోవలసిన ట్లేర్పడియుండినది. చీనా దేశమునందు రాజారోగ్యస్థితియం దుండునంతకాలము రాజవైద్యునకు జీతము ముట్టుచుండు ననియు, రోగముతో నుండుకాలమున జీతము లేదనియు నేర్పడియున్నట్లు వినుచుందుము. అందువలన రాజవైద్యుఁడు తనకు జీతము ముట్టదను భయమున రాజుగారి దేహస్థితిని జాగ్రత్తతో కాపాడుచుండును. అట్లే తలారియు తా నచ్చుకోవలసి వచ్చు ననుభయమున గ్రామస్థులసొత్తును జాగ్రత్తతోఁ గాపాడుచుండును.

అయినను, ఈ పూర్వపు టేర్పాటు గ్రామములయందు పనికివచ్చునుగాని పట్టణములయం దట్టి యేర్పాటుసేయుట యసాధ్యము. ఏలయనిన, నాంగ్లేయదొరతనమున నాగరికత దినదినాభివృద్ధి గాంచుచుండుటవలన జనసంఖ్యయందును విస్తీర్ణమునందును పట్టణములు పెద్ద వగుచున్నవి. పట్టణములయందు జనసంఖ్య యెక్కువయగుకొలఁది దొంగలును, మోసగాండ్రును నెక్కువ యగుచుందురు. వారిని కనిపెట్టుటకు తలారులను వలెనే పోలీసువారిని నేర్పాటు చేసియున్నారు. రాజవీధులయందును, కొన్ని వీధులు

చేరుమూలలయందును, అంగడివీధులయందును, సంతల యందును, నుత్సవములయందును నెండకాలమున తెల్లని దుస్తులను, వానకాలమున నల్లని దుస్తులను, నల్లని పాద రక్షలను, తోలు పట్కాలను, నెఱ్ఱని తలపాగాలను, లఠ్ఠీ కఱ్ఱలను, బుఱ్ఱమీసములను ధరించుకొని కొందఱు మన కగపడుచుందురుగదా! వారే పోలీసువారు. వీధుల శుభ్రత చెరుపువారికిని, జగడము లాడువారికిని, జట్కా బండ్లవారి కిని నీ పోలీసువారు యమకింకరులవలె నగపడుచుందురు. మనము పోలీసువారిని చెడ్డవా రని యందుమేకాని వారి వలని యుపకారమును మన మెఱుఁగఁజాలకున్నాము. ఒకఁడు నీడయం దుండునంతకాలము నీడవలని సౌఖ్యము నెఱుఁగఁజాలఁడుగదా! అపరిమితజనసంఖ్య గల పట్టణ ములయందు పోలీసువారు లేనియెడల మానము కలవారు జీవనము చేయుటయే యసాధ్యముగ నుండును. ఈ పోలీసు వారు, తల్లిదండ్రులయొద్దనుండి తప్పిపోయి వీధులలోఁ దిరుగుచుండుబిడ్డలను వెంటఁబెట్టుకొని పోయి తల్లిదం డ్రుల కప్పగింతురు; వీధులలో త్రాఁగి జగడము లాడు వారిని పట్టుకొనిపోయి శిక్ష వేయింతురు; ఇండ్లు మొద లగునవి తగులఁబడుచుండు చోట్లకుఁ బోయి వానిని చల్లార్చుట మొదలగు సహాయకార్యములు చేయుదురు; ప్రాఁత దొంగలయందు గన్నుంచి కనిపెట్టుచుందురు;

రాత్రులయందు వీధులలో గస్తు తిరుగుచు, నిండ్లతలు పులు తట్టి జాగ్రత్తతో నుండుటకు హెచ్చరించుచుందురు. స్వల్పజీతములు తీసికొనెడి వీరు చేయునీపనులు మన కెంతటి యుపకారకములో మనమే యూహింపవచ్చును. మన కిట్టి యుపకారములను చేయుచుండుటకు దొరతనమువారీ దేశమున నొకటిన్నరలక్షసంఖ్యగల పోలీసుభటులను నియమించియున్నారు. ఇదిగాక, గ్రామములయందు నేడు లక్షలమంది తలారులను నియమించియున్నారు.

ప్రతి పెద్దగ్రామమునం దొక పోలీసుస్టేషనేర్పఱచి యందు కొందఱిని భటులను, వారిని విచారించుకొనుచుండుట కొక హెడ్ కాన్‌స్టేబిల్‌ను, వీ రందఱును సరిగా పనులను చేయుచున్నారో లేదో కనుఁగొనుచుండుటకయి యొక సబ్ ఇన్‌స్పెక్టరును నియమించి యున్నారు. ఈపోలీసు ఉద్యోగస్థు లందఱును మొట్టమొదట వేలూరు, ఖాగల్పూరు, మురాదాబాదు అను పట్టణములయం దున్న భట శిక్షకశాలలయందు (Police Training Schools) కొంత కాలము చదివి తమపనులను నేర్చుకొనవలయును. ఈ సబ్ ఇన్‌స్పెక్టర్లపైని ఇన్‌స్పెక్టర్లుందురు. ఒక జిల్లా కంతకు నధికారిగా జిల్లాసూపరింటెండెంటు (District Superintendent) అని యొకఁ డుండును. ఈ సూపరింటెండెంట్లపైని మాగాణమున కంతకును ఇన్‌స్పెక్టరు జనరల్

అని యొకరుందురు. కాని రాజధానియందు మాత్రము వేఱుగ పోలీసుపర్సాటు చేయఁబడియుండును. ఆ పోలీసునకు ముఖ్యాధికారి కమీషనరు అనఁబడును.

ఈ పోలీసువారు మూడు తెగలవారుగ నున్నారు. (1) ప్రాఁత దొంగలు మరల దొంగతనములు చేయకుండునట్లు వారిపై నిగా యుంచి జాగ్రత్తతో కనుపెట్టుచుండువారు కొందఱు. (2) క్రొత్త దొంగలను గనిపెట్టువారు కొందఱు. (3) నేరములను చేసినవారిని పట్టుకొనిపోయి శిక్షలను వేయించుచుండువారు కొందఱు. కారాగృహములను కావలికాచుచుండుటకు రక్షకభటులు కొంద ఱేర్పఱుపఁబడియుందురు. హత్యలు, దొంగతనములు, మోసములు మొదలగునవి కులవృత్తులుగ జీవించువారును, జనోపకారకములగు నినుపదారులు, తపాలు, తీఁగతపాలు మొదలగువాని కపాయములను గలిగించుచుండువారును ననేకు లీదేశమున నున్నారు గదా! వారిని కనిపెట్టి శిక్షింపఁజేయుచుండుటకై యన్ని మాగాణములందును పలువు రుద్యోగస్థులు నియమింపఁబడియున్నారు.

పోలీసులో నిన్ని కట్టుపాటు లున్నను, ఆ శాఖలో కొన్ని లోపములు కనఁబడుచునేయున్నవి. రక్షకభటులకు స్వల్పజీతము లిచ్చుచుండుటచే, వా రక్కఱతో పనిచేయకుండిరి. సమర్థులగువారు తక్కువజీతములకు రారు.

ఇట్టి లోపములను నివారించుటకు 1902 సం॥న దొర తనమువా రొక విచారణసంఘము నేర్పఱచి వారిసలహాల ననుసరించి పోలీసుద్యోగస్థులజీతముల నెక్కువచేసి వా రక్కఱతో పనులు చేయుచుండుటకు వలయు నుపాయ ములను యోచించుచున్నారు. 1905 సం॥న, ఏఁబదిలక్షల రూపాయలను పోలీసుశాఖను సంస్కరించుటకు కర్చుపెట్టి నారు. వెనుకటివలె విద్యావిహీనులకుఁగాక చదువుకొని పరీక్షల నిచ్చినవారికే యుద్యోగముల నిచ్చుచు వారి మూలముననే నేరములను విచారించి దండనీయులను శిక్షించుచున్నారు. తప్పుచేసినవారిని కనిపెట్టి శిక్షించుట కును, ప్రజల కన్యాయము కలుగకుండుటకును దొరతనము వా రెన్నిమార్గములు యోచించుచుండినను, ప్రజలు కూడ దొరతనమువారికి తోడుపడుచుండినఁగాని వారిప్రయత్న ములు కొనసాగవు. కావున ప్రజలు కూడ దొరతనము వారికి సహాయపడుచుండవలయును.



## 8. దొరతనమువారును, దేశసంరక్షణయు.

పూర్వ మీ దేశమునకు సంభవించిన యపాయములును, తాత్కాలికపు నెమ్మదియు—దేశసంరక్షణమునకు వలయు సాధనము లేర్పడియుండుటయే యిప్పటి దేశస్వాస్థ్యమునకుఁ గారణము—నౌకాసైన్యములు, స్థలసైన్యములు—వీని యేర్పాటు—వీనికై చేయు వ్యయము వ్యర్థము గాదనునది.

ప్రజలకు స్వదేశవాసులవలన భయములు కలుగకుండ దేశమును పోలీసువారు కాపాడుచుండున ట్లాశ కలిగిన పరదేశీయు లీ దేశము నాక్రమించుకొనకుండ సైన్యము లీ దేశమును గాపాడుచున్నవి. రెండువేలసంవత్సరములక్రిందట ఈ దేశముయొక్క ధనధాన్యసమృద్ధి పరరాజుల కాశ పుట్టించి యీ దేశపుఁ బ్రజల కెన్నియో కష్టములను తెచ్చిపెట్టినది. పారసీకులు, గ్రీకులు, తురుష్కులు, యవనులు, మహమ్మదీయులు, ఆఫ్ఘనులు, యూరోపియనులు మొదలగు విదేశీయు లొకరితరువాత నొకరుగ నీదేశముపై దండెత్తివచ్చి దేశమును పాడుచేసిరి. దేశమున నెమ్మది లేనియెడల దేశమున నేవిధమైన వృత్తులును నడువవుగదా. వర్తకము, వ్యవసాయము, చేతిపనులు, విద్య, నాగరికత మొదలగున వన్నియును చెడిపోవును. యుద్ధము పొసఁగనేని దేశమునకు చిరకాలమునుండి కలిగియున్న



యుద్ధనావ.

యౌన్నత్య మంతయును చెడిపోవును. కావున పరరాజుల వలనిభయము కలుగకుండునట్లు స్థలసైన్యమును, నౌకా సైన్యమును చాలినంత యుంచుకొని దేశమును కాపాడుచుండుట దొరతనమువారికి విధి. నూఱు సంవత్సరముల నుండి మనదొరతనమువా రిట్టియేర్పాటులను చేసియున్నా రనుట యందఱకును తెలిసినదియే కదా. దేశమును కాపాడుటకు స్థలసైన్యమును, నౌకాసైన్యమును ముఖ్య సాధనములు. వీనిలో నౌకాసేన మిక్కిలి యుపయోగ

కరమైనది. మనదేశమును పరిపాలించుచున్న యింగ్లీషు వారి నౌకాసేన యన్ని దేశములరాజులనౌకాసేనలకంటె మిక్కిలి విస్తారమైనది. మనదొరతనమువారి కీ లోకమున నెల్లయెడలను రాజ్యము లుండుటచేత, వారు తమ ప్రభుత్వము నెలకొల్పుటకును, పౌరులకు నెమ్మది గావింపను నౌకాసైన్యము మిక్కిలి యుపయోగపడుచున్నది. ఈ సేన మనదేశమునకు ముఖ్యమైన ప్రక్కబలముగా నున్నది. ఈ నౌకాసేనకై మనదొరతనమువారు రమారమి ముప్పది రెండుకోట్లపౌనులను వెచ్చపెట్టుచున్నారు. ఈ వెచ్చమున మన మేమియు నియ్యకున్నను, నీ సేనవలనిలాభములను మాత్రము పొందుచున్నాము.

ఈ దేశమును గాపాడుటకైయే ప్రత్యేకముగ సేన యేర్పడియున్నది. ఈ సేనలో డెబ్బదియైదు వేలయాంగ్లేయయోధులు నొకలక్షయేఁబదియైదు వేల స్వదేశయోధులు నున్నారు. పూర్వకాలమున రథ గజ తురగ పదాతి సైన్యము లుండినట్లీ కాలమున పదాతులు, గుఱ్ఱపురౌతులు, ఫిరంగిపటాలము, శిల్పయోధులు నను నలుతెఱఁగుల యోధు లున్నారు. సేన నంతటిని ననేకభాగములుగ చేసి యొక్కొక్క యంతర్భాగమున కొక్కొక్క సైన్యాధికారిని నియమించియున్నారు. 1895 సం॥ వఱకు నా యా మాగాణములయం దున్న సేన యచ్చటి యధికారిక్రిందనే యుం



స్వదేశ యోధులు.

డినది. పది సంవత్సరములనుండి మాత్రమన్ని మాగాణములసేనలును ముఖ్యసేనాధిపతి (Commander-in Chief) యనువారిచేతిక్రింద నుండున ట్లేర్పడినది. ఈ సేనల నుత్తరఖండమును, దక్షిణఖండమునను రెండుభాగములుచేసి, దానిని చిన్నచిన్నవిభాగములుగఁ జేసియున్నారు.

ఈ సేనలుకాక, తక్కిన ఉద్యోగములయం దున్న యూరోపియనులును, నీ దేశమునఁబుట్టిన తెల్లవారును సేనలుగా నేర్పడి తమతమయుద్యోగములలోఁ దీరిక కలిగినప్పుడు సైనికకార్యవ్యవసలను చేయుచున్నారు. వీరినే వాలంటీరులు



స్థలసైన్య యోధులు.

(Volunteer Corps) అందురు. వీరు రేవుపట్టణములను, సేనానివేశములను, ఇనుపదారులను, యూరోపియనులు విస్తారముగ నివసించుచోటులను కావలి కాచుచుందురు. మఱియు దేశమున నేదియైన నుపద్రవము కలిగినపుడు దొరతనమువారికి తోడుపడుచుందురు. వీరికి జీతములు లేవు. దేశాభిమానమును, రాజభక్తియునే వీరియుద్దేశములు. ఇట్టి వీరిదేశమున ముప్పదినాలుగువేలమంది యున్నారు.

మనహిందూమహారాజులయొద్దను, రాజులయొద్ద నలంకారార్థముగ నున్న సైనికులకు మనధొరతనమువారు



నౌకాసైన్య యోధులు.

తమ సేనలయందలి గొప్పయుద్యోగస్థులచేత యుద్ధపద్ధతులను నేర్పించి వారిని దేశమునకును తమకును దోడ్పడువారినిగా చేయుచున్నారు. ఈ సేనలకు సర్వీస్ సేన (Service Corps) లని పేరు. ఇట్టి సేన లీదేశమున నిఇువదివేలమంది గలవియై యున్నవి. ఈ సేనలకు నాయకులుగ హిందువులే యుండవలయు నని పదిసంవత్సరములక్రిందట రాజప్రతినిధిగా నున్న కర్జను ప్రభువుగారు (Lord Curzon) ఇఱువదిమందివీరుల నేఱి సేనానాయకులనుగా నియమించిరి. హైదరాబాదు మైసూరు మొదలైన రాజ్యములలో

రాజ్యములను కాపాడుటకు ముప్పదితొమ్మిదివేల సైనికు లేర్పఱుపఁబడియున్నారు. మనదేశము నీప్రక్క పేజీలో కనఁబఱుపఁబడినప్రకారము సేన లేర్పఱుపఁబడియున్నవి.

మనదేశమును శత్రురాజులనుండి కాపాడుటకు మన దొరతనమువా రిన్నివిధములుగ సేనల నేర్పాటుచేసియుండఁగా, కొందఱీ దేశమున ప్రజలు కష్టపడి సంపాదించుచుండు ధనము నీ సైనికులు దండుగగా తినివేయుచున్నారనియు, నల్లని బూట్సులు తొడుగుకొని తుపాకులను భుజములమీఁద పెట్టుకొని యూరక యిటటు తిరుగుచుండుటయేగాని వీరు మనకు చేసెడు పను లేవియు లేవనియు, ఈ దేశముయొక్క దరిద్రదశకు వీరే కారకు లనియు ననుకొనవచ్చును. కాని యీ దేశముయొక్క విస్తీర్ణమును, జనసంఖ్యను, ఈ దేశమునకు నలుప్రక్కలనుండు పరరాజులను, పూర్వకాలమున నీ దేశమునఁ గలిగిన యల్లకల్లోలములను జక్కఁగ తెలిసికొందురేని సేనలకై మనదేశమునుండి దొరతనమువారు చేయు కర్చు వ్యర్థమని యెవ్వరును చెప్పరు. మందలఁ గాచు కావలికుక్కలకు వేయు నాహారము వ్యర్థమని వానిని పాఱఁదోలినచో మేఁకలమందనంతను నొక్కదినములో పులులును, తోడేళ్లును చంపి తినివేయునట్లు, సైనికులను పోషించుట వ్యర్థమని వారిని

| దండుల విభాగములు. | సేనాధిపతులు, | యుద్ధవీరులు. | మొత్తము. |
|---|---|---|---|
| **ఆంగ్లేయులు.** | | | |
| ఫిరంగిపటాలములు ... | 547 | 14,116 | 14,663 |
| గుఱ్ఱపురౌతులు ... | 261 | 5,391 | 5,652 |
| పదాతులు ... | 1,508 | 52,238 | 53,746 |
| శిల్పయోధులు ... | 365 | 215 | 580 |
| ఆంగ్లేయుల మొత్తము... | 2,681 | 71,960 | 74,641 |
| **ఇండియనులు.** | | | |
| ఫిరంగిపటాలములు ... | 53 | 3,493 | 3,546 |
| గుఱ్ఱపురౌతులు ... | 544 | 24,450 | 24,994 |
| పదాతులు ... | 1,845 | 1,15,138 | 1,16,983 |
| కొండసారంగములు తొలుచువారు మొదలగు పనివారు... | 947 | 8,777 | 9,724 |
| ఇండియనుల మొత్తము... | 3,389 | 1,51,858 | 1,55,247 |
| జీతములేని సైనికులు ... | ... | ... | 34,000 |
| సర్వేసుదారులు ... | ... | ... | 20,000 |
| స్వదేశరాజుల సేనలు ... | ... | ... | 93,000 |
| సేనల మొత్తము... | ... | ... | 3,76,888 |



ఒంటెల పటాళము.

తీసివేసినయెడల పరరాజు లొక్కదినములో మనదేశము నాక్రమించుకొని కొల్లపెట్టుదురు.

ఇదియునుగాక యీ దేశములో నుండు **పలుజాతుల** వారును, పలు **దేశస్థులును**, **పలుమతస్థులును**, వీరికిఁ బరస్పర



తైమూరు.

కలహములు కలుగ దేశము యొక్క నెమ్మది చెడిపోవును. కొన్ని శతాబ్దములకు ముందు తైమూరులేన్, నాదర్షాయను పరదేశరాజు లీదేశముపై దండెత్తివచ్చి దేశమునంతను కొల్లగొట్టి విశేషద్రవ్యమును తీసికొనిపోయి తమదేశముల యందు కొన్నిసంవత్సరముల వఱకు ప్రజలనుండి యేవిధమైన పన్నులను తీసికొనకుండిరని మనము చదివియున్నాముగదా! ఇప్పుడట్టి కొల్లలు జరుగుచుండుట లేదు. కావున సేనలకొఱకు దొరతనమువారు చేయు కర్చు వ్యర్థము కాదు. దొంగతనములు జరుగుచుండునంతకాలము కావలివా రుండవలసినదియే. నాగరికత, నీతి, నమ్మకము నత్యున్నతస్థితికి వచ్చునవఱకును, నడివీధిలో నొకఁడొక మొహరీని విడిచిపోయి మఱికొన్ని దినములకు తరువాత వాఁడు వచ్చువఱకును **నా** మొహరీ పడినచోటనే

యుండునంతటి నీతి, పాపభీతి, నమ్మకము జనులలో కలుగు నంతవఱకును, రాజులకు పరరాజ్యాపేక్ష తప్పిపోవునంత వఱకును, కావలివారును సేనలు నుండవలసినదే. సేన లుండవలసిన యక్కఱ లే దనుట మౌర్ఖ్యము.

సేనల నక్కఱ లేనపుడు తీసివేసి జగడములు పొసఁగు నప్పుడు కావలయు ననిన నవి సమకూడవు. యుద్ధనైపుణ్యములేని జనులమందలను చేర్చుట వ్యర్థము. వారు కాకులగుంపువంటివారు. పూర్వకాలమున నొక రాజు సేనలను పోషించుట వృథావ్యయమని వానిని తీసివేసి యడవిలో నుండు కోఁతుల మందలను బట్టి తెప్పించి వానికి కావలికాచువిధమును తుపాకులను పట్టుకొనుక్రమమును నేర్పించి వానిచే దేశమునకు కావలి కాపించుచుండెను. అంత నొకపరరాజాతని దేశమును కొల్లపెట్ట వలయునని వచ్చి కోఁతులకు కొబ్బరికాయలయం దభిరుచి యెక్కువ గనుక బండ్లపై నెన్నిటినో కొబ్బరిచిప్పలను వేయించికొని వచ్చి యా కోఁతులసేన లుండుచోట వాని కెదురుగా వెదచల్లించెను. అప్పు డాకోఁతులు తుపాకులను విసరి పాఱవైచి కొబ్బరిచిప్పలను తిన నారంభించెను. అంత నారాజు తుపాకులను తనభటులను తీసికొండని వారిచే నాకోఁతులను కాల్పించి రాజును బాఱఁదోలి దేశమును స్వాధీనముచేసికొనెను. కావున నవశ్యముగా

చేయవలసిన కర్చుల నక్కఱ లేదని విడిచిపెట్టినయెడల, దేశము పాడయిపోవును. ఒక్కనిమిషమయినను సేనల కయి చేయు వెచ్చ మనుభారమును వ్యర్థ మని దొరతన మువా రెంచుచుండుట లేదు. సేనలకొఱకగు వెచ్చ మనెడు భారమును ప్రజలపీఁపుమీఁదినుండి తప్పించు మార్గములను నాగరికాగ్రగణ్యులగు యూరపుఖండవాసు లెంతకాలమునుండియో యోచించుచున్నారు, కాని యింతవఱకొక మార్గమునైనను కనిపెట్టఁజాలకున్నారు. మనుష్యులను భూమిమీఁదియాశయు ధనముమీఁది యాశయు విడువకుండునంతకాలము సేన లుండవలయును. జనులమూఢస్వభావము తొలఁగి, సద్గుణములు గలుగను గలుగను నీ భారము తగ్గుచునే వచ్చును.



## 9. దొరతనమువారును, తపాలును, తంతియు.

---

దూతకృత్యముయొక్క యుపయోగములు—ఇది యేవిధముగా దొర తనమువారిచే నడిపింపఁబడుచున్నది — మనము వేసెడు నుత్తరముల వృత్తాంతము — తపాలాబిళ్లలయుపయోగము — తపాలాయిలాకావలన మనకుఁ గలిగెడి తక్కిన మేలులు — ఈయిలాకాయేర్పాటును, అధికారులును — తంతియిచ్చుపద్ధతులు — తంతి వేయఁబడిన దేశ వైశాల్యము — దీనియొక్క లాభనష్టములు — ఈ సాధనములవలని మేలులు.

ఈ దేశమునందు మూలమూలలో నుండు ప్రతిగ్రామంబునను సూర్యోదయం బగునప్పటికి జనులు తపాలావాని రాకకై మిక్కిలి యాతురతతోఁ జూచుచుందురుగదా. మన దొరతనమువారు మనకు చేయుచున్నమేళ్లన్నియు మనకు స్పష్టముగ తెలియరాకున్నను వా రేర్పఱచినతపాలావలనను, తంతివలనను, రైలుమార్గములవలనను కలుగు మేళ్లందఱకు నఱచేతిలోనియుసిరికకాయవలె స్పష్టముగఁ గనుపట్టుచున్నవి. ఇట్టి సౌకర్యములు మనదేశమున నిప్పు డుండినట్లుగ ముం దుండినవని మనము వినియుండలేదు. కొంచెము కర్చుతో దేశాంతరములకు సయితము శీఘ్రకాలమున వర్తమానముల నంపఁగల యీయేర్పాటు లీదేశమునకు క్రొత్త వనియే చెప్పవచ్చును.



తపాలావాడు.

వర్తమానముల నంపువిషయమున రెండువిధములగు నేర్పాట్లను చేసియున్నారు—తపాలు, తంతి వీనిమూలమున మనము స్థలాంతరములకును, దేశాంతరములకును శీఘ్రకాలమున వర్తమానముల నంపవచ్చును. ఒక చిన డబ్బుకర్చుతో కాశిలోనున్న మనబంధుమిత్రులతోడ సంభాషింపను, ఒకఅణాఖర్చుతో దేశాంతరమున నున్న వారితోడఁ బరిచయము చేసికొనను వచ్చును. మనము వెచ్చించుసొమ్ము స్వల్పము. పొందుఫల మెక్కువ. రహస్య

విషయములకు సరణా చాలును. జాబులనంపుటకు మాత్రమే కాక సొమ్ము పంపుటకును, వస్తువులను పంపుటకును, సొమ్మును దాఁచిపెట్టుటకును, తగినయేర్పాట్లను చేసియున్నారు. ఈ యేర్పాట్లను జరిపించుటకుఁగాను పట్టణములయందును గొన్నినగరములందును ఆఫీసుల నుంచి యుద్యోగస్థులను నియమించియున్నారు. ఈ యాఫీసులులేని చిన్నగ్రామములయందలి జను లుత్తరములను పంపుటకును ప్రత్యుత్తరములను పొందుటకును తగిన యేర్పాట్లను చేసియున్నారు. ఉత్తరములను పంపుటకు సాధనములుగా నొక చిన్నడబ్బుమొదలిఱువది యాఱురూపాయలవఱకు విలువగల కార్డులు, కవర్లు, బిళ్లలు విక్రయింపఁబడుచున్నవి. వీనిలో నొక్కొక బిళ్లపైని మనచక్రవర్తిగారిశిరస్సు ముద్రింపఁబడియు, కార్డు తప్ప, తక్కినవాని కొకవైపున జిగురు పూయఁబడియు నుండుటను జనులు చూచియుండవచ్చును. ఉత్తరములను వారు ప్రచురించినకార్డులపైని, కవర్లపైని వ్రాయవలయునను నిర్బంధము లేదు. మనయిష్టము వచ్చినవానిపైని వ్రాయవచ్చును. స్టాంపులను మాత్ర మంటింపవలయును. మనకు కార్డులు, కవర్లు, స్టాంపులు కావలసినప్పుడు మనము ముందుగ కొనవలయును. రుసుము చెల్లింపక జాబులు పంపినయెడల, మనము చెల్లింపవలసినసొమ్మునకు రెండింత



జెనరల్ పోస్టాఫీస్ మద్రాస్.

లుగా జాబు పైవిలాసముదారునికడ తీసికొందురు. మన మిచ్చెడు సొమ్ము దొరతనమువారు మనకు చేయుపనికిఁ గాను ముం దిచ్చెడి కూలిగాని తపాలాబిళ్లలక్రయ మని యెంచఁగూడదు. అది గొప్పపొరపాటు. ఏలయన, కాని వెలగల కార్డుకంటె 1 రూపాయకు, 8 అణాలకు నమ్మఁ బడుబిళ్ల తేలికగాను, చిన్నదిగాను నుండును. అయిన, బిళ్లలవెలకుఁ దగినట్టుగా వస్తువులబరువుమాత్రము హెచ్చు చుండును. వేఱువేఱు విలువగలబిళ్లలు వరుసలువరుస లుగా వేఱువేఱురంగులతో ముద్రింపఁబడియున్నవి. వాని

విలువ వానియందుఁ గనఁబఱపఁబడియుండును. బిళ్లలను వేఱువేఱుగా చించుటకు నొక్కొక్క బిళ్ల చుట్టును చిన్న చిన్న రంధ్రము లుండును. ఉత్తరములను వేయుటకు తపాలాకచ్చేరీలలోను, గొప్పగొప్ప వీధులలో నచ్చటచ్చ టను పెట్టె లుంపఁబడియున్నవి. ఆ యుత్తరములు తీయు కాలము లా పెట్టెలపైఁ దెలుపఁబడుచుండును. ఆయా బిళ్లల వెల లా యా బిళ్లలమీఁదనే ముద్రింపఁబడి యుం డును. ఒక కానికార్డు నెంత జాగ్రత్తతో తపాలావారు తీసికొనిపోవుచున్నారో దానినిబట్టియే తక్కినవానిసంగ తియుఁ దెలిసికొనవచ్చును. మనము వేసినజాబుమీఁది చక్రవర్తిగారిశిరస్సుమీఁద మనము తపాలాచావడిలో వేసిన తేదీ గల ముద్రను ముద్రించి యుత్తరముల నన్నిటి నొకమైనపుగుడ్డసంచిలో వేసి సంచి మూతి బిగియఁగట్టి మూతిదగ్గఱ సీలువేసి, మూట బరువుగానున్నయెడల చేతిబండిలో వేసియు, మూటలు హెచ్చుగానున్నయెడల గుఱ్ఱపుబండిలో వేసియు కొనిపోఁబడును. బరువులేని యొక మూటయైనయెడల, నొక మనుష్యుఁడే గజ్జెలుకట్టిన యొక కఱ్ఱకుతగిలించి తీసికొనిపోవును. తపాలామనుష్యు లును, తపాలాబండ్లును వచ్చుచుండునపు డెదురైనవా రొత్తిగిలిపోవుదురు. రైలునందుఁగూడ ప్రత్యేకముగా నొక తపాలాబండి నిర్మింపఁబడి యుండును. ఆ తపాలాబండిలో

నుండు నుద్యోగస్థు లా సంచులను స్వాధీనముచేసికొని వానిని విప్పి యొక్కొక్క స్టేషనుదగ్గఱ నిచ్చివేయవలసిన యుత్తరములను వేఱువేఱుగా నేఱిపెట్టుకొని స్టేషను చేరిన తోడనే యా యుత్తరముల నన్నిటిని నొక సంచిలో వేసి సంచిమూతి బిగియఁగట్టి సీలువేసి, యచ్చటఁ గనిపెట్టు కొనియుండు నొక తపాలామనుష్యుని కిచ్చి వాఁడు తెచ్చిన యుత్తరములసంచిని తీసికొందురు. వాఁ డాసంచిని గ్రామ మునకుఁ దీసికొనిపోయి యచ్చటిపోస్టాఫీసులో నిచ్చి వేయును. అచ్చటియధికారు లా సంచిని విప్పి వారివారి పైవిలాసములుగల యుత్తరములను వెంటనే తపాలా బంట్రోతులమూలముగా వారివారికిఁ బంపుదురు. బంట్రోతులును వీథులువీథులు దిరిగి యా యుత్తరములను వానిమీఁదివిలాసములవారికిఁ దీసికొనిపోయి యిచ్చుదురు. రైలులేనియూళ్లకు తపాలానౌకరులు పరుగిడి యుత్తరములను జేర్చుదురు. తపాలాఫీసులలో రెండుతెగ లున్నవి. కొన్ని యాఫీసులు మనము వేయుజాబులను ముద్రలువేసి పైయాఫీసులకుఁ బంపుచుండును. మనకు వచ్చు జాబులను మన కిచ్చుట కీ యాఫీసులలోనుండు నుద్యోగస్థుల కధికారము లేదు. మఱికొన్ని యాఫీసులకు మనము వేయుజాబులను పంపుటకును మనకు వచ్చు జాబులను మన కిచ్చుటకును కూడ నధికారము కలదు.

పోస్టాఫీసువారు స్టాంపులమీఁద నుండుచక్రవర్తిశిరస్సు మీఁదనే తేదీముద్రను వేసి యందమును పాడుచేయు చున్నారని కొందఱ అనవచ్చును. అట్లనఁగూడదు. ఆ శిరస్సుమీఁద ముద్రవేయుటను మన మిచ్చిన కూలికి రసీదుగా నెంచవలసినది. అట్లు శిరస్సుమీఁదనే ముద్రవేయని యెడల ప్రజ లా బిళ్లలను మరల వాడుకచేయవచ్చును గనుక శిరస్సుమీఁద ముద్రను వేయుట సరియె. ముద్ర వేసినబిళ్లలను మరల వాడుకచేయువారు శిక్షింపఁబడుదురు. సర్కారువారు సొంతపనులను జరుపుకొనుటకై ప్రత్యేకముగా బిళ్ల లేర్పఱచియున్నారు. వానిని కచ్చేరీ యుద్యోగస్థులు తమ సొంతపనులకై యుపయోగించిన యెడల శిక్షింపఁబడుదురు.

తపాలాచార్జి దూరమునుబట్టికాక బరువునుబట్టి నిర్ణయింపఁబడియున్నది. దూరమును బట్టియైనయెడల పది మైళ్లకొక కాని యగునప్పుడు రెండువేలమైళ్లకు మూఁడు రూపాయలకుఁబైఁగా నగును. తపాలాచార్జి పేదలకుఁ గూడ ననుకూలముగ నుండవలయు నని యొక కాని బిళ్ల కూడ నేర్పఱపఁబడియున్నది. కాని మొదలుకొని యిరువదియాఱురూపాయలవఱకు వెలగల బిళ్లలున్నది. ఒక కానికర్చు గదా యని పేదవారుకూడఁ బలుతడవలు కార్డులు వ్రాయుచుందురు. వెల యధికమగునెడల

నెంతో యవసరమైన పనియున్ననేగాని వ్రాయరు. కావున చౌకవెల లేర్పఱచినందువలన దొరతనమువారికి విశేషలాభము కలుగుచున్నది. దొరతనమువా రేపనిని చేసినను జనసామాన్యమున కంతటికి నుపయోగకరముగ నుండునట్లు యోచించి చేయుదురు గాని యొకరికొఱ కెన్నఁడును చేయరు. మన మెంతదూరమున కెన్ని జాబులు వ్రాసినను పోస్టాఫీసువారు చేయవలసినపని యొక రీతిగనే యుండును. మన మీ దేశమున నెంతదూరమునకు వ్రాసినను చార్జి యొకరీతిగనే యుండునుగాని దేశాంతరములకు వ్రాయునెడల నెక్కువచార్జి కట్టవలయును. జాబులను మాత్రమేకాక, పుస్తకములను, వార్తాపత్రికలను, చిల్లరవస్తువులను గూడ దేశములోని యన్నిభాగములకును పరదేశములకును తపాలాఫీసులమూలమునఁ బంపవచ్చును. తపాలాఫీసులయుద్యోగస్థులు తపాలావిషయములను గుఱించి వ్రాయునప్పుడును, వారినిగుఱించి జనులు పై యుద్యోగస్థులకు ఫిర్యాదులను చేయునప్పుడు నుత్తరములకు బిళ్లల నంటింప నక్కఱలేదు.

మనము పోస్టాఫీసుద్వారా యొకరికి రూపాయలను పంపఁదలఁచుకొన్నప్పుడు పోస్టాఫీసులో నిర్ణయింపఁబడిన ఫారముమీఁద రూపాయలమొత్తమును, చేరవలసినవారి పేరును, నూరిపేరును వ్రాసి యియ్యవలసిన రుసుముతోఁ

గూడ నా ఫారమును తపాలాగుమాస్తాచేతి కియ్యవల యును. ఆతఁడు మన కొక రసీదు నిచ్చును. కొన్నిదిన ములయినతరువాత రూపాయలు చేరినవానియొద్దనుండి మన కొక రసీదు వచ్చును. ఈ పద్ధతికి మనీఆర్డరు (Money Order) అని పేరు. మనము పుస్తకములను గాని చిల్లర వస్తువులనుగాని పంపవలసివచ్చినప్పు డా వస్తువుల వెలను, వస్తువులు చేరవలసినవానిపేరును, నొక ఫారము మీఁద వ్రాసి, యియ్యవలసిన కూలి వెలగల బిళ్లల నా వస్తువులమీఁద నంటించి తపాలాగుమాస్తాచేతి కియ్యవల యును. కొన్ని దినములయినతరువాత మనకు రావలసిన సొమ్మును పోస్టాఫీసువారు మనకుఁ దెచ్చియిత్తురు. ఈ పద్ధ తికి వాల్యూపేబిల్ (Value Payable) అని పేరు. మనము నోట్లనుగాని నగలుమొదలగు విలువగల వస్తువులను గాని పంపఁ దలఁచుకొనునప్పుడు వానిని జాగ్రత్తగ నొక సంచిలో బిగించికట్టి సీళ్లువైచి నిర్ణయింపఁబడిన చార్జి యొక్క వెల గలబిళ్లల నంటించి తపాలాగుమాస్తాచేతి కియ్యవలయును. ఈ సంచి పోస్టాఫీసువారియజాగ్రతవలన నెవరిచేనయిన నపహరింపఁబడునేని మననగలవెలను దొర తనమువారు విచారించి మన కిచ్చివేయుదురు. ఈపద్ధతికి ఇన్షూర్యెన్సు (Insurance) అని పేరు. పోస్టుద్వారా పంపు నుత్తరములు మొదలగువానిమీఁద, చేరవలసినవాని

పేరుమాత్రమే కాక పంపువారిపేరు, విలాసమును గూడ వ్రాసినయెడల నొకవేళ నేకారణముచే నయిన నవి చేర వలసినవానికి చేరకున్నను నవి పంపినవానికే మరలఁ జేరును.

పోస్టాఫీసువారు మనయుత్తరములు మొదలగువానిని దూరస్థలములకుఁ బంపుటకు మాత్రమే కాక మనము సొమ్ము దాఁచుకొనుటకుఁగూడఁ దగిన యేర్పాట్లను చేసి యున్నారు. మనమెంత కొంచెము సొమ్మునైనను మనకుఁ దోఁచినప్పుడు తీసికొనిపోయి పోస్టాఫీసులో దాఁచవచ్చును. ఇష్ట మున్నయెడల మనము ప్రతిదినమును సొమ్మును వేయు చుండవచ్చునుగాని, తీయఁదలఁచుకొనునప్పుడు వారమున కొకపర్యాయము మాత్రమే తీయుచుండవలయును. ఒకని పేర నింతకన్న నెక్కువ మొత్త ముండఁగూడ దను నిబంధన కలదు. వారు మనకు నూటికి నెలకు నాలుగణాల చొప్పున వడ్డీ యిత్తురు. ఇట్లు సొమ్ము దాఁచిపెట్టు నేర్పాటునకు సేవింగ్సుబాంకు (Savings Bank) అని పేరు.

పోస్టాఫీసులవలన నింక నెన్నియో యుపకారములు గలవు. సేనలోఁ బనిచేసి పింఛను తీసికొన్నవారు ప్రతినెల లోను దమకుఁజేరువనున్న పోస్టాఫీసునకుఁ బోయి పింఛను తీసికొనుచుండవచ్చును. జ్వరములవలన బాధపడుచుండు వారికి పోస్టాఫీసువారు క్వైనామందు (Quinine) ను అమ్ము

దురు. మఱియు పోస్టాఫీసులోని యుద్యోగస్థులకొఱకు మాత్రమే ప్రత్యేకముగా **మరణఫండు** (Life Insurance) ఏర్పఱుపఁబడియున్నది. దానినిబంధన లితరమరణఫండు కంపెనీలనిబంధనలవంటివే. దానిలో పోస్టాఫీసు ఉద్యోగస్థులు తమవార్ధకదశయందు తమకిచ్చునట్లయినను, లేక తమయనంతరము తమవారసుల కిచ్చునట్లయినను నేర్పాటుచేసికొని తమకు తోఁచిన మొత్తములకు **ఇన్షూర్** చేసికొనవచ్చును. ఈ యేర్పాటువలన నెన్నియో పేద కుటుంబములు సుఖజీవనము చేయుచున్నవి.

కొన్ని చిన్న చిన్న గ్రామములలో బడియుపాధ్యాయులును, రైల్వే స్టేషనుమాస్టరులును తపాలాపని చూచుచున్నారు. కోట్లకొలఁది జనసంఖ్యగల యీ దేశమున నీ తపాలాపని కెందఱో యుద్యోగస్థు లుండవలసియున్నది. మనజాబులు మొదలగువానిని స్థలాంతరములకును దేశాంతరములకును బంపు ప్రదేశము తపాలాఫీసనియును, ఆ యాఫీసులలో **పోస్టుమాస్టరు** (Post Master) అను ప్రధానాధికారియు, వానికి సహాయులుగా నెందఱో యుద్యోగస్థులును పనిచేయుచుందు రనియు నిదివఱకే తెలిపియున్నాముగదా. ఈ తపాలావిషయమున నీ దేశ మంతయుఁ బదునొకండుభాగములుగ విభజింపఁబడియున్నది. ఒక్కొక్కభాగమునకు సర్కిల్ అని పేరు. ప్రతిసర్కిలును

పలువిభాగములు (Divisions) చేయఁబడి యొక్కొక్క దానికిని దగినయధికారులును నియమింపఁబడియున్నారు. ఈ పోస్టాఫీసులపైయధికారికి **పోస్టుమాస్టర్ జనరల్** అని పేరు. ఒక సర్కిలులోనుండు నాఫీసుల నన్నిటిని చూచుకొనుచుండువానికి **సూపరింటెండెంట్** (Superintendent of Post Offices) అని పేరు. ఈ **దేశములో**నుండు పోస్టాఫీసులయధికారుల కందఱికి పైయధికారికి **డైరెక్టర్ జనరల్** అని పేరు. సూపరింటెండెంట్లక్రిందఁ బనిచేయువారికి **ఇన్‌స్పెక్టర్** అని పేరు. వారు ప్రతి తపాలాఫీసును గమనించి చూచునిమిత్తము నియమింపఁబడియున్నారు. 1904 సంవత్సరమున పోస్టాఫీసులవిషయమైన లెక్క యిట్లుండినది.

| | |
|---|---|
| తపాలాఫీసులు.................... | 15,403 |
| తపాలాపెట్టెలు.................... | 34,005 |
| ఉత్తరములు.................... | 28,68,22,556 |
| వృత్తాంతపత్రికలు.................... | 3,42,62,838 |
| మూటలు (Parcels) .............. | 39,41,809 |
| ప్రధానాధికారులు వారిసహాయాధికారులు.................... | 25 |
| విచారణాధికారులును (Superintendents) ఇన్‌స్పెక్టర్లును......... .. | 536 |

| | |
|---|---|
| పోస్టుమాస్టరులు.................. | 6,229 |
| తపాలాయుద్యోగముచేయుస్కూలుమాస్టర్లను స్టేషన్‌మాస్టర్లను.......... | 9,371 |
| గుమాస్తాలు.................... | 10,222 |
| తపాలాబంట్రాతులు............... | 28,073 |
| తపాలామూటలను మోసుకొని పరుగెత్తువారు.................... | 20,419 |
| తంతులుకొట్టువారు................ | 2,715 |
| ఈయిలాకాపనివారి యందఱి మొత్తము. | 77,590 |
| కడచిన మూడు సంవత్సరములుగా నీయిలాకాలో లభించిన యాదాయము రూ................... | 41,00,000 |
| ఒక సంవత్సరమునఁ దప్పిదముచేసినందుకై యుద్యోగమునుండి తొలఁగింపఁబడిన సేవకులు.............. | 534 |
| ద్రవ్యనిక్షేపణనిధులలో (Savings Bank) చేరినవారు................... | 9,87,635 |
| క్షేమద్రవ్యము రూ................. | 12,33,00,000 |
| పైమొత్తమునకు వడ్డి రూ........... | 35,00,000 |

పోస్టాఫీసులపైని దొరతనమువారి కెంత యెక్కువగ నాదాయము వచ్చుచుండునో యుద్యోగస్థుల కంత యెక్కువగ జీతములియ్యఁబడుచుండును. తపాలాబిళ్లలు (Postage Stamps) అమ్మువారికి రూపాయ కింత యని తరుగు ముందియ్యఁబడుచుండినది. బిళ్ల లమ్ముటకై యిచ్చుచుండిన యీ తరు గిప్పుడు నిలిపివేయఁబడినది. ఇట్లు చేయుటచే మిగిలెడు సొమ్ము తపాలాయుద్యోగస్థుల జీతములను హెచ్చించుటకై వినియోగపఱుపఁబడుచున్నది.

అనేక ప్రదేశములలో తపాలాకచ్చేరీలతోఁగూడ తంతి యాఫీసులును జేర్చియుంచుట మనకుఁ దెలిసినదియే కదా. తంతి యనునది వృత్తాంతములను బంపుటకై తపాలా కంటెను వేగముగా నుపయోగపడు సాధనము. ఉత్తరములను బాగబండ్లలో నెక్కించి పంపునట్లే, వృత్తాంతములను విద్యుత్సారతంతులమూలమునఁ బంపుదురు. అవసరతంతి యనియు, సాధారణతంతియనియు తంతి రెండుతెగలై యున్నది. తంతియాఫీసులో విలువ లేకయే యూరక యియ్యఁబడు నచ్చునమూనాలలో (Telegraph Forms) వృత్తాంతమును, పుచ్చుకొనువారిపేరు విలాసములను సంగ్రహముగా నాంగ్లేయభాషయందు వ్రాసి, దానికై విధించియుండు కట్టమునకుఁ దగు కిమ్మత్తుగల తపాలాబిళ్ల

లను గొని, యా నమూనాలోఁ జెప్పఁబడిన తావున నంటించి యిచ్చినయెడల, నచ్చటి యుద్యోగు లా వృత్తాంతమును మనము గనఁబఱచిన తావులకుఁ బంపివేయుదురు. మనము సొమ్ము చెల్లించినా మనుటకు గుఱుతుగా రసీదు లిత్తురు. సాధారణతంతికి 12 పదములవఱకు 6 అణాలును, దానికిఁబైఁబడిన పదము 1-కి ½ అణాయును, అవసరతంతికి 12 మాటలవఱకు 1 రూపాయయును, దానికిఁబైఁబడిన మాట 1-కి 2 అణాలును కట్టము పుచ్చుకొందురు. తమ కడకు వచ్చినవృత్తాంతముల నొకకాకితములో వ్రాసి, దాని నొక యెఱ్ఱరంగు గల యొరలోవేసి, పైవిలాసము వ్రాసి, యందు గుర్తింపఁబడినవారికిఁ దపాలా యుద్యోగస్థులు బట్వాడాచేయుదురు. ఏ తంతిలోను 12 మాటల లోపలనే పైవిలాసము చేరియుండవలెను. తంతి పోయి చేరవలసినయూరు తంతియాఫీసునుండి 7 మైళ్లదూరమున కంటె మించినదూరమున నున్నయెడల, తంతిసమాచారమునకై చెల్లించుకట్టముతోఁగూడఁ గొనిపోవుమనుష్యునికి మోఁతకూలియు నియ్యవలెను.

1904 సంవత్సరమున 2,127 తంతియాఫీసు లుండినవి. వానిలో 1,859 ఆఫీసులు తపాలాకచ్చేరీలతో చేరియుండినవి. తక్కినవి ప్రత్యేకములైన తంతియాఫీసులుగానే

యున్నవి. ప్రతి సంవత్సరమునను గొన్ని తంతియాఫీసులు క్రొత్తగా స్థాపింపఁబడుచున్నవి. ఈ యిలాకాలో నుండెడి యుద్యోగస్థులక్రమమును, మొత్తమును క్రిందఁ జూపఁబడియున్నవి.

| | |
|---|---|
| ప్రధానవిచారణాధికారులు (Superintendents). | 34 |
| సహాయవిచారణాధికారులు (Assistant Superintendents) ...................... | 146 |
| తంతియాఫీసుల యధికారులును, తంతికొట్టువారును (Telegraph Masters and Signallers). | 2,361 |
| గుమాస్తాలును, తగ్గుతరగతియుద్యోగస్థులును. | 8,000 |
| మొత్తము... | 10,541 |

ఈ దేశమునందు 1855-వ సంవత్సరప్రారంభమునుండియే దొరతనమువారు తంతులు వేయుట కారంభించిరి. మొదట సుమారు 3,000 మైళ్లవిస్తీర్ణమునకే తంతి వేయఁబడినది. ఇప్పు డీ దేశమున తంతులు వ్యాపించియుండు విస్తీర్ణము 67,587 మైళ్లుండును.

తంతు లేర్పఱచుటవలన దొరతనమువారికి 125 లక్షల రూపాయలయాదాయమును, 96 లక్షలరూపాయలు

వ్యయమునగుచున్నవి. సంవత్సరమాద్యంతము నించుమించుగా నొక కోటితంతులు పంపఁబడుచున్నవి.

ఇవ్విధముగ దొరతనమువారు తంతులమూలమునను, తపాలామూలమునను జనుల కనేకసౌకర్యములను గలుగఁజేయుచున్నారు. జనులు వృత్తాంతములు పంపుటకై యెక్కువ ద్రవ్యవ్యయము చేయనక్కఱలేదు. ఈయిలాకాలలో వేలకొలఁది బీదజనులు దొరతనమువారిచే నియమింపఁబడి తగినజీతములు పొంది జీవించుచున్నారు. ఈ సాధనములవలన వర్తకమును, చేతిపనులును, జ్ఞానమును, నాగరికతయు వృద్ధిచెందుచున్నవి. ఈ దేశమునందును బరదేశములందును జరుగు వృత్తాంతముల నందఱు చక్కఁగాఁ దెలియఁగూడినవృత్తాంతపత్రికలు, తపాలును తంతియు లేకున్నచోఁ గ్రమముగా జరుగనేరవు. ఈ సాధనములు రాజ్యపరిపాలనమునకును, దేశసంరక్షణమునకును నావశ్యకములైనవి. ఈ దేశమునఁ గలహము సంభవించినను, పరదేశస్థులవలన నపాయము గలిగినను, ముఖ్యములయిన యీసాధనములమూలమునఁ బలుసేనలను వెంటనే రప్పించి, సేకరించికొని బాగుగాఁ గావలిపెట్టి కాపాడవచ్చును. ఈ దేశాభివృద్ధికిఁ గారణమగు పరదేశవర్తక మీసాధనములు లేనిచో మిక్కిలి తగ్గిపోవును.

వృత్తాంతములు పంపను రప్పింపను బూర్వికులు చేయుచు వచ్చినయేర్పాట్లకు నిప్పు డాంగ్లేయప్రభువు లమర్చియుండు సాధనములకును గల వ్యత్యాసము లివి యని యందఱు దెలిసికొనవచ్చును.



## 10. దొరతనమువారును, ఇనుపదారులును.

ఇనుపదారుల యుపయోగము — దొరతనమువారికిని వీనికినిగల సంబంధము — మార్గముల వివరము — వీనివలన జనులకుఁ గలుగు మేలులు— దొరతనమువారిచేఁ బైవిచారణనిమిత్తము చేయఁబడియుండు విధులు.

తపాలా, తంతి యీయిలాకాలయుపయోగములు ముందటియధ్యాయమున వివరింపఁబడినవి. తపాలాపనులకు సాహాయ్యకారిగా నుండునది యినుపదారి. పూర్వకాలమున ఢిల్లీనగరము నేలినసుల్తానులలోఁ గొందఱు తపాలాయొక్క రాకపోకలకై గుఱ్ఱపుబండ్ల నేర్పఱచి, జనులకు సౌకర్యములను గలిగించిరి. దానిని మనదేశస్థులు బహువింతగాఁ బొగడుకొనుచుండిరి. అంతమాత్రమునకే యట్లు పొగడ్తలు చేయునప్పు డొక గంటకు 50 మైళ్ల దూరము పోయెడిపొగబండ్ల నెంతగా మనము శ్లాఘింపవలెను! ఈ పొగబండ్లు తపాలాయుత్తరములు మున్నవి గల

మూటలను గొనిపోవుట మాత్రము గాక, ప్రయాణులను, సరకులను, గొడ్డుగోదలను, గుఱ్ఱములను ఈ మొదలగు ననేకమృగములను నెక్కించుకొని, బహువేగముగాఁ బరుగెత్తుచున్నవి.

వీనికై మన మొసఁగు కట్నమును, అవి చేయు మహోపకారములను సరిపోల్చిచూడఁగా, మన మొసఁగుకట్నము బహు స్వల్ప మని స్పష్ట మగుచున్నది. పొగబండ్లు నీటియావిరిబలముచేతనే సాగుచున్నవి. ఎద్దుల బండ్లు, గుఱ్ఱపుబండ్లు, పల్లకులు మొదలగువాహనముల కంటెఁ బొగబండ్లు నానావిధములచే శ్రేష్ఠములైనవి యని చెప్పవచ్చును. జను లెంతకూటములు కూడియున్నను, తక్కిన వాహనములం దెక్కక, తఱచుగా నీ పొగబండ్ల యందే యెక్కిపోవుటవలన, వీనిశ్రేష్ఠ్య మిట్టి దని తెలియును.

ఇప్పు డీదేశమునందుఁ గల యినుపదారులమొత్తము నిడివి యించుమించుగా 29,000 మైళ్లుండును. ఈ మార్గముల నేర్పఱచుటకై 360 కోట్ల రూపాయలకుఁ బైగాఁ బట్టియుండవచ్చును. అయోమార్గనిర్మాణము బహుదుష్కరకార్యము. ఒక మైలుదూరము మార్గనిర్మాణమునకు లక్షరూపాయలకంటె నెచ్చుగా వ్యయ మగును గొంపు




ఇండియాయొక్క ఇనుపదారులు.

నను, నీ దేశస్థులు గొప్పమొత్తములు వెచ్చించి యీమార్గములనేర్పఱుప శక్తిలేనివారుగ నుండుటచేతను, ఇంగ్లాండు దేశమునం దుండుధనికులను, గొప్పవ్యాపారులసంఘములను బ్రోత్సాహపఱచి యీ దేశమున నినుపదారులను దొరతనమువారు వేయించిరి. వా రొప్పుకొనుటనిమిత్తము, అయోమార్గనిర్మాణమునకై కావలసియుండు భూములను దామే కొని యిచ్చునట్లును, వ్యయపఱచు మొత్తమునకు నూటి కింత యని యెంచుకొన్నలాభము దొరకనియెడల, నా తగ్గినమొత్తమును తా మొసఁగునట్లును, నెంచినమొత్తమునకంటె లాభ మెక్కువగా వచ్చినయెడల వచ్చినలాభమున నర్ధాంశము మాత్రము వారు దీసికొనవచ్చునట్లును, కొన్ని సంవత్సరములకుఁ బిమ్మటఁ దామే యినుపదారులను, బండ్లను తమసొంతమునకై క్రయ మిచ్చి తీసికొనునట్లును, నొడంబడిక చేసికొనిరి. ఈ నిబంధనకే యాంగ్లేయభాషయందు "గారంటీసిస్టమ్" (Guarantee System) అని పేరు. దీనివలన మొదట రాజ్యాంగమువారికి నష్టము సంభవించినది. ఇప్పుడు కొన్ని యినుపదారులను దొరతనమువారు తాము చేసికొన్నయొడంబడికల ప్రకారము సొంతమునకుఁ దీసికొన్నందునను, క్రమక్రమముగా నాదాయము వృద్ధి యగుచున్నందునను, సాలునకు 3 కోట్ల రూపాయల

లాభము దొరతనమువారికి లభించుచున్నది. మన ప్రభుత్వమువారే కాక, స్వదేశరాజులును తమసొంతద్రవ్యమును వెచ్చించియో, దొరతనమువారికడ ఋణముగైకొనియో కొన్ని యినుపదారులను నిర్మించియున్నారు. ఇత్తెఱంగున వేయఁబడినయినుపదారుల నిడివి సగటునకు 3,472 మైళ్లుండవచ్చును. అంతేకాక, కొన్నిజిల్లాలలో నీ మార్గముల నిర్మించుటకై దొరతనమువారు జిల్లావిచారణసంఘములవారికి (District Boards) అప్పు లిచ్చియున్నారు. జిల్లాసభలవలన మద్రాసుమాగాణములోఁ జేరినతంజావూరిజిల్లాలో 105 మైళ్ల నిడివియు, బంగాళామాగాణమునందు 168 మైళ్లనిడివియుఁగల యినుపదారులు వేయఁబడియున్నవి. తామే సొంతముగ నయోమార్గములను వేయించుటకుఁ దగినంత శక్తి యీ దేశస్థుల కింకను రాలేదు. ఇట్టిస్థితి వీరికిఁ గలుగుటకు నింకను చాలకాలము పట్టు నని తోఁచుచున్నది. ఈ దేశమున నిప్పుడు వేయఁబడియుండు నినుపదారు లొకటే వెడల్పు గలవి గావు. దక్షిణ యిండియాయినుపదారివలెఁ గొన్ని తగ్గువెడల్పు గలవిగాను, కొన్ని చెన్నపురియినుపదారివలె నెక్కువ వెడల్పు గలవిగాను నున్నవి. మార్గములవైశాల్యము ననుసరించియే బండ్లయొక్క వైశాల్యము నుండును. వెడల్పుగల యినుపదారియందుఁ బోవునట్టిబండ్లు వెడల్పుతగ్గిన యినుపదారి

యందుఁ బోనేఱవు. మార్గము వెడల్పుగా నున్నయెడ, గాలియుపద్రవము మెండుగాఁ గలుగదు. ఇంగ్లాండునందలి యయోమార్గముల వెడల్పు 4 అడుగుల 8½ అంగుళములు. తుపానువలన సంభవించు నపాయములు ఇంగ్లాండు కంటె నీ దేశమున మెండుగా నుండుటవలన నిచ్చటి యినుపదారులవెడల్పు 5½ అడుగు లుండవలెనని మొదట మొదటఁ దలఁచినారు. అయినను, కాలక్రమమున వ్యయమును దలఁచి, వెడల్పుతగ్గినయినుపదారులును వేయవచ్చునని నిశ్చయించి, 3 అడుగులు 3⅜ అంగుళములవెడల్పుగల మార్గములనే వేయఁదొడఁగిరి. ఇనుపదారు లొకటే వెడల్పు గలవిగా నుండనియెడల, క్షామకాలమునందు క్షామము సంభవించియుండుదేశముల కాహారపదార్థములను విస్తారముగాఁ బంపుటకును, గలహము సంభవించు కాలములలో సేనలను బలుప్రదేశములనుండి కలహము సంభవించినప్రదేశములకు వేగముగాఁ జేర్చుటకును శ్రమముగా నుండును. కాఁబట్టి యీ దేశమునఁ బలుతావులలో నిర్మింపఁబడియుండు వెడల్పుతగ్గిన యినుపదారులను గూడ నొకటేవిధమైన వెడల్పుగలవిగా నిర్మించి, యొకదానితో మఱియొక్కటి చేర్చివేయవలయుననియు, దానికిఁగా నెక్కుడు ద్రవ్యము దొరకినప్పు డాపనిని జేయవలయుననియు దొరతనమువా రుద్దేశించియున్నారు. కొన్ని స్థల

ములలో 2 అడుగులు, లేక, 2½ అడుగు వెడల్పుగల శాఖామార్గములు గూడ నిర్మింపఁబడియున్నవి. మొదట నీ దేశమున నినుపదారులు వేయునప్పుడు, ఈ దేశము నందలిప్రయాణికులవలన నధికాదాయము రాదేమో యని వానియజమానులు భయపడిరి. అయినను, స్థల యాత్రలు, పుణ్యతీర్థయాత్రలు చేయువా రీ దేశమున విశేషముగా నుండుటవలనను, నెక్కువ కూలి యపేక్షించి జను లొక్కచోటినుండి మఱియొక్కచోటికి మాటిమాటికి వచ్చుచుఁ బోవుచు నున్నందువలనను బాటసారులవలన వచ్చెడు నాదాయము నానాటికి హెచ్చుచునేయున్నది. బండ్లలో మొదటి, రెండవ, మూడవతరగతులని మూడు తరగతులు జను లిచ్చుకట్టము ననుసరించినసౌకర్యము లతోఁ గూడినవై యున్నవి. ఇప్పు డినుపదారులవారికి లభించు 1,176 లక్షలయాదాయమున 990 లక్షలు మూడవతరగతిలో నెక్కువారివలననే లభించుటంజేసి, వారికిఁ గావలయుసౌకర్యములనే యినుపదారులసంఘము వారిమూలమున నెక్కువగాఁ గలిగింపఁ బ్రభుత్వమువారు ప్రయత్నములు చేయుచు వచ్చుచున్నారు.

ప్రయాణికులకంటెను సరకులను గొనిపోవుటవలన వచ్చుబడి యెక్కువగా నుండవచ్చును. ఇనుపదారిబండ్లలో

నెక్కనివారును వానిని జూడనివారును నుండవచ్చును గాని, వానిమూలముగా వచ్చెడు పదార్థములను గొని యుపయోగింపనివా రుండరు. ధాన్యములు, విత్తనములు, నేలబొగ్గు, దూది, ఉప్పు, చక్కెర, కలప మొదలగు సరకులు గొనిపోవుటవలననే రైల్వేవారికి 25 కోట్లరూపాయలకంటె నెచ్చుగా వచ్చుబడి లభించుచున్నది. ఒక ప్రదేశమున నధికముగాఁ బండెడు ధాన్యము లవిపండని దేశములకు నినుపదారులమూలమున విశేషముగాఁ గొనిపోఁబడుటవలన నన్ని దేశములందును వస్తువులవెలలు రమారమి యేకరీతిగనే యున్నవి. "రైలు వచ్చుటచే, వెల లన్నియు నొక్క విధమైనవి" యను వాడుకను లోకు లందఱు వినియుండవచ్చును. ఈ దేశమున ముప్పాతిక పాలుజనులు పైరుపెట్టి జీవించు రైతులుగానుండుటవలన, సకాలమునకు వాన గురియకున్న నీ దేశమునఁ గలుగు నిడుమలు మెండుగాఁ గలవు. కాఁబట్టి, వ్యవసాయవృత్తి మాత్రమేకాక యితరవృత్తులును నుండెనేని, క్షామకాలమునఁ గలిగెడుశ్రమలు తగ్గును. ఇనుపదారులే పలువృత్తులకు మూలాధారములుగ నున్నవి. పొగబండ్లను నడిపించుటకును, కట్టడములు నిర్మించుటకును, శిల్పశాలల నేర్పఱచుటకును, డబ్బుదీసికొని టిక్కట్లిచ్చుటకును, లెక్కలను వ్రాయుటకును లక్షలకొలఁది జను లుద్యోగము

లలోఁ గూర్పఁబడియున్నారు. ఇంచుమించుగా 4 లక్షల మందిజను లినుపదారులకు సంబంధించిన యుద్యోగములలో నున్నారు. కూలివాండ్రకును, బంటులకును లెక్కయే లేదు. నానాజాతులవారిని, నానాదేశములవారిని, బ్రయాణములలో నొకటిగాఁ జేర్చి, వారి జ్ఞానమును, స్నేహమును వృద్ధిపఱచునవి యీ యినుపదారులే.

ఇప్పుడీదేశమునందలి యినుపదారులపేరులు మొదలగు వివరము లీ క్రిందిపట్టివలనఁ దెలియవచ్చును:—

| ఇనుపదారుల పేరులు. | అవి పోవు ప్రాంతములు. | మార్గము యొక్క నిడివి (మైళ్లు.) | దారివేయ నారంభించిన సంవత్సరము. | ఒడంబడిక ముగియు సంవత్సరము. | వెడల్పా లేక, కుఱుచయా? | లాభమా లేక, నష్టమా? | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|---|---|
| 1. దక్షిణయిండియా యిను పదారి (S. I. R.) | దక్షిణ హిందూ దేశము | 1353 | 1861 | 1891 | కుఱుచ. | లాభము. | బాటసారులు మెండు. |
| 2. దక్షిణమహారాష్ట్ర యినుపదారి. (S. M. R.) | బొంబాయి దక్షిణభాగము | 1687 | 1884 | 1907 | కుఱుచ. | నష్టము. | బాటసారులు తక్కువ. |
| 3. చెన్నపురి యినుపదారి. (M. R.) | చెన్నరాజధాని ఉత్తరభాగము. | 1493 | 1856 | 1908 | వెడల్పు. | నష్టము. | 1907 సం॥న పైరెంటితోఁ జేర్చి వేయఁబడినది. |
| 4. గ్రేటు ఇండియన్ పెనిన్సులర్ రైల్వే. (G. I. P. R). | బొంబాయి మొదలు రేయచూరి వఱకు. | 3009 | 1870 | 1900 | వెడల్పు. | నష్టము. | మొదటితరగతి ప్రయాణి లెక్కువ. దూది వ్యాపారము మెండు. |
| 5. బంగాళా నాగపురము ఇనుపదారి. (B.N.R.) | మధ్యదేశము. | 2170 | 1891 | 1913 | వెడల్పు. | స్వల్ప లాభము. | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 6. మధ్యయిండియా ఇనుపదారి. (C. I. R.) | బొంబాయి రాజధాని. | 3192 | 1872 | 1905 | 868 మైళ్లు వెడల్పు; తక్కినది కుఱుచ. | నష్టము. | సరుకులెక్కువ. |
| 7. తూర్పుబంగాళా యినుపదారి. (E. B. R.) | తూర్పుబంగాళము. | 1272 | 1862 | 1884 | 495 మైళ్లు వెడల్పు; తక్కినది కుఱుచ. | లాభము. | |
| 8. తూర్పుయిండియా యినుపదారి. (E. I. R.) | గంగాతీరము. | 2225 | 1854 | 1880 | వెడల్పు. | అధిక లాభము. | నేలబొగ్గు యెగుమతి దిగుమతి. |
| 9. వాయవ్యబంగాళా యినుపదారి. (N.W.B.R.) | గంగానదియొక్క ఉత్తరభాగము. | 1468 | 1874 | 1932 | కుఱుచ. | లాభము. | సారవంతమగు దేశము. |
| 10. వాయవ్యసర్కారు ఇనుపదారి. (N. W. S. R.) | హిందూదేశ వాయవ్యభాగము. | 4426 | 1861 | 1886 | వెడల్పు. | లాభము. | గోధుమల యెగుమతి. |
| 11. అయోధ్యా రోహిలఖండము ఇనుపదారి. (O. R. R.) | గంగోత్తర భాగము. | 1277 | 1867 | 1889 | వెడల్పు. | స్వల్ప లాభము. | సారవంతమగు దేశము. |
| 12. ఆసాముబంగాళా యినుపదారి. (A. B. R.) | | 775 | 1895 | 1921 | కుఱుచ. | అధిక నష్టము. | ప్రత్యేక మార్గము. |

ఇనుపదారులు నిర్మించుటకై యయ్యాయిసంఘముల వారు పెట్టుమూలధనమునకు నియమితమయినవడ్డికిఁ దక్కువగా లాభము దొఱకెనేని, యా తగ్గుడుమొత్తమును దా మొసఁగునట్లును, నియమితకాలమున నయోమార్గములను దామే క్రయపఱచుకొనునట్లును దొరతనమువా రొడంబడికచేసికొనియుండుటవలన వానిని వేయునప్పుడును, వేసినపిదపఁ గూడఁ జేయు వ్యయములు క్రమముగా నున్నవా యనుటను జక్కఁగా గమనించుటకు అయోమార్గవిచారణాధికారి (Consulting Engineer for Railways) అను నుద్యోగస్థుని నొక్కొక్క మాగాణమునందును నియమించియున్నారు. క్రొత్తమార్గములు



యమునానదిలో ఇనుపదారికిగాను కట్టించిన వంతెన.

వేయునపుడును, గొప్పవంతెనలను గట్టునప్పుడును, కొండలను దొలిచి సొరంగములను (Tunnels) జేయునప్పుడును,

మదింపువేసికొన్న మొత్తమునకంటె నెక్కువగా వ్యయము చేయవలసి వచ్చినప్పుడును, నిండియా ప్రభుత్వమువారిసమ్మతిని యినుపదారిసంఘములవారందఱును బొందవలయునని ప్రభుత్వము వారు విధించియున్నారు. వారియిష్టానుసారముగా ఖర్చులు చక్కఁగా చేయఁబడుచున్నవా యను నంశమును గూడఁ బైఁజెప్పిన యినుపదారులవిచారణాధికారులు విచారించుకొనుచున్నారు. అయినను, నీ యేర్పాటులవలన నీదేశ మంతయు వ్యాపించియుండు నయోమార్గములఁ గూర్చినవిషయము లోకకేటీరున నడచుచుండుట లేదనియు, నానాటికి హెచ్చుచుండునినుపదారుల పైవిచారణకై, చక్కనినిపుణులనే పైయధికారులనుగా నియమింపవలయుననియు రాజప్రతినిధిగానుండిన కర్జన్ప్రభుప్ర పరిపాలనమందుఁ బ్రభుత్వమువారు తలఁచి 1901-02-వ సంవత్సరములందు నీ దేశమందలి యినుపదారులను నమెరికాదేశమందలివానిని సరిపోల్చిచూచి, కరణీయములయిన సవరణ లివి యని తెలియఁబఱచుటకుఁ బ్రవీణుని నొకని నేర్పఱచిరి. ఈ దేశమందలి యినుపదారుల పైవిచారణకై ముగ్గు రనుభవశాలురగు నిపుణులుగల సభయొక్కటి యుండవలయు ననియు, నిరుపయోగము లగు కట్టుదిట్టములవలనను, నిబంధనలవలనను నా సంఘము వారి యధికారములను దగ్గింపరా దనియు వాక్రుచ్చిన

వారు వీరే. వీరియభిప్రాయానుసారముగ దొరతనము వారు 1905 సంవత్సరమున మార్చినెలలో "ఇనుపదారుల సంఘము" అను నొక సంఘము నేర్పాటుచేసి, వాణిజ్య వృత్తిశాఖవారి (Department of Commerce and Industry) విచారణయందుంచిరి. ఈ సంఘమువారు సామాన్యముగా నన్నియినుపదారులయొక్క జమఖర్చులు మొదలగువిషయములను గమనించి ప్రభుత్వమువారికి యోచనలు సెప్పుటకును, ప్రభుత్వమువారియినుపదారులను దగినయధికారులమూలమున నిర్మించుటకును, నప్పుడప్పుడు సంభవించువివాదములను దీర్చుటకును, సంఘమువారిసెలవులను విమర్శించిచూచుటకును నధికారమును బొందియున్నారు. ఈ మేలయిన విధానములవలనను, దొరతనమువారి పూనికవలనను దేశమందంతట నుండు నినుపదారులవిచారణ యేకరీతిగా నగుటయేకాక, కాలక్రమమునఁ బ్రభుత్వమువారికి విశేషలాభము గలుగవచ్చుననియు మనము దృఢముగాఁ జెప్పవచ్చును. జనులకు శ్రమ నియ్యక, దొరతనమువారి కాదాయము నభివృద్ధి పఱచుసాధనములలో నయోమార్గములు ముఖ్యము లని చెప్పవచ్చును.

పొగబండ్లలో నెక్కుప్రయాణికు లొండొరులతోఁ గలహము లొనర్పకుండుటకును, ఈ బండ్లే తమదొంగతన

మున కాధారముగాఁ బెట్టుకొనియుండుదొంగలను గనిపెట్టు టకును, చీట్లు (టిక్కట్లు) పుచ్చుకొనకయే బండ్లెక్కిపోవు ప్రయాణికులను దండించుటకును, బండ్లు పరుగెత్తునప్పుడు దుష్టులవలనియపాయములు ప్రయాణికులకు సంభవింప కుండునట్లు చూచుకొనుటకును దొరతనమువారు రక్షక భటులను (Railway Police) పలువురను నియమించి యున్నారు. అంతియకాక, జను లుత్సవాదులందు విశే షముగాఁ బోవునప్పుడు, వారియొక్క సౌకర్యములకై చేయవలసిన యేర్పాటుల నన్నిటిని జేయునట్లు లినుప దారులసంఘములవారికి దొరతనమువా రుత్తరువు చేయు చున్నారు.

జనుల కేకారణమువలననైనను నసౌకర్యము సంభవిం చినయెడల, వారు దొరతనమువారి కీసంగతిఁ దెలిపిన, వెంటనే యా యసౌకర్యమును బోకార్చుమార్గములు వెదకఁబడుచున్నవి.



## 11. దొరతనమువారును, కట్టడములును, నీటివసతియు.

---

దొరతనమువారికిఁ గట్టడము లవశ్యము లనునది—కట్టడములయిలా కాయొక్క స్వరూపము—ఈ యిలాకాకుఁ జేసెన పను లిట్టివి యనుట—రోడ్లు—వంతెనలు—కాలువలు—అనకట్టలు—కట్టడములు—ముందటి కాలపుకట్టడములును, ప్రకృతకట్టడములును.

అనేకము లైన గొప్పకట్టడములను దొరతనమువారు కట్టించుచున్నా రనుట యందఱికిఁ దెలిసినవిషయమే. సర్వ జనసాధారణకార్యములకయి, జను లందఱు కూడియైనను, దొరతనమువారయినను గట్టడములను నిర్మింపవలయును. గ్రామములలో సత్రములను, రచ్చచావళ్లను గ్రామస్థు లందఱు చేరి కట్టించుచున్నట్లు, ఉద్యోగస్థులు పనిచేయుటకుఁ గట్టడములను (కచ్చేరీలను), సేనలు విడియుటకు నివేశము లను, కోటలను, జనులు నడుచుటకు బాటలను, నదులను దాఁటుటకు వంతెనలను, నీటిపాఱుదలకుఁ గాలువలను, వివాదములు తీర్చుటకు న్యాయస్థలములను, రోగులచికిత్స లకు వైద్యశాలలను, పలువిధములగు శిల్పశాలలను, దొర తనమువా రేర్పాటుచేయుచున్నారు. ఇట్టి పను లనేకము లుగానుండుటవలన, వీనియన్నిటివిచారణలకై యీ పను లం దనుభవము గలగొప్పయుద్యోగస్థులను నియమించి

వారినిమిత్తమై ప్రత్యేకముగా నొక యిలాకా నేర్పఱచి యున్నారు.

ఏఁబదిసంవత్సరములనుండియే యీ యిలాకా యేర్పడి యములులోనికి వచ్చుచున్నది. మొదట సేన లుండుట కుపయోగపడు కట్టడములనుమాత్రమే దొరతనమువారుకట్టుచువచ్చిరి. పిమ్మట లార్డ్ డల్హౌసీ (Lord Dalhousie) యను గవర్నర్ జనరల్ కాలములో నీ యిలాకా యేర్పాటు చేయఁబడెను. అదిమొదలుకొని యింజనీరులు (Engineers) అను పేరుగల యధికారులు నియమింపఁబడిరి. వారు తమయధికారములకుఁ దగినట్లు ప్రధాన యింజనీరు (Chief Engineer) అనియు, తనిఖీచేయుయింజనీరు (Superintending Engineer) అనియు, జిల్లాయింజనీరు (Executive Engineer) అనియు, సహాయ యింజనీరు (Assistant Engineer) అనియు, తగ్గుతరగతి యింజనీరు (Engineer Subordinate) అనియు పేరులు పొందియు


లార్డ్ డల్హౌసీ.

న్నారు. వీరి కందఱికిఁ బనులు నేర్పుటకై యింజనీరింగు కాలేజీలు (Engineering College) అనుకలాశాల లనేకములు స్థాపింపఁబడియున్నవి. కొన్ని యేండ్లకుఁ బిమ్మట సేనలకుఁ గావలసినకట్టడములను ప్రత్యేకించి వానిని సేనల యధికారులవశము చేయుట యావశ్యక మని తోఁచినది. కాఁబట్టి రాజ్యాంగమునకుఁ గావలసినకట్టడములు కట్టుట, రోడ్డులు వేయుట, కాలువలు త్రవ్వుట, యనువీనిని యీ యిలాకావారు విచారించుకొన్నయెడలఁ జాలు నని యాయా సూగాణములయధికారులకు దొరతనమువా రుత్తరువు చేసియున్నారు. ఈ పనులకుఁగానే యించుమించుగా 1,000 యింజనీరులును, అసంఖ్యాకులగు క్రింది యుద్యోగస్థులును నియమింపఁబడియున్నారు. క్రింది యధికారులు, తఱచుగా చెన్నపురి, పునహా, సిప్పురము, రూర్కీ యను పురములలో నుండుదొరతనమువారియింజనీరింగుకలాశాలలలోఁ జదివి తేఱినవారుగ నున్నారు.

ఈ యిలాకాకు సంబంధపడినపనులను 6 తెగలుగా భాగింపవచ్చును. అవి యేవనఁగా.—1. రోడ్లువేయుట, 2. వంతెనలు కట్టుట, 3. కాలువలు త్రవ్వుట, 4. అనకట్టలను గట్టుట, 5. కట్టడములను గట్టుట, 6. ప్రాఁతకట్టడములను గ్రొత్తవిగాఁ జేయుట.

1. **బాటలు (రోడ్లు)**:—ఈ మాగాణమునందు మాత్రముగల బాటలమొత్తమునిడివి 25,000 మైళ్లకుఁ బైఁబడియున్నది. ఆ బాటలను దీర్చి వానిరెండుప్రక్కలను జెట్లను నాఁటించి, దింపుడుతిన్నెలు కట్టి, దిగుటకు సత్రములేర్పఱచి, దొంగలవలనిభయముఁ బాపుటచే నిప్పుడు వర్తకులకుఁ గలుగుచుండు సౌకర్యముల నందఱు సులభముగాఁ దెలిసికోవచ్చును. ఇనుపదారు లేర్పడినపిమ్మటను బాటలయుపయోగము తగ్గినది కాదు. ఏలయన, నినుపదారులమూలమున నితరసీమలనుండి తీసికొనిరాఁబడు వస్తువులు గ్రామములకుఁ గొనిపోవుటకై యీ బాటలత్యావశ్యకములై యున్నవి. వీనిలో ననేకములగు బాటలు గులకపోసి గట్టించి బలపఱపఁబడుచున్నవి. ఈ రాజధానిలో నిట్టి బాటలయన్నింటిమొత్తమునిడివి రమారమి 20 వేలమైళ్లుండవచ్చును. పంజాబుదేశమునందును మేలైనబాట లనేకము లున్నవి.

2. **వంతెనలు**:—ఈ రాజధానిలో విశేషముగా నదులు పడమటికనమలలోఁ బుట్టి తూర్పుసముద్రములోఁ గలియుచున్నవి. కాఁబట్టి యొక మనుష్యుఁడు కన్యాకుమార్యగ్రము నుండి గంగాతీరమువఱకు వెళ్లవలసివచ్చినట్టయిన, కావేరి, కృష్ణ, గోదావరి, మహానది మొదలగు పలునదులను దాఁటియే పోవలెను. ఈ నదులకు వంతెనలు లేని



కృష్ణానది రైల్వేవారధి.

యెడల, ప్రయాణమునకు నాటంకములు గలుగును. కనుక, బాటసారులు దాఁటిపోవుటకును, రైలుబండ్లు పోవుటకును, రాతివంతెనలును నినుపవంతెనలును ననేకస్థలములందుఁ గట్టఁబడియున్నవి. ప్రాఁతవంతెనలు నూతనపఱుపఁబడుచున్నవి. జీవనదులకు వంతెనలు నిర్మించుటకై విశేషద్రవ్యము వ్యయమగును. అట్లుండినను, దొరతనమువారు ద్రవ్యవిషయమై వెనుదీయక, గంగ, సింధువు, గోదావరి, కృష్ణ మొదలగు జీవనదులకు వంతెనలు కట్టియున్నారు.

3. **కాలువలు:** — వ్యవసాయముచేసి జీవనముచేయు జనులు విశేషముగానుండెడి యీ దేశమునందు నీటిపాఱుదలకుఁ గావలసినసాధనము లనేకము లున్నవి. కనిగిరి, కంభము మొదలగు చెరువులవలనను, పెన్న, గోదావరి, కృష్ణ మొదలగువానికాలువలమూలమునను, క్రిందయూట గలతావులందుఁ ద్రవ్వఁబడినబావులమూలమునను నీటిపాఱుదల జరుగుచున్నది. ముందటి కాలమందు జనులు తమసొంతధనము వెచ్చించి చెరువులను, బావులను, గుంటలను ద్రవ్వించుకొనుచుండిరి. ఈ మాగాణమునందు మాత్రము 40,000 చెరువులకు పైఁగా నుండినవి. అయినను జనులు వానియుపయోగమునుగూర్చి గమనింపక నానాట వానిని బూడిపోవునట్లు చేసిరి. కావున నిప్పుడు వానిపూడిక యెత్తించుటయే కాక, క్రిందనీరుగల తావులలో బావులెత్తించుటకుఁ గావలసినద్రవ్యమును దొరతనము వారు రైతుల కప్పులు Agricultural Loans ఇచ్చుచున్నారు. కాలువలు త్రవ్వించుటకును విశేషముగా ద్రవ్యము వెచ్చింపఁబడుచున్నది. పూర్వకాలములందు అక్బరు వంటి కొందఱు ఢిల్లీచక్రవర్తులే యుత్తరదేశమునందలి కాలువలు త్రవ్వించి మేలు గలుగఁజేసి రని తెలియవచ్చుచున్నది. వారికిఁ బిమ్మట నున్నవారు వానిని గమనింపక పూడిపోవునట్లు వదలివేసిరి. ఇప్పుడు మన దొరతనము

వారు వానినెల్ల బాగుచేయుటయేకాక, క్రొత్తకాలు వలనుగూడఁ ద్రవ్వించుచున్నారు. ఇట్లు క్రొత్తగాఁ ద్రవ్వింపఁబడినకాలువలపేరులును వానినిడివి మొదలగు నవియుఁ గ్రిందఁ జూపఁబడినపట్టికవలనఁ దెలియవచ్చును.

| పేరు. | నిడివి మైళ్లు | నీటిపాఱుదలగల వైశాల్యముకొలఁత. | త్రవ్వినందుకైన ఖర్చులు (రూపాయలు.) |
|---|---|---|---|
| గంగానదికాలువ. | 4935 | 10 లక్షల యెకరములు. | 3 కోట్లు. |
| సర్హిండ్ కాలువ. | 3040 | | $2\frac{1}{4}$ ,, |
| చీనాబుకాలువ. | 2430 | 20 లక్షల యెకరములు. | |
| గోదావరికాలువ. | 2408 | ) | 134 లక్షలు. |
| కృష్ణకాలువ. | 1997 | 24 లక్షల యెకరములు. | 144 ,, |
| కావేరికాలువ. | 2094 | ) | 31 ,, |

కాలువలు త్రవ్వించుటకు 43 కోట్లరూపాయలకంటె హెచ్చుగానే దొరతనమువారికి సెలవైనట్లు తోఁచుచు న్నది. కఱవుకాలములందుఁ బొట్టకూటికై యల్లాడుకూలి వాండ్రచేతఁ గాలువలు త్రవ్వించి (Famine Relief Works) వారికి గంజిపోసి దొరతనమువారు కాపాడుచున్నారు. ఇప్పు డీదేశమునందు 2 కోట్లయెకరములకంటె నెక్కువైన పొలము లిట్టికాలువలనీటిపాఱుదలచేత సాగుబడిచేయఁ బడుచున్నవి.

4. **ఆనకట్టలు**: — కాలువలు త్రవ్వుటకై తఱచుగా నదుల కడ్డముగాఁ గట్టలు కట్టఁబడుచున్నవి. ఆనకట్టలు కట్టుటచేఁ బాఱెడి నీళ్లు నిల్చి పైకిఁ దన్ని కాలువలలోఁ బ్రవేశించి మిట్టభూములకును బాఱుచున్నవి. ఈ మాగాణమునందలి నదులకు ముఖద్వారమునకు సమీపమునను, గంగానదీప్రాంతమందలినదులకు నుత్పత్తియొక్క సమీప ప్రదేశమునను నానకట్టలు కట్టఁబడియున్నవి. వడిగాఁ బాఱెడు లోఁతయిన జీవనదులకు నానకట్టలు కట్టుట సులభసాధ్యము కాదు. అయినను విశేషద్రవ్యము వెచ్చించి యాశ్చర్యకరములైన సాధనముల సాహాయ్యముచేతదొరతనమువారు గంగ, గోదావరి, కృష్ణ మొదలగు నదులకు నానకట్టలు గట్టియున్నారు. ఈ మాగాణములోఁ బడమటిసముద్రమునఁబడు మధురజిల్లాలోనుండు పెరియారు అనునదికి నానకట్ట



"పెరియార్" చెఱువునడిమికట్ట.



పెరియారుచెఱువు, చెఱువుకట్ట.

కట్టి, దాని జలమా జిల్లాలో నుండుభూములకుఁ బాఱింపఁ బడుచున్నది. ఈ యానకట్టలపనితనము చూచుటకు మిక్కిలి వినోదముగా నుండును. మఱియు, దక్కనులో మైసూరురాజ్యమున మారికనమయను నొకయాశ్చర్యకరమయిన చెఱువుకట్ట కట్టఁబడియున్నది. అది 1,185 అడుగులపొడవును, 167 అడుగుల యెత్తును గలది. అది ప్రపంచమునందలిచెఱువుకట్ట లన్నిటికంటె నెత్తయినదై యెక్కువజలము సేకరింపఁదగినదిగా నున్నది.




1. పెద్దకాలువ. 2. పంటకాలువ. 3. రోడ్డు. 4. ఇనుపదారి. 5. సాగుబడి చేయఁబడుచుండు నేలవిస్తీర్ణము. 6. ఇఁక మీఁద సాగుబడికి రాఁదగిన నేలవిస్తీర్ణము. 7. పెరియారునది. 8. రామనాథపురమునకు. 9. తిరుచినాపల్లికి. 10. ఆనకట్ట.

పెరియారుజలయంత్రవ్యవసాయపద్ధతి.



“దివి” యందలి యంత్రశాల.



దివిలోని నీళ్లతోడుమరలు, యంత్రము.




"దివి" నీటిపారుదల పద్ధతి.

ఆనకట్టలేకాక యితరములగు న ములచేతను సహితము మిట్టనేలలకు నీరు పారింపఁబడ ది. కృష్ణా నదీ ముఖద్వారమున "దీవి" యను లం విస్తార

ములయిన భూములు నీటిపాఱుదల లేమిచే బీడుపడియుం డినవి. ఇప్పుడు రాజ్యాంగమువారు గొప్పయంత్రముల బలమువలన నానదిలోని జలమును బైకెక్కించి, యా నేలలకు నీరు పాఱించుచున్నారు. ఈ విధముగాఁ బంట లులేక బీడుపడియుపయోగములేక యుండిన నేలలయం దిట్టి యుపాయములచేఁ బైరుపెట్టఁబడి యుపయోగకరము లైన ధాన్యములు పండుచున్నవి.

5. కట్టడములు.—దొరతనమువారికిఁ గావలసినకట్టడ ములన్నియు నాయిలాకావారిచేతఁ గట్టింపఁబడుచున్నవి. అవి యేవనఁగా. — కళాశాలలు, కచ్చేరీలు, వైద్యశాలలు, న్యాయస్థానములు, చెఱసాలలు, వస్తుప్రదర్శనశాలలు మొదలగునవి. ఇవి గుత్తకాండ్రచేఁ గట్టించినను, ఇంజనీరుల యొక్క పైవిచారణయం దుండుటవలన నీ పనులు బాగు గానే జరుగుచున్నవి.

6. ప్రాఁతకట్టడములను నూతనపఱచుట: — ఈ పని తక్కిన మైదు పనులకును సామాన్యముగా నున్నది. ఈవిషయమై దొరతనమువా రెక్కువ శ్రద్ధ నహించుచు న్నారు. ప్రాఁతకట్టడముల నప్పుడప్పుడు క్రొత్తవానిని జేయుటయే [illegible], పూర్వము హిందూరాజులచేఁ గట్టింపఁ బడిన [illegible]ద్ధములైన రాచనగరులు, గోపురములు,



తాజ్ మహాలు, ఆగ్రా.

కొల్వుకూటములు (Durbar Halls) మొదలగు కట్టడము
లను దొరతనమువారు నూతనపఱచుచుందురు. పూర్వ
కాలపునాగరికతను దెలిపించునట్టి యిట్టి కట్టడములను
మంచిస్థితిలో నుంచవలె నని ప్రోత్సాహపఱచినవారు

కొన్ని యేండ్లక్రిందట హిందూదేశమున రాజప్రతినిధిగా నుండిన కర్జనుప్రభువుగారే (Lord Curzon).



తిరుమలనాయనిగారి మహలు, మధుర.

పూర్వకాలమందలి మనహిందూరాజులొనర్చిన కార్యములను మనప్రకృతపుదొరతనమువారు చేయుకార్యములతో సరిపోల్చి చూచినయెడల, కొన్ని వ్యత్యాసములు స్పష్టముగా నగపడును. పూర్వకాలమునను బలిష్ఠములగు నానకట్టలును, నెత్తయినగోపురములును, తాజ్‌మహాల్, మధురలోనుండు తిరుమలనాయనిగారిభవనము వీనివంటి వింతలైనకట్టడములును, వినోదకరము లైనమంట

**పములును** నిర్మింపఁబడియుండినవి. అయినను, ప్రకృత ముండునట్లుగ దేశమునం దంతటను గట్టడములనిమిత్తమే ప్రత్యేకమైన యేర్పా టొక్కటియుఁ జేయఁబడలేదు. వారా కాలమునందు డబ్బంతయు ముఖ్యపట్టణముల నలంకరించుటకే యుపయోగపఱచినారు. దేశములలోను, పల్లెలలోను, జనులు దమకుఁ గావలసినబాటలను, గుంటలను, కోనేళ్లను తామే నిర్మించుకొనిరి.

ఇపుడు మనదొరతనమువారు పనివారిసామర్థ్యమునకుఁ దగినకూలియు స్వాతంత్ర్యము నొసంగి కట్టడములసొంపు మాత్రమే గమనింపక, వానివలన జనసామాన్యమునకుఁ గలిగెడియుపయోగమును గూడ బాగుగా గమనించి ద్రవ్యమును విశేషముగా వెచ్చించి యన్నితావులందు నుపయోగపడెడి యనేకకట్టడములను గట్టించియున్నారు.



## 12. దొరతనమువారును, మానములును.

---

మానభేదములును, వానియుపయోగమును — నాణెములయేర్పాటు — ఆధారనాణెములు, సంకేతనాణెములు — హిందూదేశపునాణెముల భేదములు—నాణెములుచేయు విధము—నాణెపుచీటీలు (నోట్లు).

**మానము** లన్నియు నొక విధముగ నుండిననే కాని, వ్యాపారములు చక్కఁగా జరుగ వను సంగతి యంద

తాఱుఁగియుండవచ్చును. అంగడియంగడికిని వేలువేలువిధ ములగు గుండ్లును, పళ్లును, కొలఁతకొయ్యలును నుండి నట్లయిన, మోసము హెచ్చుఁగా, వ్యాపారము తగ్గిపోవును. కాఁబట్టియే యొకటేవిధమయిన మానము లేర్పఱచుటయు, వానినే యన్నిచోట్లను వాడుకకుఁ దెచ్చునట్లు చేసి వ్యా పారము మోసము లేకుండ జరిపించుటయు, దొరతనము వారికి విధిగా నున్నది. మానములు సంఖ్యామానము, తులామానము, పాత్రమానము, దైర్ఘ్యమానము, ద్రవ్య మానము అని పలుతెఱఁగులుగా నున్నవి. వర్తకమున కావశ్యకములయిన కొలఁతకొయ్యలను, కొలఁతపాత్ర లను, గుండ్లను రాజ్యాంగమువారు చక్కఁగాఁ బరిశో ధించి, ముద్రలువేసి పిమ్మట వర్తకుల కిచ్చుచున్నారు. 1871-వ సంవత్సరమునందుఁ దూఁచుటకును, గొల్చుట కును సేరు అనునది సంకేతముగా నుంచుకొనవలె నని యేర్పాటుచేసిరి. అది మొదలిసేరు నాధారముగాఁగొని, తూఁచుటకు గుండ్లను, ధాన్యము మొదలగునవి గొల్చుట కొకసేరు నీళ్లు పట్టఁగూడిన పాత్రములను నాధారముగఁ బెట్టుకొని ముంత, మానిక, సోల, అర్ధ, చిట్టి మొదలగు నానావిధములగు మానపాత్రలను జేసి వానిని వాడుకొను చున్నారు. సరికాని మానసాధనముల నుపయోగపఱచు వారు దొరతనమువారిచే దండింపఁబడుదురు.

పైఁజెప్పినకొలఁతసాధనములకంటె ముఖ్యములైనవి నాణెములు. ఇవి లేకుండ నెట్టి వ్యాపారమును నడువదు. వ్యాపార మాలస్యములేక జరుపుటకు, వస్తువులక్రయ మానమగు నాణెములే ముఖ్యములైన సాధనములని చెప్ప వలయు. ఇవి లేనియెడల, నెయ్యి దగ్గఱ నుంచుకొని పుస్త కము కావలెనని కోరువాఁడు పుస్తకము దగ్గఱ నుంచు కొని నెయ్యి కావలెనని కోరువానిని వెదకుకొని పోవలసి వచ్చును. నాణెము లున్నట్లయిన నెయ్యి విక్రయించి డబ్బుచేసికొని, యా డబ్బుతో నాలస్యములేకుండఁ బుస్త కముఁ గొనవచ్చును. కావున, వ్యాపారమును వృద్ధిచేయు టకు నానావిధములైన నాణెము లేర్పఱుపఁబడినవి.

ఇప్పుడు మనము వాడుకొనురూపాయలు మొదలగు నాణెములనే వస్తువులయొక్క మూల్యమానముగాఁ గైకొన వలయు ననునది యావశ్యకమైనది కాదు. ఆదికాలము నందు హిందూదేశమున గవ్వలును, చీనాదేశమునఁ దేయాకుపెట్టెలును, ఇటలీదేశమునందుఁ బశువులును నాణెము లుగా వాడఁబడుచుండినవి. అయినను, నివి శ్రేష్ఠములగు నాణెములని చెప్పఁదగదు. నాణెములే వస్తువులవిలువను గొలుచుటకైన సాధనములుగా నుండుటవలన, నవి పరి మాణమునందును మదింపునందును దగ్గక యుండవల ననుటయేకాక, వేగిరముగా నఱిగిపోక యెప్పటికి వాడు

కొనఁదగినవిగాను, సులభముగా మార్పఁగూడినవిగాను, నందఱు సంతోషముతోఁ దీసికొనుటకుఁ దగినవిగాను నుండవలయును. ఈ కారణమువల్లనే వానిని వెండి, బంగారము, రాగి మొదలగు లోహములతో బిళ్లలుగాఁ జేసి, వాని కొకప్రక్క చక్రవర్తిశిరసుయొక్క రూపమును మఱియొకప్రక్క దానివిలువను గనఁబఱచి సొగసైనయంచు కట్టి, పూజలు పెట్టి, పతకములవలె బహురమ్యముగా నుండునట్లు చేయుచున్నారు. ఇట్లు చేయుట దొంగలు కత్తిరించియేని యఱుగ రాచియేని దొంగిలింపకుండుటకుఁ గూడ ననుకూలమై యున్నది. పూర్వకాలమునందు వాడుచు వచ్చిన సొంపులేని నాణెములతో నిక్కాలమున వాడెడు సొగసైన నాణెములను సరిపోల్చి చూచువారి కిప్పటినాణెము లన్నివిధములను మేలైనవి యని తోఁచక పోదు.

ఏదైన నొక నాణె ముండినఁ జాలదా, నానావిధములగు నాణెములు మనలో నేల వాడుకకుఁ దేవలయును? అని కొందఱనవచ్చును. స్వల్పపదార్థములను గొలుచుటకుఁ జిన్నకొలఁత సాధనములు గావలసినట్లే తక్కువ మొత్తమును గొనుటకుఁ జిన్నవగు నాణెము లనేకము లుండుట యావశ్యకమయియున్నది. ఈ దేశమున నాణెముల మానమునకు నాధారముగా నుండునది 15 రూపాయలమతింపుగల

సవర మొక్కటే. దీని నాధారముగాఁ బెట్టికొని, వెండి, రాగి, తెల్లరాగి (Nickel) అను లోహములతో ననేకము లగు చిల్లర నాణెములు దొరతనమువారు నిర్మించుచు న్నారు. ఆధారనాణెమగు సవరముయొక్క స్వల్పభాగము లను సూచించుటచేత, వీనిని సంకేతనాణెములని చెప్ప వచ్చును. వీనికి దొరతనమువా రేర్పఱచియుండువిలువ కును స్వాభావికముగానుండువిలువకును వ్యత్యాసము గలదు. మన మొక సవరమును సరాబుదగ్గఱ నిచ్చిన యెడల, దానితూనికకు సరియైన తూనికగల బంగారమునే కొనవచ్చును. అయినను, మన మొకరూపాయ నిచ్చిన యెడల దానితూనికకంటె హెచ్చయిన తూనికగల వెండిని మనము కొనవచ్చును. కాఁబట్టి యీ నాణెమునందుఁగల వెండి యొకరూపాయ వెలగలది కాదని మనకుఁ దెలియు చున్నది. రాగినాణెములు నిట్లే. కాఁబట్టి వెండినాణెము లను, రాగినాణెములను జనులు కరఁగించి, భూషణములు గాను పాత్రములుగాను జేయుట వారికి నష్టమును గలిగిం చును. కావున నీనాణెములు గరఁగింపఁబడుటలేదు. అట్లు కాకపోయినచో, ఈ నాణెములుగూడ వ్యాపారమున కుప యోగపడక నగలుగాను, పాత్రములుగాను శీఘ్రముగా మార్చఁబడియే యుండును. ఒక సవరమునకు దాని యెత్తు నకు సరియైన యెత్తుగల బంగారముమాత్రము లభించుట

వలన నెన్ని బంగారు నాణెములను దొరతనమువారు ముద్రించి ప్రచురించినను, నవి యన్నియు సొమ్ములం దెక్కువ మోహముగల జనులు వసించెడి మనదేశములో బహుశీఘ్రముగా మాయమై పోవుచున్నవి. కాఁబట్టి యిప్పుడు సవరములు దొరకుట దుస్తరముగా నున్నది.

ఆంగ్లేయరాజ్యభారమునకు మునుపు పలుపలుదేశములలోఁ బలు తెఱఁగులయిన నాణెములు వాడఁబడుచుండినవి. 1835-వ సంవత్సరమునఁ బ్రాఁతనాణెములకు బదులుగాఁ జెన్నపురియందు వాడఁబడుచుండిన వెండి రూపాయలే తక్కినచోట్ల ముఖ్యనాణెములుగాఁ జేయఁబడినవి. 1873-వ సంవత్సరమునకు వెనుక గనులలో విశేషముగా వెండి దొరకుటవలనను తక్కిన దేశములలో వెండి నాణెములకు బదులుగా బంగారునాణెములే యేర్పడుటవలనను వెండి చౌకయాయెను; రూపాయయొక్క విలువయు రాను రాను తగ్గుచు వచ్చినది. కాఁబట్టి, సీమయందు 8 అణాల కిచ్చెడిపుస్తకమును మన మిచ్చుట 12 అణాలకు తీయవలసి వచ్చెను. దీని నుద్దేశించియే దొరతనమువారును 1893-వ సంవత్సరమున నొక సవరమునకు 15 రూపాయలే వెల యని ప్రకటనచేసి 1899-వ సంవత్సరమునందు సవరములను నా దేశములో నాధారనాణెమునుగా నేర్పాటుచేసిరి. ఈ నాణెము లింగ్లాండు దేశముననే ప్రచురింపఁబడుచున్నవి.

1906-వ సంవత్సరమున రాగియొక్క వెల రానురాను హెచ్చుటవలన రాగి నాణెములకు బదులుగాఁ గంచు నాణెములను జేయవలెననియు, నిక్కెల్ అను తెల్లలోహముతో నణాను గుర్తించుటకు నక్షత్రములవంటి నూతనములైన నాణెములను గ్రొత్తగా నేర్పాటు చేయవలయుననియు నిర్ణయించి యా ప్రకారమే చేసిరి.

సవరములు తప్పఁ దక్కిన నాణెములు బొంబాయి, కలకత్తాలలోఁ గట్టఁబడియుండుటంకశాలలలోఁ జేయఁబడుచున్నవి. 1906-వ సం॥న మాత్రము పైరెండు తావులలో నచ్చువేయఁబడిననాణెము లించుమించుగా 26 కోట్ల రూపాయలుండవచ్చును. లోహములను మొదటఁ గరఁగించి కడ్డీలుగాఁ బోసికొని పిమ్మట వానిని తగళ్లుగాఁ దట్టి, యటుపిమ్మట నా తగళ్లను చిన్న బిళ్లలుగాఁ దెగఁగొట్టి, వానియం దొకప్రక్క సొగసైన యక్షరములను జెక్కి యంచుకట్టి, సరియైన విలువయు, మదింపును, తూనికయుఁ గల నాణెములనుమాత్రమే బయలుపఱచుచున్నారు. బహుకాలమునకుముం దచ్చువేయఁబడి వాడుకలో నుండిననాణెము లఱిగిపోయి యక్షరములు తెలియక, నున్ననైయుండినయెడల, దొరతనమువా రట్టి నాణెములు దమ బొక్కసములకు వచ్చినవెంటనే వానిని గరఁగించుచున్నారు. సరియైన నాణెములే వాడుకలో నుండవలయునని దొర

తనమువారియుద్దేశము గావున నిట్టి పద్ధతు లవలంబింపఁ బడుచున్నవి. వ్యాపారమును నాగరికతయు క్రమక్రమముగా వృద్ధికివచ్చుచుండుటచేతను దొరతనమువారు పలు దెఱఁగు లైననాణెములను మిక్కుటముగా బయలుపఱచుచున్నను నాణెము లొకచోటినుండి మఱొక్కచోటికిఁ గొనిపోవుటయుఁ బంపుటయు శ్రమకరముగాఁ దోఁచినందున 5, 10, 20, 50, 100, 500, 1,000, 10,000 ఈ మొత్తమురూపాయలకు బదులుగా ప్రత్యేక ప్రత్యేకములైన నాణెపుచీట్లను (Currency Notes) అచ్చువేసి ప్రచురించుచున్నారు. వీని నింపుకైనను శ్రమలేకుండ నొకచోటినుండి మఱొకచోటికిఁ బంపవచ్చును. నాణెములవలెను వీనిని వాడుకొనవచ్చును. ఇట్టి నాణెపుఁజీట్లు 1906-వ సం॥న 46 కోట్లరూపాయలకుఁ బైగానే వాడఁబడినవి. హఠాత్తుగా నివి పడిపోయినయెడల, లేక చినిఁగిపోయిన యెడలఁ జక్కఁగా విచారించి దొరతనమువారు వీనిమూల్యమును సొంతదారుని కిప్పించి వీనికిచ్చినసంఖ్యలను దమ లెక్కపుస్తకములలో జమ వ్రాసికొని యన్నిబొక్కసములకు నాసంగతిఁ దెలియఁజేయుదురు. దొరతనమువా రిట్టి నాణెపుఁజీట్లను పరిమితి లేక ప్రచురించుచున్నా రని తలఁచుట గొప్పపొఱపాటు. వారిచే నిట్టిచీట్లెన్ని ప్రచురింపఁ బడుచున్నవో, వానివిలువను వారు బంగారు వెండి

నాణెములరూపముగానైనను, సర్కారప్పుపత్రములరూప ముగానైనను (Government Promissory Notes) గలిగి యుందురు గావున మన కెప్పు డక్కఱ యున్నదో, అప్పుడు వీనివిలువను నాణెపురూపముగా మార్చుకో వచ్చును.



## 13. దొరతనమువారును, జనులభాగ్యాభివృద్ధియు.

దేశముయొక్క పురోవృద్ధికి జనులప్రయత్నమే కారణ మనునది —ఆంగ్లేయులు ప్రభుత్వమునకు వచ్చినపిదప మనదేశమందుఁ గలిగిన వాణిజ్యాభివృద్ధి—ఆంగ్లేయులమూలధనముచే మనకుఁ గలుగుచుండెడు శ్రేయములు — ఈ దేశీయులయుద్యోగములు — అనేక శిల్పశాలలవలన జనులకుఁ గలుగుచుండు జీవనములు—స్వదేశీయులు వాణిజ్యాభివృద్ధికై చేయుచుండు ప్రోత్సాహములు—కూలివారికిఁ బ్రోత్సాహములు గలిగించురీతి — యంత్రములయుపయోగము — మనదేశమునందలి కాఁపుల పేదఱికమునకుఁ గారణములు—పరస్పరద్రవ్యసహాయసంఘములు.

ఒక కుటుంబమునకు సౌఖ్యము, సంపదయుఁ బెంపొంద వలయునేని, యా కుటుంబమునందలి జను లొక్కరొక్క రుద్యోగులుగను, సాహసవంతులుగను, మితవ్యయము చేయువారుగను నుండవలయును. ఈ గుణము లలవడ వలయు నేని వారు పరస్పరము చెలిమియు, తోడ్పాటు ను

గలిగియుండుట యత్యావశ్యకముగ నున్నది. దేశ మనెడి గొప్పకుటుంబమువిషయమునను నిట్లే. కొన్ని దేశములందలి జనుల కీ గుణములు పూర్తిగా నున్నవి. మఱికొన్ని దేశములవారి కీ గుణములు బొత్తిగా లేవు. కొన్ని దేశములవారు చేతిపనులమూలముననే గొప్ప గౌరవమునకుఁ బాత్రులము గాఁగల మని తలఁచి, యొక్కొక్కరు పట్టుదలతోఁ బనిచేయుచున్నారు. ఇట్టి దేశములందలి జనులు మితిమీఱినకల్మితోఁ దులతూఁగుచున్నారు. మఱికొన్ని దేశములందలి జనాంగములు చేతిపనులు నీచము లని తలఁచి, వానిని కొన్ని జాతుల కేర్పఱచి, వారే యవి చేయవలసినదని విధించియున్నారు. ఇట్టి జనాంగములు గల దేశములు క్షీణదశయందే యున్నవి. కాఁబట్టి, ప్రభుత్వమువా రెంత దయాళువులుగా నున్నను, ప్రజలయందుఁ బైఁజెప్పిన సుగుణము లున్నను, నట్టిదేశములభాగ్యము హెచ్చనేఱదు. జనుల యుత్సాహమే యీ పురోవృద్ధికి ముఖ్యకారణము. బాటలు వేయించుట, వ్యాపారము జరిపించుట, చదువు చెప్పించుట మొదలగు విషయములందు సాధ్యమైనంతమట్టునకు సౌకర్యములఁ గలిగించుట మూలమున దొరతనమువా రీశిల్పములందుఁ బట్టుదలగల వారికి సాహాయ్యము చేయవచ్చును గాని, యంతకంటె వా రేమి చేయఁగలరు?

ఇప్పుడిప్పుడు, ఆంగ్లేయులు పరిపాలనమునకు వచ్చిన పిదప **వర్తకము, శిల్పములు** మొదలగువిషయములందు మనము చాలమట్టునకు ముందుకు వచ్చితిమి. మనదేశమునకు ఎగుమతిదిగుమతులు నానాటికి హెచ్చుచున్నవి. సముద్రమార్గమునఁ బరదేశములతో మనదేశమునకు నడచినవాణిజ్యము 1857-వ సంవత్సరమున 400 లక్షలపౌనులుండినవి. 1907-వ సంవత్సరమున నది 2,020 లక్షలపౌనులకు హెచ్చినది. నేపాలము, తిబెతు, ఆఫ్ఘనిస్థానము మొదలగుపైదేశములతో మెట్టమార్గమున నడచువ్యాపారము సాలుకు వేయిలక్షలపౌను లుండవచ్చును. 1861-వ సంవత్సరమున నెగుమతిచేయఁబడ్డవ్యాపారసరకులవిలువ 55 కోట్లరూపాయ లుండెను. 1907-వ సంవత్సరమున నది 183 కోట్లకు హెచ్చెను. 1861-వ సం॥మునఁ బరదేశమునుండి దిగుమతి యైన సరకుల విలువ 46½ కోట్లరూపాయ లుండెను. 1907-వ సం॥మున 179 కోట్లరూపాయలకు హెచ్చినది.

ఈదేశస్థులకుఁ బెక్కండ్లవఱకుఁ గావలసినంత పెట్టుబడియు, నేర్పాటులును లేకుండుటయే యీదేశముయొక్క క్షీణదశకుఁ గారణముగా నుండినది. అట్లుండినను, నాంగ్లేయులధార్మికమైన ప్రభుత్వ మీదేశమున నెలకొని జనులకు సంపూర్ణమైన నమ్మికను గలిగించినపిదప, యింగ్లాండు మొద

లగు నెక్కుడుభాగ్యవంతములగు దేశము లన్నియు మన దేశమునందలి వాణిజ్యశిల్పములకై విస్తారద్రవ్యమును వినియోగించుచున్నవి. మనదేశమున నుండియె యింత వఱకు మనకంటికి గోచరముగాక యుండిన కోలారు బంగారుగనులందు మఱుఁగియుండిన బంగారమును ద్రవ్వి యెత్తుటకును, మనదేశమున ననేకభాగములం దడఁగి యుండు నేలబొగ్గు, ఇనుము, అభ్రకము మొదలగునత్యా వశ్యములగుపదార్థములను గనిపెట్టి, వానియమూల్యము లయిన యుపయోగములను మనదేశమువా రనుభవించు నట్లు చేయుటకును, నత్యంతరోగభూయిష్ఠములైన కొండ వీటిసీమలను, దుర్గమారణ్యములను ఫలవంతములుగా నొనర్చి యీ దేశపుఁగల్మి హెచ్చించుటకును, పొగబండ్లు, ట్రాముబండ్లు మొదలగు నత్యాశ్చర్యకరము లగు సాధన ములను నిర్మించి, వీనిమూలమున మనదేశస్థుల కనేకు లకు జీవనోపాధులను గల్పించి, వీనిమూలమున మనదేశ స్థులు పూర్వము కఱవుకాలములం దనుభవించుచుండిన తొందరలను దొలఁగించుటకును పరదేశీయులమూలధ నమే ప్రధానకారణమైయున్నది గదా. ఇప్పుడు నితరదేశీ యులగు ధనికులు మనకుఁ జూపించిన నిదర్శనము లన్నియు మనదేశవాసులకుఁ జాలమట్టునకుఁ బ్రోత్సాహకములుగా నుండియున్నవి. ఇప్పుడిప్పుడు మనదేశమువారికిఁ బైస

చెప్పినచేతిపనులు, మితవ్యయము, నోద్దికమొదలగువాని ప్రయోజనము బాగుగాఁ దెలియవచ్చినది. ఈ యుత్సాహము గలిగినపిమ్మటనే యిచ్చట బొంబాయియందలి భాగ్యవంతు లనేకులు పార్శీలు తమయాస్తి యంతయు నిర్భయముగా వెచ్చించి, యనేకయంత్రశాలలను, శిల్పశాలలను నేర్పఱచియున్నారు. ఈ దేశవాసులకుఁ జాలమట్టునకు వ్యవసాయమొక్కటియే జీవనాధారముగా నున్నందున, వాన యనునది యొక్కటి లేక పోయినచో ననేకకుటుంబములు పొట్టకూటికి లేక యల్లాడి చావవలసినస్థితియం దుండినవి. ఇంతవఱకును పైనిచెప్పినయనేక సదుపాయములను మనకుఁ గలిగించుట యీ దేశమునందలి జనులపురోవృద్ధికి హేతువై యున్నది. మనదేశమున నిట్టి యుద్యోగములు నాలుగుతెగలయి యున్నవి.

1. కేవలకృషిరూప మైన గ్రామవాసులవృత్తులు.

2. నేఁతరూప మైనపట్టణవాసులవృత్తులు.

3. అడవులందు దొరకెడి పదార్థములను సేకరించెడి యడవియిలాకాజనులవృత్తులు.

4. గనులకు సంబంధపడినవృత్తులు.

వీనిలో మనదేశమందలి పెక్కుజనులు కృషియే ముఖ్యజీవనాధారముగాఁ బెట్టుకొనియున్నను, వేర్వేఱు చేతిపనులు చేసి జీవించెడివారిసంఖ్యయు నానాటికి హెచ్చు

చునే యున్నది. వీని కన్నిటికిని బరదేశీయులే మూలధన మును బెట్టి నడుపుచున్నారు. దీనివలన మనదేశమువారి కనేకులకు జీవన మేర్పడియున్నది. ఈపనులందుఁ గలిగెడి నష్టముల కన్ననో వారే పాత్రు లగుచున్నారు. జనసంచారమునకుఁ గూడ యోగ్యముగాకయు, చొఱ నలవిగాకయు నున్న కొండలపైభాగములందు కాఫీ, తేయాకు, చింకోనాయనుజ్వరపట్ట మొదలగువానిని పండించి వాని మూలమున సంవత్సర మొక్కటికి 8 లక్షలరూపాయ లాదాయము చూపించుచున్నారు. ఇవ్విధముగా మన దేశమున స్థాపింపఁబడియుండుయంత్రములసంఖ్య యీ క్రిందఁ జూపఁబడిన పట్టీవలనఁ దెలియవచ్చును.

| యంత్రశాలల పేర్లు. | వాని సంఖ్యయు. | మరల పేరులు. | వాని సంఖ్యయు. |
|---|---|---|---|
| దూదియంత్రశాలలు. | 200 | బియ్యపుమరలు. | 70 |
| ఇనుపపనియంత్రశాలలు. | 76 | పిండిమరలు. | 54 |
| గోనెలునేయు యంత్రశాలలు. | 40 | కోఁతగోయుమరలు. | 90 |
| కాగితములఁచేయు యంత్రశాలలు. | 9 | చమురుతీయు మరలు. | 56 |
| తోళ్లు పదునుచేయు యంత్రశాలలు. | 65 | ముద్రాయంత్రములు. | 108 |

వీనిమూలమునఁ బలువురు జనులు జీవించుచున్నారు. ఇవిగాక నేఁత, దంతపుఁబని, వడ్లపని, వెండిబంగారునగలు చేయుపని, గాజుతోను మంటితోను పాత్రలు చేయుట, యీ మొదలగు చిన్న చిన్న చేతిపనులవలన ననేకులు జీవించుచున్నారు. బొంబాయి, అహమ్మదాబాదు ప్రాంతములలో సగముమంది జనులు దూదియంత్రశాలలవలననే జీవించుచున్నారు. రంగూను నందు పదింట నొకపాలు జనులు వడ్లదంపుడుమరలలోఁ జేరి జీవనము చేయుచున్నారు. హజారా ప్రాంత్యములం దుండుగోనెలు నేయు యంత్రశాలలును కాన్పూరునందలి తోళ్లుపదునుచేయు యంత్రశాలలును నచ్చట నుండువారి కనేకులకు జీవనాధారములుగా నున్నవి.

ఇవ్విధముగా మనదేశమందలి లక్షోపలక్షులజనులకు జీవనాధారము లగు పైఁజెప్పినమంచియేర్పాట్లును, వాని వలన జీవించెడు ప్రజలసంఖ్యయు నీక్రిందఁ జూపింపఁబడి యున్నవి.

వర్తక మనునది చేతిపనులకుఁ బోషించుతల్లివంటిది. అన్యదేశములతోడివ్యాపారము జరుగుచుండిననే కాని, శిల్పము లెన్నటికిని వృద్ధి నొంద నేరవు. ఇప్పు డాంగ్లేయప్రభుత్వమువలనఁ బ్రజలలో నెమ్మది గలుగుటచేతను, మనయొక్క ప్రభుత్వమువారిమూలమున మనకు దేశాం

| జీవనోపాయమార్గములు. | జీవించు జనుల సంఖ్య. |
| --- | --- |
| ఇనుపదారులు ... ... ... | 5,03,993 |
| తేయాకుతోఁటలు ... ... ... | 8,74,975 |
| కాపీతోఁటలు ... ... | 1,06,154 |
| చింకోనాయను జ్వరపట్టవ్యవసాయము చేయువారు | 1,007 |
| నూలువడకుయంత్రములు ... ... | 1,12,14,000 |
| గనులు, రత్నములు ... ... ... | 37,11,000 |
| తోళ్లు పదునుచేయుయంత్రశాలలు ... | 32,42,000 |
| నీలితోఁట్లు ... ... ... | 15 783 |
| తపాలాకచ్చేరీలు ... ... | 1,33,933 |

తరప్రభువులబారి తప్పిపోవుటచేతను, ఇనుపదారులు సముద్రయానము మొదలగు సౌకర్యములు గలిగియుండుటచేతను, రేవుపట్టణములను భద్రపఱచి యచ్చట నేర్పఱచియుండుసులభమార్గములచేతను, కాలక్రమమున నెగుమతిదిగుమతిపన్నులు తగ్గుచు వచ్చుచుండుటచేతను నాంగ్లేయులమేటిపద్ధతులనే యీ దేశమం దవలంబించి మనవారు పురోవృద్ధికి వచ్చుచుండుటచేతను మనదేశవ్యాపారములు గూడ దినదినాభివృద్ధిఁ గాంచుచున్నవి.

కలకత్తా, బొంబాయి, రంగూను, మదరాసు, కరాచీ యనునవి యీ దేశమునందలి రేవుపట్టణములలోఁ బ్రధా



వ్యాపారపు నావ.

నములు. దొరతనమువారు వాణిజ్యాభివృద్ధికిఁ గుంద కము లైన పన్నులను తగ్గించుటయే కాక, వీనిపైవిచార ణకై 1905-వ సంవత్సరమున వాణిజ్యశిల్పములయిలాకా (Department of Commerce and Industry) అను ఇలా కాను ప్రత్యేకముగా నేర్పఱచిరి. పరస్పరసంబంధము గల వాణిజ్యశిల్పములు రెండును నొక యిలాకాగానే యేర్పడి యుండుటచేత నిది వాణిజ్యాభివృద్ధికి మిక్కిలి సహాయ పడునదిగా నున్నది. ఇంతియకాక, పైనిచెప్పిన రేవుపట్ట ణములందును, కొచ్చి, కాకినాడ, కానప్పారు, కత్తియవారు

మొదలగువ్యాపారబాహుళ్యము గల స్థలములందును వాణిజ్యకూటము (Chamber of Commerce) లేర్పఱచి, వర్తకులకుఁ బ్రోత్సాహము గలిగించుచున్నారు. మఱియు వారు శాసననిర్మాణసభలందును, రేవులపరిపాలనసభలందును (Port Trust) వర్తకులలో గొప్పవారిని సభ్యులనుగా నియమించుచున్నారు.

తఱచుగా మన దేశపుఁబ్రాయమువారికి సర్కారునౌకరీలయందే యభిమానము విశేషముగా నున్నది. ఆ నౌకరీలే యందఱకుఁ గావలయు ననిన నెట్లు దొరకును? దొరతనమువారు తమకుఁ గావలసినంతమందికి మాత్రమె తమ కచ్చేరీలలో నుద్యోగము లిప్పించి, తగుజీతముల నిచ్చుచున్నారు. ఈదేశమందలిదొరతనపునౌకరీలలో నుండెడి యుద్యోగస్థులసంఖ్య రమారమి 1,40,000 కంటె మించి యుండదు. తమ పనులను జరుపుకొనుటకై కొందఱికి మాత్రమేవో కొన్ని యుద్యోగముల నిప్పించుటకంటె, జనులకందఱికి నెక్కువగాఁ బను లిచ్చునట్టివి దేశాభివృద్ధికిఁ బ్రధాన హేతువులునయిన పైనిచెప్పిన చేతిపనులయభివృద్ధికిని, వాణిజ్యాభివృద్ధికిని గావలసినన్ని సౌకర్యములను గల్పించి, వానిని హెచ్చించుటయె యుత్తమరాజ్యాంగమునకు లక్షణము. పాటునకుఁ గావలసినయుత్తమవస్తువు లనేకములు మనదేశమునందు బహుకాలమునుండి నిండియు

న్నను, మనదేశస్థులకు వానిని గ్రహించుశక్తి లేకుండెను. ఇప్పుడాంగ్లేయులప్రభుత్వమునలన ననేకములైన యాటంకములు దొలఁగుటయే కాక, నానావిధసాకర్యములును గల్గింపఁబడినవి. శిల్పశాలలనిమిత్తము, శిల్పశాలలచట్టములు (Factory Acts) అను కొన్నిచట్టముల నేర్పఱచి, శిల్పశాలలవా రాచట్టముల నవలంబించునట్లు చేయుటకును, అప్పుడప్పుడు శిల్పశాలలను బరీక్షించుటకును విచారణాధికారిని నియమించుటయేకాక, శిల్పశాలలలోఁ బనిసేసెడుస్త్రీపురుషుల కారోగ్యభంగము గాకుండునట్లు చూడఁబడుచున్నది. మనదేశమందలి కొందఱు జనులు మలయద్వీపము (Malay Archipelago) మున్నగు దీవులకుఁ బోయి, యచ్చటివరిపొలములందును, చెఱకుమున్నగు తోఁటలయందును గూలిపనులు చేసికొని జీవించుచున్నారు. ఈకూలీలయారోగ్యసంరక్షణమునకై యచ్చట భృత్యరక్షణసంఘము (Protector of Labours) ఒకటి యేర్పడియున్నది. ఆసంఘమువారు, యజమానులు భృత్యులు దగునట్లు నడచుకొనఁ జూచుచుందురు. వారికిఁ గలుగు వివాదములను దీర్తురు. మఱియుఁ దొమ్మిదేండ్లకు లోఁబడినబాలురను పనులలో నుంచుకొనరా దనియు, నావయస్సునకు మించినవారయినను దిన మొక్కటికి నేడు గంటలకంటె నెక్కువకాలము పని చేయరా దనియు, ఆది

వారమునాఁడు పనిచేయరా దనియు వారు కొన్ని కట్టు పాట్లు చేసియున్నారు.

ఆంగ్లేయదొరతనమువారు మనదేశమందలి చేతిపనులలోఁ గాని వ్యాపారమునఁ గాని ప్రవేశము గల్పించుకొనక మనదేశపురోవృద్ధికిఁ గారణభూతులుగా నున్నను, మనదేశస్థు లది తెలియక, తమదేశమందలిచేతిపనులచే జీవించుకొన్నిజాతులవారియొక్క యనివార్యదారిద్ర్యము పరదేశీయులపోటుకు నిలువఁజాలక పోయె నని తలంపక, యాంగ్లేయులు వచ్చినపిమ్మట తమదేశపుఁ జేతిపనులు పాడైపోయిన వని యా తప్పిద మాంగ్లేయప్రభువులపై మోపుచున్నారు. ముఖ్యముగా మాంచెష్టరునందు యంత్రసాహాయ్యముచే నేయఁబడువస్త్రములవలన మనదేశపు వస్త్రములనేత పడిపోయిన దను మాట వాస్తవమే. దీనికి మనదొరతనమువారు బాధ్యులు గారు. ఆంగ్లేయులయుత్సాహమును యంత్రనిర్మాణచాతురియు నిట్లు మనదేశపుఁజేతిపనులను క్షీణదశకుఁ దెచ్చినవి. వారు నూతనసులభపద్ధతులను గనిపెట్టినతర్వాత, పురాతనకష్టతరపద్ధతుల నవలంబించియుండు మనశిల్పముల నణఁగఁద్రొక్కి రనుటలో నేమాత్రము వింత లేదు. ఇప్పుడు నాగరికతయందు వాసికెక్కియున్న యింగ్లాండుదేశమునందు సైతము క్రొత్తగా యంత్రములు గనిపెట్టఁబడినప్పుడు, పను

లను యంత్రములతోఁ గాక చేతులతోఁ జేయువా రందఱు నీ యంత్రములవలనఁ దమజీవనమునకు హాని సంభవించు నని దిగులుపడి యందఱొక్కటై, యంత్రములను విఱుగఁ గొట్టి ముక్కలు ముక్కలు చేయఁదొడఁగిరి. కొన్నియేండ్లకుఁ బిదపఁ దాము గూడ నా యంత్రములను వాడి, తమ దేశమును సంపద, గౌరవము, ధనమునుగలదానిని గాఁ జేయఁగల మని యారంభదశలో వారు తలంపరైరి. ఇవ్విధముగనే మనదేశస్థులును దమపురోవృద్ధికిఁ గారణము లగు నీయంత్రములను హానికరములని భ్రాంతిపడుచున్నారు. ఈ క్రొత్త కొలములు మొదటమొదట హానికరములుగాఁ దోఁచినను, కాలక్రమమున బహుప్రయోజనములఁ జూపింపఁగలవు. ఇప్పుడును యంత్రసాహాయ్యముచేఁ జేయుటకు వీలుకాని శిల్పములందు మనదేశపుశిల్పులు ప్రసిద్ధిఁ జెందియున్నారు. ఇండియా దేశపుశిల్పులు రత్నకంబళ్లు, జమఖానాలు మున్నగునవి నేయఁగలరు; కొయ్యలందు బొమ్మలు చెక్కఁగలరు; ఉబుకెత్తి చిత్తరువులు వ్రాయఁగలరు; జరీపని చేయఁగలరు; బుటేదారిపని చేయఁగలరు. బంగారు వెండినగలు చేయఁగలరు; పూసలు మొదలగువానితో డబ్బీలుచేసి వానిపై వెండిబంగారుపనితనము చూపఁగలరు. ఇట్టి యనేకములగుయంత్రసాధ్యములు గాని పనులందు మనదేశపుశిల్పు

లన్యదేశస్థులను మించియున్నారు. యంత్రసాహాయ్యమున నీపనులలో నొక్కటియైనను జేయ వీలుగాదు. కాఁబట్టి మనదేశమునందలి యంత్రసాధ్యము లైనపనులు బొత్తుగా నడుగంటకమునుపే వానికై చింత నొందక, మనదేశపుశిల్పులును, మహాజనులును తమబుద్ధిచాతుర్యము నుపయోగపఱచి, లాభకరము లైనస్వదేశశిల్పములను, నన్యదేశశిల్పములను వృద్ధినొందింపవలయునను నుత్సాహమును, తెంపును గనఁబఱపవలసియున్నది.

ఈ యాంగ్లేయులపరిపాలనమున మనశిల్పములును వ్యాపారమును నానాటికి హెచ్చుచున్నను, మనదేశీయులీక నొక శతాబ్దమువఱకు దారిద్ర్యదశనుండి తొలఁగి యెక్కువ కలిమిగలవారు గానేర రని చెప్పవచ్చును. మొత్తముమీఁద నీ దేశపుఁ గలిమి హెచ్చినది కాని, కొందఱు మాత్రము మునుపటికంటె మిక్కిలి హీనదశయం దున్నారు. దానికి దొరతనమువా రేమియుఁ దిరుగుపాటు చేయలేరు. వ్యవసాయయోగ్యమయిన నేలయే యీదేశస్థులసర్వసాధారణమైన భాగ్యమునకు ప్రధానహేతువుగా నున్నది. పల్లె లనునవి యెల్ల సాగుబడిభూములే. ఇట్లున్నను, ఇచ్చటి దారిద్ర్యమనునది గ్రామవాసులందే వాసముచేయుచున్నది. క్రమక్రమముగా హెచ్చుచుండెడిజనవృద్ధియు, అజ్ఞానమును, పూర్వా

చారములు విడువకుండుటయు, మితవ్యయముచేయమియు, లాభోద్దేశముతో నితరప్రాంతములకుఁబోవఁ బనివా రపే క్షపడకుండుటయు, కార్యనిర్వాహకశక్తిలేకుండుటయు, పరస్పరవిశ్వాసాభావమును, లాభకరములును జనసామా న్యమున కుపయుక్తములు నైన కార్యములకుఁ బూనుటకుఁ దగిన మూలధనములేమియు దీనికిఁ గారణములు.

పైకారణములంబట్టి మనదేశపుసాహుకారు లందఱు దమధనమును వెచ్చించి, సర్వజనోపయుక్తము లగు శిల్ప శాలలు మున్నగునవి స్థాపించుటకు ధైర్యము చాలక, యా ధనమును వడ్డి కిచ్చి వృద్ధిపఱుప నారంభించిరి. దీనిం బట్టి సాహుకారులు నానాటికి భాగ్యవంతు లగుచున్నారు. పేదకాఁపులు నానాటికిఁ బేద లగుచున్నారు. ఈ దేశము నందలిసాహుకారులు కొంచెము డబ్బు గల చిన్నపెట్టె యొక్కటి దీసికొని, పల్లెలకుఁ బోయి, దినమంతయుఁ దమ చిన్నదుకాణములలోఁ గూర్చుండి, తమదుకాణమునకు వచ్చు వాడుకయాసాములకై కాచుకొనియుందురు. సాయంకాల మగునంతలోపలఁ దాము దెచ్చిన చిల్లర డబ్బును పంచిపెట్టి యింటికిఁ బోవుదురు. అయినను, వా రాడబ్బును ద్వరలోనే యొకటికి నాలుగింతలుగ రాఁబట్టు కొందురు. సాహుకారు లిట్లు ప్రతిదినము చేయుచు, శీఘ్రకాలములోపలనే లక్షాధికారు లగుదురు. ఇట్లు

సాహుకారులు నానాటికి వృద్ధిచెంది లక్షాధికారులగు టకుఁ గష్టజీవనము చేయుబీదరైతులయొక్క మౌఢ్యమును, ఐకమత్యము లేకుండుటయు, ముం దాలోచన లేమియుఁ గారణములు. కుప్ప నురిపిడి యైకాక ధాన్యము కళ్లమున నుండునప్పుడే, కాఁపులు తమమనోవర్తికై యొక సంవత్సర మంతయుఁ బెట్టుకొనఁదగినధాన్యమును ధాన్య వ్యాపారులకుఁ దమయప్పులనిమిత్తమై యొప్పిదముచేసి కొన్నప్రకారము మిక్కిలి తక్కువధరలకుఁ గొల్చివేయు దురు. దీనికి దొరతనమువారు జవాబుదారు లగుదురా!

ఇచ్చట బీదకాఁపులడబ్బవసరమును గనిపెట్టి, సాహుకారులు వారికిఁ గావలసినది యిచ్చి హెచ్చువడ్డి యను బరువును వారిపై మోపుచున్నారు. ప్రకృతము మన దొరతనమువా రీపేదరైతులనెత్తినుండి యీ భారమును దింపఁగోరి యున్నారు. కాఁపులు తమయందఱియొక్క జవాబుదారీమీఁదను నాణెముమీఁదను తమయాస్తుల నీడుగా నుంచి తక్కువవడ్డీలకు నప్పు తీసికొనుటకుఁగాను సర్కారువారు పరస్పరవ్యవసహాయసంఘచట్టము అను చట్టమును 1904-వ సంవత్సరమున నేర్పఱచిరి. ఈ చట్టముప్రకారము గ్రామసంఘములు అనియు, నగరసంఘములు అనియు, నిరుతెగలైన సంఘము లేర్పఱపఁబడినవి. ఈ రెంటిలో గ్రామసంఘములలో నష్టము వచ్చె నేని,

యీ సంఘములోఁ జేరినసభ్యులందఱియాస్తి యంతయు నీడుగాఁ గైకొనఁబడునట్లును, నగరసంఘములలో నా యీ సంఘములయొక్క మూలధనముమాత్రమే యీడుగాఁ గైకొనఁబడునట్లును నిబంధన యేర్పఱుపఁబడినది. ఈ సంఘములు పేదలనిమిత్తమే స్థాపింపఁబడినవి గనుక, ఈ సంఘములకు సంబంధించినపనులకై స్టాంపుకట్నము చెల్లింపవలసినది లేదనియు దొరతనమువా రేర్పాటు చేసిరి.

జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు మొదలగుదేశములందు స్థాపితములైన సహాయసంఘములు వర్తకసరకులను బండించుటకును, సభ్యులకు నా సరకులను చౌకయైనధరలకు విక్రయించి వానిని సరపరాచేయుటకును నియమింపఁబడినను, జనుల కందఱకుఁ జెప్పనలవికానియుపకారములఁ జేసినవి. 1904-వ సంవత్సరమునఁ జేయఁబడిన యీశాసనముచేత మనదేశమునఁగూడ నట్టి ప్రయోజనములు గలవని సర్కారువారును జనులును గట్టి నమ్మిక గలవారై యున్నారు. ఈచట్టప్రకారము పనులు జరుపుటకును, చక్కగా విచారించి యీ సహాయసంఘములను దాఖలు చేసికొనుటకును, అట్టి సహాయసంఘముల నప్పుడప్పుడు తనిఖీచేయుటకును ఒక రిజిస్ట్రారు (Registrar of Co-operative Societies) నియమింపఁబడియున్నాఁడు. ఈ శాసనము క్రొత్తగా నములులోనికిఁ దేఁబడినది గనుక, నీరిజి

స్ట్రారులు సంఘములస్థితిఁగూర్చి యొక్కదానితో నొక్కటి సరిపోల్చి చూచుకొనుటకును, దేశమందంతటను నన్ని సంఘము లొకటేవిధమయిన పద్ధతికి వచ్చునట్లు చేయుటకును సంవత్సరమున కొకతూరి గొప్పగొప్పనగరములలో సభ గూడుదురు.

వ్యవసాయసంబంధములగు కొఱఁతలను దీర్చుట కైన యీ సంఘములశాసన మేర్పడి యిప్పటి కయిదు సంవత్సరములే యయినను, ఇంతవఱ కేర్పఱుపఁబడిన సంఘముల యభివృద్ధి చూడఁగా బహుతృప్తికరముగా నున్నది. మనమాగాణమున మాత్ర మిప్పుడు 270 సంఘము లున్నవి. వానిలో 24 నగరసహాయసంఘములు, 3 ఇతర సంఘములకు నుపకారకము లగుమధ్యస్థసంఘములు. తక్కినవి గ్రామనిధులు. ఈ సంఘములన్నియుఁ జేరి సుమారు 50,000 రూపాయలు ఆపద్ధనము గలిగియున్నవి. మనదేశమునందలి యితరమాగాణములందును నీ సంఘములయభివృద్ధి బాగుగానే యున్నట్లు కనఁబడుచున్నది. మనదేశమున నిప్పఁడు రమారమి 2,000 సంఘములున్నవి. వానిలో 2,00,000 మంది సభ్యు లున్నారు. వీని యన్నిటిలోను గలిసి 80 లక్షల రూపాయల మూలధన మున్నది.

ఈ గ్రామనిధులు మున్నగువానివలన జనులకు రెండు తెగలైన ఫలము గలదు. వానిలో నొక్కటి కాఁపులకు

స్వల్పవడ్డికి పైకము దొరకుట. మఱియొక్కటి బీదకాఁపులు తమసంపాదనమున సాధ్య మగునంతవఱకు మిగిలించి చేర్చి పెట్టుట. రైతు లీ సంఘములందుఁ జేరినయెడల, వారిసంఘ కార్యములకు జబాబుదారు లగుదురు గనుక, వారిసంఘ ములం దేకమైన నమ్మకము నుంచుదురు. ఎప్పు డీ నమ్మ కము హెచ్చునో, యప్పుడు వారికి సులభవడ్డికి పైకము దొరకఁగలదు. సంఘములందుఁ జేయఁబడుమితవ్యయ ములవలన వెనుకటి కని దాఁచిపెట్టుధనము హెచ్చును. అది హెచ్చిన, సభ్యుల కింకను సంఘములందు నమ్మకము హెచ్చును. కొన్ని పరస్పరసహాయసంఘము లా సంఘ సభ్యులకు సామగ్రులను విక్రయించుటకై యచ్చటచ్చట స్థాపింపఁబడియున్నవి. అట్టివి కొన్ని మాత్రమే యున్నవి.

జనులు తమయాదాయమున దాపటికము చేయుస్వల్ప మొత్తములను దీసిపెట్టుకొని, వా రడిగినప్పుడిచ్చుటకై యేర్పడియుండు క్షేమనిధి (Savings Bank) యు, దొర తనమువారి నౌకరులలో నుండువారు ప్రతినెలలోను తమ జీతమునఁ బదునాఱవపాలునకంటెఁ దగ్గకయు, ఎనిమిదవ పాలునకంటె హెచ్చకయు నొసంగెడు పైకమును జేర్చి పెట్టి, యంత్యదశలో నుపయోగపడున ట్లొసఁగుటకై యేర్పడియుండు ప్రావిడెంటుఫండు (Provident Fund) లును దొరతనమువారు జనులక్షేమాభివృద్ధికై చేపట్టి

యుండు సత్ప్రయత్నమును తెలుపుచున్నవి. యూరోపు ఖండమునందలియన్ని దేశములలోని భాగ్యాభివృద్ధికి జనులయొక్క పట్టుదల, దీర్ఘాలోచన, ధైర్యము, కట్టుపాటు, ప్రేమ మొదలగుసద్గుణములే కారణములుగా నున్నవి. మనతొల్లింటిపెద్దలయెడలను బైనిఁజెప్పినసద్గుణము లుండిన వనిచెప్పుట కేమియు సందియము లేదు. రాజులు జనసామాన్యోపయోగమునకై యొక్కపనియుఁ జేయకున్నను, గ్రామవాసు లొక్కటిగాఁ గూడి, నీటిపాటుదలకును, స్నానపానాదులకును, గుంటలు కాలువలు, చెరువుకట్టలు మొదలగులెక్కలేని సాధనములను దమకుఁదామే యమర్చుకొని రని తెలియవచ్చుచున్నది. కాఁబట్టి వ్యవసాయము, వర్తకము మొదలగువానిలో జను లెంతెంత యధికముగా పాటుపడుదురో యంతంత వేగిరముగా, వారివేదఱిక మడుగంటు నని చెప్పవచ్చును.

ప్రజలక్షేమచింత గల దొరతనమువారు మనదేశమునందలి సమర్థులైన యనేకతరుణులకు విద్యార్థివేతనము లొసఁగి, వారిని ఇంగ్లాందు మొదలగుపరదేశములకుఁ బంపి, విద్యాభ్యాసము చేయించుచున్నారు. మఱియు వారీదేశముయొక్క చేతిపనులను, వ్యవసాయపద్ధతులను బరిశీలించి, తద్వృద్ధికరము లగు సలహాల నిచ్చుటకై

సమర్థు లగు నధికారులను నియమించుటయే కాక, యిచ్చ టిశిల్పుల కనేకయిలాకాలలో నుద్యోగము లిప్పించుచు న్నారు. మనదేశాభివృద్ధిప్రదములగు శిల్ప, మితవ్యయ, వాణిజ్యములయభివృద్ధివిషయమున దొరతనమువా రుదాసీనులై యుండక తమచేత నైన తోడ్పాటు చేయుచు న్నారనుట స్పష్టమయి యున్నది. బరు వంతయు వారే మోయవలయు ననుట వీలు కాదు. వారివలన మన మిన్ని సౌకర్యముల నొందియున్నాము గనుక, వాని నూఁతగాఁ గొని, మనము మనయభివృద్ధికై. మనసులందుఁ జక్కఁగ యోచించి, సోమరులమై యుండక, మనచేతు లారఁ బనిచేయుటయే మనక్షేమమునకును దేశక్షేమము నకును గారణమయి యుండఁగలదనుట దృఢమైన సంగతి గా నున్నది.



## 14. ప్రభుత్వమువారికి మనవలని ద్రవ్యసాహాయ్యము.

పన్ను లేల విధింపవలెను?—పన్నులు వసూలు చేయుపద్ధతులు—రాజ్యపరిపాలనక్రమము ప్రభుత్వవృద్ధికిఁ గారణ మగు ననుటఁగూర్చి.

రాజ్యాంగమువారు మనకుఁ జేసెడి మేలులను గూర్చి యింతవరకు ముచ్చటించితిమి. రాజ్యాంగమువా రపార మైన మేలులఁ జేయఁగూడు నని సర్వజను లెఱిఁగినవిషయము. జనసంరక్షణము ప్రభుత్వమువారి కెట్లు విధియో, అట్లే ప్రభుత్వమువారిసాహాయ్యముఁ బొందుజనులు తమ యాదాయములకుఁ దగినట్లు ప్రభుత్వమువారికి ద్రవ్యసాహాయ్యము చేయుటయు ముఖ్యవిధి యగును. ఇష్ట మున్నను, లేకపోయినను, ప్రతిమనుజుఁడు నీయుత్తరువున కొప్పుకొని తీరవలయును. ఇవ్విధమునఁ జేసెడిద్రవ్యసాహాయ్యమునకే పన్ను అని పేరు. పన్నులు చెల్లించుట విధి యని తెలిసియున్నను, అవి చెల్లింపవలసివచ్చినప్పుడు కొందఱికి మిక్కిలి విచారము గలుగుచున్నది. ఇట్లు విచారపడువారు, రోడ్డు లన్నియు బాగుగ నేర్పాటు చేయవలె ననియు, నీటివసతియు రాత్రులందు మంచి

వెలుతురును బూర్ణముగా నుండవలె ననియు, బాలురకును బాలికలకును జీతములు పుచ్చుకొనక ధర్మార్థముగాఁ జదువు నేర్పుటకుఁ దగుసౌకర్యము లేర్పడవలె ననియు, నౌకరులకు జీతములు హెచ్చింపవలయు ననియు, నూతనము లైన వృత్తు లనేకములను కల్పించి, యుద్యోగస్థులను నియమించి, వేతనములను ఏర్పాటుచేయవలె ననియుఁ జెప్పుట న్యాయ్యమా? వీని కన్నింటికి డ బ్బెచ్చటనుండి లభించును? దొరతనమువారు తమయొక్క జన్మభూమినుండియే కావలసినద్రవ్యముఁ దెచ్చి, యీ దేశమువారి కవశ్యము లైన మేలులను జేయుట సాధ్యమగునా? దొరతనమువారు జనులు చెల్లించుపన్నులను చేర్చిపెట్టి న్యాయమార్గమున వెచ్చించి జనులకు సౌకర్యములను గల్గించుటకే శక్తులయి యున్నారు. 1858-వ సంవత్సరమున హిందూదేశ మాంగ్లేయ ప్రభువులయధికారముక్రిందికి వచ్చినప్పు డించుమించుగా 30 కోట్లరూపాయలే వారికి వ్యయ మాయెను. ఇప్పు డన్ననో, 107 కోట్లకంటెఁ బైఁగా వ్యయమగుచున్నది. ప్రజల కుపయోగించు కట్టడములకును, సైన్యములకును, నాగరికత హెచ్చినకొలఁది వ్యయమెక్కువగుటచేతను, వెండిధర తగ్గుటచేతను నింత వ్యయమగుచున్నది.

పన్ను వసూలు చేయుటయందుఁ గొన్ని విధు లు: ఆదాయమునకుఁ దగినట్లే శిస్తులు వేయుట యంద

కొనఁదగియున్నది. బీదలు స్వల్పపన్నును ధనవంతు లెక్కువ పన్నును జెల్లించుట న్యాయ్యము. శిస్తును ఒకఁడు చెల్లించుటచేత మఱియొకఁడు నష్టము నొందవచ్చును. వస్త్రములపన్నువలనఁ దఱచుగా బట్టలవర్తకుఁడు నష్టము నొందుట లేదు. అతఁడు వస్త్రములయమ్ముడు వెలయందే తాను జెల్లించుపన్నునుగూడఁ జేర్చుటవలన నష్టము నొందువాఁడు వస్త్రములఁ గొనువాఁడే కాని వర్తకుఁడు కాఁడు. ఇవ్విధముననే యింటిపన్ను తఱచుగా అద్దె కుండువానికి నష్టమును గలిగించుచున్నది. కాఁబట్టి పన్నులవలన వాస్తవముగా నష్టము నొందువారియొక్క స్థితి ననుసరించియే దొరతనమువారు శిస్తులను విధింపవలయును. అయినను జనులయొద్దనుండి పన్నులు రాఁబట్టుటకై విశేషవ్యయము చేయుట యుక్తము కాదు. లక్షరూపాయలు పన్ను రావలసియుండినయెడల దానిని వసూలుచేయుట కేఁబదివేలు కర్చుపెట్టుట మంచిమార్గ మని చెప్పుటకు వీలుపడదు. విధింపఁబడిన పన్నంతయు రాఁబట్టి రాజ్యసంరక్షణమునకై యుపయోగపఱచవలెను. పన్నులు వేయు విషయమున, దొరతనమువారు తమయాదాయమునే ప్రధానముగా నెంచక జనులకు మేలు చేయుట యావశ్యకము, మద్యపానము మొదలగుదురభ్యాసముల నాపు చేయుటకు గొప్ప [illegible]వనను, మద్యపానము మొదలగుదురభ్యాసముల నాపు[illegible]రింపఁజాలనిశిస్తు విధించి తమ కెక్కువయాదాయ

మును గలిగించుకొనుట తప్పిదము కాదు. ఆదాయ మునకంటెఁ బరిపాలనపద్ధతియే రాజ్యాభివృద్ధికిఁ బ్రధాన కారణమని చెప్పవలెను. పన్నులు వసూలుచేయుటకును, వసూలైనపన్నును న్యాయ్యముగా వెచ్చించుటకును, పలు తెగలగు సాధారణరాజకీయాధికారములను నిర్వహించు టకును గొప్పయధికారులను నియమించి, వారికట్టుదిట్ట ములకు జను లందఱు లోఁబడునట్టు చేయుటయే ప్రభు త్వలక్షణము. గొప్పశిల్పశాలలలో నొక్కొక్కపనివాఁ డును తనతన పనిని క్రమముగాఁ జేయనియెడల, యంత్ర ములు కదలక నిలిచిపోవును. అట్లే ప్రభుత్వమనెడి గొప్పయంత్రమును నడిపించువిషయమున నధికారులు తమ కేర్పఱచిన పనులను క్రమముగాఁ జేయ రేని, యది యు న్యాయపద్ధతియం దుండనేరదు.

ఇప్పుడు మనము ప్రభుత్వమువారికిఁ జెల్లించు పన్ను లివి, అవి యివ్విధముగా వసూలుచేయఁబడుచున్నవి, వానిని ప్రభుత్వమువారీ పనులలో వెచ్చించుచున్నా రను విషయము లిఁకమీఁదఁ జెప్పఁబడును.



## 15. పన్నుల కాధారములును, వానివసూలును.

పన్ను లనేకతెగలుగా నుండుటకుఁ గారణము — భూమిపన్ను, దాని స్వరూపమును—జమీందారీ, రైతువారి, విశేజివారి విధులు—నేల పన్ను వేయువిధులు—ఉప్పుపన్ను, దానిరీతియు—ఉప్పుపన్ను తగ్గించు టచేఁ గలిగినమేలులు—సారాయములతీరువయొక్క స్వరూపము—ఎగు మతిదిగుమతుల మీఁదిపన్ను—వచ్చుబడిపన్ను—అడవిపన్ను—ముద్రాం కితముల (స్టాంపుల)పన్ను — తంతి, తపాలు, ఇనుపదారి, టంకశాల మొదలగువానివలనఁ గలుగు వచ్చుబడియు—పైఁజెప్పినపన్నులను వసూ లుచేయువిధములును, అధికారులును.

జను లాదాయమునకై వెదకు మార్గము లనేకములు. కొందఱు సేద్యము చేసి జీవనముచేయుదురు. కొందఱు చేతిపనులవలన సంపాదింతురు. మఱికొందఱు వర్తకముచే జీవింపవచ్చును. ఇంకను గొందఱు తమపూర్వులు సంపా దించిపెట్టిన యాస్తి నుంచికొని సుఖజీవనము చేయవచ్చును. పన్నులు వచ్చుబడికిఁ దగినట్లు వసూలు చేయవలసియుం డును. కావున, వానియాధారములును బలుతెగలుగా నున్నవి. ఇట్టియిట్టి పన్నులు ఈదేశమునందు వాడుకపడి యున్నవి యనియు, నవి యివ్విధమున లభించుచున్న వనియు నిఁకఁ జెప్పుదుము.

భూమిపన్ను:—ఈదేశమందలి జనులలో మూఁడింట రెండుపాళ్లకంటె మించినవారు పైరుపెట్టి జీవించువారుగా

నున్నందున భూమిపన్నే ప్రభుత్వమువారియాదాయము నకు ముఖ్యాధారముగా నున్నది.

1906-వ సంవత్సరమున భూమిపన్నువలనఁ బ్రభుత్వమువారికి లభించినమొత్తము కొంచె మెచ్చుతక్కువగా 28 కోట్లరూపాయ లుండవచ్చును. బంగాళామాగాణము నందు 1793-వ సంవత్సరమున విధించిన భూమిపన్నే యిప్పటికిని వాడుకలో నున్నది. దొరతనమువారు దానిని జమీనురాజ్యముగాఁ జేసినదియు, అప్పుడుండినభూముల సారపరిమాణమును, వచ్చుబడిని మదింపువేసి జమీను దారులు తమకుఁ జెల్లింపవలసిన పన్ను (బేరీజు) ఇంతని నిర్ణయించుటయే కాక, ఆపన్నే యెల్లప్పుడు నుండవలసినది గాని మార్పఁగూడ దని చట్ట మేర్పఱచుటయే పైనిఁ జెప్పిన యేకవిధమైనస్థితిలో నుండుటకుఁ గారణము. ఈవిధముగనే, చెన్నపురి, ఆగ్రా మొదలగుకొన్నిమాగాణములలో కొన్నిప్రదేశములలో నేలపన్ను ఏర్పడియున్నది. గతించిన నూతేండ్లనుండియు నీ ప్రదేశములలో భూములు విశేషముగ సాగుబడిచేయఁబడుచుండుటవలనను, పండెడు ధాన్యములక్రయము హెచ్చుచుండుటవలనను, జమీను దారులకు మంచిలాభము దొరకుచున్నదే కాని, ప్రభుత్వమువారికి మాత్ర మాదాయము వృద్ధి కాలేదు.

తక్కిన ప్రదేశములందు 10 సంవత్సరములకుఁబైన, 30 సంవత్సరముల కొకపర్యాయము తీరువ విధింపఁబడుచున్నది. గ్రామములకే సొంతదారులగు గొప్పభూస్వాముల యొక్క విస్తారమయిన నేలలను గ్రామవారిగా లెక్కలు చేసి, యప్పటి కుండు పైరులపెంపును, నేలలవిస్తీర్ణమును గమనించి, పన్నులు విధింపఁబడుచున్నవి. మఱల నట్టి లెక్క తయారుచేయునంతవఱకు నీ పన్ను మార్పఁబడదు. అయినను, ఒకగ్రామమున నున్న నేల లనేకులకు సొంతముగా నున్నట్లయిన 20, లేక, 30 సంవత్సరముల కొక పర్యాయము తరమువారి లెక్క తీసి పన్నులయొక్క దిట్టము నేర్పఱచి యొక్కొక్కభూస్వామియు నింతింతపన్ను చెల్లింపవలయు నని తీర్మానింపఁబడుచున్నది. వ్యయము లన్ని యుఁబోను తేలునట్టినికరములాభములో నించుమించుగా సగముపాలు దొరతనమువారికిఁ బన్నుక్రిందఁ జెల్లింపఁబడుచున్నది. నీళ్లు లేక పంటలు లేనిక్షామకాలమునఁ బన్ను త్రోసివేయుటకును, నీటిసమృద్ధి విశేషముగా నున్న కాలమున కొఱుపైరు చల్లినప్పుడు, అట్టినేలలలెక్క తయారుచేసి పన్ను విధించుటకును, జిల్లాయధికారులకుఁ బ్రభుత్వమువా రధికారము నొసంగియున్నారు. ఈ యధికారులు జనుల నచ్చటచ్చటికిఁ బిలిపించి, వారికొఱఁతలను విచారించి తెలిసికొని కరణములను దగ్గఱ నుంచుకొని నేల

పన్నును గూర్చిన సంగతులను దీర్మానించుచుందురు. దీనికే **జమాబంది** యని పేరు.

**ఉప్పుపన్ను**:—భూమి లేనివారనేకులీదేశములో నున్నారు. అయినను ఉప్పు వాడుకోననివారొకరయినను తఱచుగా నుండరు. కావున నీదేశమున నందఱు చెల్లించెడు పన్ను ఉప్పుపన్ను అసియే చెప్పవచ్చును. ఈ పన్నును బీద వారును చెల్లింతురు. భాగ్యవంతులును చెల్లింతురు. బీద లయినను దమశక్తికొలఁది దొరతనమువారికి ద్రవ్య సాహాయ్యము చేయవలయు ననుట న్యాయ్యమే కదా! కాఁబట్టి యీ దేశమునం దాసాహాయ్యమును వారు ఉప్పుపన్నుమూలమునఁ జేయుచున్నారు. అయినను ఈ యుప్పుపన్ను గూడ నానాటికిఁ దగ్గింపఁబడుచున్నది. 1903-వ సంవత్సరమువఱకు మణుగు 1-కి రూ. 2-8-0 వంతున పన్ను తీయఁబడుచుండినది. ఆ సంవత్సరముననే ఆపన్ను 2 రూపాయలకుఁ దగ్గింపఁబడి, పిదప రూ. 1-8-0 గా మార్పఁబడినది. 1907-వ సంవత్సరమున ఆపన్ను 1-0-0 రూపాయగానే చేయఁబడినది. ఇట్లు ఉప్పుపన్ను తగ్గింపఁబడినను, దొరతనమువారియాదాయము విశేష ముగాఁ గొఱఁతపడలేదు. ఉప్పు, జనులయాహారమున కును పశువులతిండికిని భూములయెరువుకును చేఁపలు మొదలగునవి పక్వముచేయుటకును మిక్కుటముగా నుప

యోగింపఁబడుచున్నది. ఇప్పుడు ఉప్పు ఒకసంవత్సరమున కంతకును రమారమి 4 కోట్లమణుగులకు పైఁగా ఖర్చుపడుచున్నది. 6 కోట్లరూపాయలకంటె పైఁగానే రాజ్యాంగమువారికి లాభము దొరకుచున్నది.

ఈ దేశమున నుండువారికి లవణము నాల్గువిధములుగ లభించుచున్నది.

(1) చెన్నపురికి సమీపమున సముద్రతీరమున మడులు చేసి, ఉప్పునీటిఁ బాఱించి సూర్యరశ్మివలన నీరంతయు నావిరియై యింకినపిదప, ఉప్పు పోగుచేసి కొంతకాల మట్లుంచి పిమ్మట వానిని వాడుకొనుటకై విక్రయించుచున్నారు.

(2) రాజపుత్రస్థానములోని సాంబర్ మొదలగునుప్పునీటిచెఱువులనుండియు నుప్పు తీయఁబడుచున్నది.

(3) పంజాబుమాగాణమున నుండు కొన్ని తిప్పలనుండియు ఉప్పు దొరకుచున్నది.

(4) ఇంగ్లాండు, ఏడన్ మొదలగుపరదేశములనుండియు నీదేశమునకు ఉప్పు దిగుమతియగుచున్నది. కొన్ని ప్రదేశములలో దొరతనమువారియధికారులచేతను, మఱికొన్ని ప్రదేశములలో వారియుత్తరువు పొందినయితరజనులచేతను, నుప్పు పండింపఁబడుచున్నది. ఉత్తరహిందూస్థానమునందుఁ దఱచుగా సర్కారువారే యీ యుప్పు

పంట చేయుచున్నారు. చెన్నపురియందు దొరతనము వారియధికారులు స్వయముగా 22 ఉప్పళములను, వారి యనుమతి (License) పొందిన జనులు 45 ఉప్పళములను పంట చేయుచున్నారు. దొరతనమువారు ఉప్పుపన్ను వసూలుచేయుట కెంత యధికారము చెలాయింపవలెనో యంత యధికారమును మాత్రము చెలాయించుచున్నారు. ఉప్పళములలో దొంగతనము నిలుపుటకై తగినయధి కారులు, బంటులు, కావలివాండ్రు మొదలగువారిని నియ మించుటయే కాక యితరరాజ్యాంగమువారికిఁ జేరినమా గాణములనుండి దొంగతనముగా నుప్పు మనరాజ్యము నకు రాకుండుటకుఁ దగినయేర్పాటులను గూడఁ జేసియు న్నారు.

ప్రభుత్వమువారు స్వలాభమును జూచుకొనుటయే కాక, మద్యపానము మొదలగు కొన్ని దురభ్యాసముల నాపుదలచేయుటకును పన్నులు వేయుచున్నారని ముందే చెప్పఁబడినది. ఈ పన్నులలో సారాయుపుఁ బన్ను ఒక టియై యున్నది. మత్తును గలిగించు కల్లు, గంజాయి, అభిని మొదలగు పదార్థములు చిరకాలమునుండి యీ దేశ ములో వాడఁబడుచున్నవి. వీనిని బుచ్చుకొనువారికి, మనస్సు, వాక్కు, దేహము, ఈ మూడును తమస్వాధీన ములుగా నుండవు గనుక గౌరవము తగ్గును. అది దగ్గుటచే

బుద్ధిమంతులు, బంధుమిత్రులును వారిని గన్నె త్తియైనను జూచుట కసహ్యపడి, వారితోఁ జేరరు. అంతేగాక త్రాగుబోతులు తమకలిమి నెల్ల దారపోసికొని, పేదలై, వీధులవెంబడిఁ బ్రాఁకులాడుచుఁ గ్రిందఁబడుచు లేచుచు నందఱిచేతను నిందింపఁబడుదురు. **మద్యపానము మహా పాపము** అని నీతిశాస్త్రము లెల్ల ఘోషించుచున్నవి. అయినను, ఈ దురభ్యాసము నానాటికి నభివృద్ధి చెందుచున్నది. దీని నాపునిమిత్తమే ప్రభుత్వమువారు పన్ను విధించి యనేకములైన కట్టుదిట్టము లేర్పఱచియున్నారు.

పరదేశములనుండి దిగుమతి యగు పానములకుఁ దగినట్లుగా రేవులందు ఒకగాలను (Gallon) లేక 2½ పడికి ఒక అణా మొదలుకొని యేడురూపాయలవఱకును దిగుమతిపన్ను వసూలు చేయఁబడుచున్నది. కల్లంగడివారు సంవత్సరమున కొకటికి నేర్పడిన పన్నును ముందుగాఁ జెల్లించియైనను, వేలము వేయునప్పుడు గొప్ప మొత్తమును బన్నుగాఁ జెల్లించియైనను పానము ను విక్రయించు నధికారము నొందుచున్నారు. పన్నుకట్టనివారు పానముల వ్యాపారము చేయరాదు. ఈదేశమున సారాయము గాచువారు, దానిసారమునకును కొలఁతకును దగినట్లు సారాయము గాచుచోటులందే పన్నుకట్టవలయును. దొరతనమువారియనుమతి నొందినయంగడివారే సారాయ

మును విక్రయింపవలయు ననియు, పిల్లలకును మైకముగల వారికిని దానిని విక్రయింపరా దనియు, అరువున కమ్మకము చేయరా దనియు, అంగళ్లను నియమితకాలమునకే మూయవలయు ననియు, అనుమతిపత్రికను (License) ప్రతిసంవత్సరమును నూతనపఱచుచుండవలయు ననియుఁ జట్టము లేర్పఱచియున్నారు. గంజాయి అభిని మొదలగు వానిని పైరుచేయువారియొద్దనుండి సర్కారువారే వీనిని దీసిపెట్టికొని యెక్కువ మొత్తము కట్టి యనుమతిపత్రిక నొందినవారికే వానిని విక్రయించి జనులకు చిల్లరగా నమ్మునట్లు చేసియున్నారు. ఇట్లనేకనిర్బంధము లేర్పడినను, ఈవస్తువులందు జను లెక్కువ యభిమానము గలవారగుటంజేసి, యెక్కువ వెలపెట్టియైనను గొనుచున్నారు. కాఁబట్టి 1905-వ సంవత్సరమున దొరతనమువారి కించుమించుగా 8 కోట్లరూపాయల యాదాయము లభించినది. చదువును జ్ఞానమును వ్యాపించినకొలఁది, నీ దురభ్యాసములను జనులు విసర్జింపఁగలరు.

ఎగుమతి దిగుమతి పన్ను:— ఈ దేశమున విశేషముగాఁ బండువస్తువులను బరదేశములకుఁ బంపుటకును, నీదేశమునకుఁ గావలసినవస్తువులను బరదేశములనుండి తెప్పించుటకును దగిన సౌకర్యములను మనకుఁ గలిగించుట ప్రభుత్వమువారికి విధి. కనుక, ఎగుమతిదిగుమతివస్తువుల

మీఁద విధింపఁబడుపన్నులను కాలక్రమమున తీసివేయ వలయు నని ప్రభుత్వమువారే యోచించుచున్నారు. 1860-వ సంవత్సరమువఱకు దిగుమతివస్తువులమీఁద 100-కిఁ బదివంతునను, ఎగుమతివస్తువులమీఁద 100-కి మూఁడువంతునను బన్ను విధింపఁబడినది. 1875-వ సంవత్సరమున దిగుమతిసరకులమీఁద పన్నును 100-కి ఐదుగాఁ దగ్గించిరి. 1876-వ సంవత్సరమున నూలు గుడ్డలు మొదలగు ప్రత్తిదినుసులకు దిగుమతిపన్నును తీసివేసిరి. 1882-వ సంవత్సరమునందు, ఉప్పు, సారాయము, తుపాకి మందు మొదలగునవి తప్పఁ దక్కినవస్తువులకుఁ దీరువ యెత్తివేసిరి. 1888-వ సంవత్సరమున మంటనైలమునకు స్వల్పతీరువ విధించిరి. 1894-వ సంవత్సరమునఁ బరదేశములనుండి వచ్చెడు ప్రత్తిదినుసులమీఁదను, ఈదేశమున యంత్రశాలలలో నేయఁబడు వస్త్రములమీఁదను 100-కి ఐదువంతునఁ బన్ను గైకొనిరి. 1896-వ సంవత్సరమున నీ పన్నును 100-కి మూఁడున్నరవంతునఁ దగ్గించి, ప్రత్తినూలుమీఁద పన్ను బొత్తిగాఁ గొట్టివేసిరి. కాఁబట్టి యిప్పుడు సీమవస్త్రములు, వెండి, తుపాకులు, తుపాకిమందు, మంటినైలము, సారాయము, చక్కెర, పొగాకు వీనికి మాత్రము పన్ను గైకొనుచున్నారు. పుస్తకములు, అచ్చువేయు సాధనములు, యంత్రములు, బంగారము, నేలబొగ్గు, ఓడలు,

మృగములు మొదలగువానికిఁ బన్ను చెల్లింప నక్కఱలే దని యేర్పాటుచేసియున్నారు. ఎగుమతి దిగుమతిపన్ను లవలన దొరతనమువారి కించుమించుగా 8 కోట్ల రూపాయలు సాలుసరు దొరకవచ్చును.

**ఆదాయపుఁబన్ను**:—మొదటమొదట 1860-వ సంవత్సరమున నీ దేశము తూర్పుఇండియావర్తకసంఘమువారి యొద్దనుండి యాంగ్లేయరాజులపరిపాలనమునకు రాఁగానే రాజ్యపరిపాలనవిషయమున ననేకమార్పులు చేయఁబడినవి. ఆకాలమునఁ బ్రభువులకు వ్యయము హెచ్చుగా నుండుటచే జనులయాదాయమునకుఁ దగినట్లు ఆదాయపుఁబన్ను అను పన్నును విధించిరి. మొదట 200 రూపాయలకుఁ బైఁబడి వర్షాదాయము దొఱకువారివలనఁ బన్ను గైకొనఁబడినది. 1862-వ సంవత్సరమున 500 రూపాయలకంటె హెచ్చు ఆదాయము గలవారికిమాత్రమే యీ పన్ను విధింపఁబడినది. ఇప్పుడు 1000 రూపాయలకుఁ బైఁబడిన యాదాయము గలవారికే యీ పన్ను వేయఁబడుచున్నది. కావున బీద లీ పన్నువలన నెట్టి నష్టము నొందుట లేదు. సుమారు 3 లక్షలమంది భాగ్యవంతు లీ యాదాయపుఁబన్నును జెల్లించుచున్నారు. 1000 రూపాయలకుఁ బైఁగా 2000 రూపాయలలోపలి యాదాయముగలవారు రూపాయ 1-కి 4 పైసలవంతు

నను, 2000 రూపాయలకంటెఁ హెచ్చుబడినయాదాయము గలవారికి రూపాయ 1-కి 5 పైసలవంతునను పన్ను విధింపఁబడుచున్నది. ఈ విధముగా దొరతనమువారికి సంవత్సరమునకు 2 కోట్ల రూపాయలు లభించుచున్నవి.

అడవిపన్ను:—అడవులు గూడ నీదేశమునకు శ్రేష్ఠమైన మూలధన మని చెప్పవలయును. వానియందు పయుక్తములగు ననేకవృక్షములును, మృగములును గాక, యితరదేశములలో నగపడనియపూర్వమృగములు నుండును. వాన గురియుటకు సైతము కాననములు ముఖ్యకారణము లని చెప్పుదురు. కాఁబట్టి జనులు మృగములను దమయిష్టానుసారముగా నఱికి పాడుచేయకుండుటకై ప్రభుత్వమువా రనేకవిధుల నేర్పఱచియున్నారు. వారు విడిచియుండునడవులలో వారియనుమతి నొందినపిదపనే చెట్లు నఱకవచ్చును; వేఁటాడవచ్చును. అడవులలో లభించువస్తువులను దొరతనమువారు స్వల్పమూల్యమునకే జనులకు విక్రయించుచున్నారు. ఈ దేశమున 92,000 చదరపుమైళ్ల వైశాల్యము గల యడవులమూలమున సంవత్సరమునకంతటికిని సుమారు 2¾ కోట్ల రూపాయలు దొరతనమువారికి దొఱకుచున్నవి.

ముద్రకాగితములు:—తపాలు, తంతి యిలాకాలలో ముద్రబిళ్ల లివ్విధముగా మన కుపయోగపడుచున్న వని

యు, దొరతనమువారు మనకుఁ జేసెడి పనులనిమిత్తము మన మొసఁగుకూలి కవి రసీదులు (Receipts) అనియు మునుపే చెప్పఁబడినది. ఇత్తెఱఁగుననే మనము న్యాయ స్థలములలో వ్యాజ్యములు చేయునప్పుడును, పత్రములు వ్రాయునప్పుడును, వస్తువులయొక్క విలువకుఁ దగినట్లు ద్రవ్య మిచ్చి ముద్రకాగితములు గొని, వానియందు విష యములను వ్రాయుదుము. ఈద్రవ్యము దొరతనము వారు న్యాయస్థలములను గట్టుటకును, న్యాయాధిపతు లను నియోగించి మనవ్యాజ్యములను తీర్చుటకును మనము చెల్లించుతీరువ యని తలంపవలయును. న్యాయస్థలము లందు జరుగవలసిన ప్రతియొకసంగతియు ముద్రకాగితము లలోనే జరుగుచున్నది. ఇవ్విధముగా ముద్రకాగితముల విక్రయమువలన వచ్చునాదాయమువలననే న్యాయయి లాకా జరుగుచున్నది. పత్రములలో దొంగతనముగా దిద్దుపాట్లు చేసి, ఒకరి నొకరు మోసముచేయకుండుటకై రిజిస్ట్రార్ (Registrar) అని చెప్పఁబడు పత్రనకళ్లసంరక్ష కాధికారితావునకు జనులు పోయి, పత్రములలోని విష యములను దొరతనమువారిపుస్తకములలో దాఖలుపఱచు నట్లు చేయుదురు. దీనికిని గూలి యియ్యవలయును. పైఁజెప్పిన విషయముల నాలస్యము లేక సులభముగా ముగించుటకు ముద్రకాగితములు మిక్కిలి ముఖ్యమార్గము

లుగా నున్నవి. ఈ కాగితములవిక్రయమువలన సంవత్సర మొక్కటికి 6 కోట్లరూపాయలును పత్రముల దాఖలు చేయుటవలన 57½ లక్షల రూపాయలును దొరతనము వారికి లభించుచున్నవి.

**తపాలు, తంతి, ఇనుపదారి, టంకశాల** వీనియాదాయములు — పైఁజెప్పినవానిని నాలుగింటిని ప్రభుత్వమువారు జనులకు మిక్కిలి చౌకగా నుండునట్లు చేసియున్నను కోట్ల కొలఁది జనులీ సాధనముల నుపయోగపఱచుకొనుటచే రాజ్యపరిపాలకులయాదాయ మభివృద్ధియగుచునే యున్నది. పైఁజెప్పినవిభాగము లన్నింటిని నొకభాగముగఁ (Department of Commerce and Industry) జేసి, ఇండియాగవర్నమెంటువారే దీనిని తనిఖీచేయుచున్నారు. ఇప్పుడు కొన్ని ఇనుపదారులు దొరతనమువారికే చెందియున్నవి. కాలక్రమమునఁ దక్కిన ఇనుపదారులును ఒడంబడికప్రకారము వారిస్వాధీనములోనికి రావచ్చును. కాఁబట్టి ప్రభుత్వమువారికి క్రమక్రమముగా నినుపదారుల వలన లాభము హెచ్చుచునే వచ్చును. 1907-వ సంవత్సరమున నాదాయము 20 కోట్లరూపాయలును వ్యయము 17 కోట్లరూపాయలును నుండెను. కాఁబట్టి యితరాదాయము రమారమి 3 కోట్లరూపాయ లుండవచ్చును. తపాలు, తంతి, నాణెములు మొదలగువానివలనఁ ప్రభు

త్వమువారి కాదాయము $4\frac{1}{4}$ కోట్లరూపాయలును వ్యయము $4\frac{1}{3}$ కోట్లరూపాయలును నగుచున్నవి.

పైఁజెప్పినమార్గములే కాక రాజ్యాంగమువారియాదాయములకు మఱికొన్ని మార్గము లున్నవి. మైసూరు, తిరువాన్కూరు, మొదలగు స్వదేశసంస్థానములనుండి లభించు కప్పమును, దొరతనమువారికాలువలను రాకపోకల కుపయోగించుకొనుటకై జనులు చెల్లించుపన్నులును, మఱికొన్ని విధము లగు నాదాయములును, గలిసి సంవత్సరము 1-కి సుమారు 12 కోట్లరూపాయలు లభించుచున్నవి.

ఇట్లు పలు తెఱఁగుల లభించు మిక్కుటమైన పన్నులను లెక్కవ్రాసి, జనులయొద్దనుండి రాఁబట్టుటకై ఒక్కొక గ్రామమునందును, తాలూకాయందును, జిల్లాయందును, మాగాణమునందును, నధికారమువహించిన యుద్యోగస్థులను నియమించి, ఒక్కొక్క బొక్కసశాలకును సమర్థులయిన యధికారులను నియమించియున్నారు. గ్రామములలోఁ గరణము లనఁబడు నధికారులును, కొన్ని గ్రామములు చేరిన భాగములకు (Firka) రివిన్యూయిన్స్పెక్టర్లను (Revenue Inspectors), తాలూకాలలో తహసీల్దారులను లేక డిప్యుటీతహసీల్దారులను వీరికిఁబైన డిప్యుటీకలెక్టర్లను (Deputy Collectors) జిల్లాకంతకును కలెక్టరులు (Collector) అను నధికారులను నియమించి, బొక్కసము



రెవిన్యూబోర్డు, మద్రాస్.

లకుఁ గావలసినంత కావలి యుంచి, పైఁజెప్పిన పన్నులను గైకొనుచున్నారు. జిల్లా కంతటికిఁ బ్రధానాధికారిగా నుండుటవలనఁ బన్నువసూలుకు మాత్రమే కాక, భూము లను, ఇండ్లను గూర్చి దొరతనమువారికి సంగతులు వ్రాసి పంపుటకును, భూస్వాములకును గుత్తదారులకును గల వివాదములను దీర్చుటకును, రైతులు బావులు మొదలగు

జలాధారము లేర్పఱచికొని భూములు చక్కఁగాఁ బండిం చుటకై యప్పు లిచ్చుటకును, జిల్లాబొక్కసములను తనిఖీ చేయుటకును, జిల్లాకలెక్టరువా రధికారము వహించియు న్నారు. ఈ యధికారు లీ పద్ధతినిఁ జేసెడిపనులను పైవిచా రణచేయుటకే మాగాణముయొక్క రాజధానియందు రివిన్యూబోర్డు (Revenue Board) అను సంఘము నేర్ప ఱచి మొదట జిల్లాకలెక్టరులుగా నుండి తేఱిన నలుగురు గొప్ప యుద్యోగస్థులను, ఆ సభకు సభ్యులను (Commissioners) గా నియమించి రివిన్యూయిలాకాను ప్రత్యే కముగా నడపించుచున్నారు. ఈ పద్ధతులే, బంగాళము, ఆగ్రా మొదలగు మాగాణములందు నున్నవి. అయినను బొంబాయిమాగాణమునందు మాత్రము రివిన్యూబోర్డు నేర్పఱచక, యిరువురు కమిషనరులచేత రివిన్యూపైవిచా రణలను జరిపించుచున్నారు. క్రొత్త మాగాణములందును రివిన్యూబోర్డులు లేవు.

రివిన్యూయిలాకా రాజ్యాంగమున కాదాయముఁ గలి గించుభాగ మని చెప్పవలయు. శరీరములోనియవయ వము లన్నియుఁ గడుపున వేయఁబడునాహారముచే బల పడునట్లు వ్యయకరము లగు తక్కినభాగము లన్నియు రివిన్యూయిలాకాయాదాయముచేతనే జరుపఁబడుచు న్నవి. కనుక రివిన్యూశాఖకు సంబంధించిన కట్టుదిట్టము

లును, లెక్కలును, పన్ను వసూలుచేయుపద్ధతులును, అధికారులును మిక్కిలి నాణెముగా నుండుట యావశ్యకము. ఇవ్విధముగా నుండునట్లు చేయుటయందే దొరతనమువారు శ్రద్ధ వహించి యున్నట్లు కనఁబడుచున్నారు. పూర్వకాలమున జనులవలనఁ గైకొనఁబడుపన్నంతయు దొరతనమువారికిఁ జేరుట లేదు. పన్నువసూలు చేయునధికారులు పన్నులోఁ గొంతభాగము స్వోపయోగము కొఱకు వినియోగించుకొనుచుండినట్లు తెలియవచ్చుచున్నది. ఇప్పు డన్నమో రాగి రువ్వంతయైనను వ్యత్యాసము గలుగుటకు వీలు లేదు. జనులు కట్టవలసినపన్నులన్నియుఁ జక్కఁగాఁ వసూలుచేయఁబడి, రాజ్యపరిపాలన కార్యమునకై వినియోగింపఁబడుచున్నవి. అంతియకాక లెక్కలవిషయమున దొరతనమువారు చేసియుండు కట్టుదిట్టము లాశ్చర్యకరములై యున్నవి. ఇంతవిశాలమైన దేశము నాంగ్లేయులు వశపఱచుకొన్నది యటుండ, వారు 4,000 మైళ్ల దూరమున నుండి యీదేశమున మూలమూలలనుండు చిన్నబొక్కసములలో నొక కాని పొరపాటున్నను, దాని నప్పుడే కనుఁగొనఁగూడినమార్గముల నేర్పఱచి యుండుట మిక్కిలి శ్లాఘనీయమైయున్నది.

## 16. మనకార్యములను మన మెచ్చట నిర్వహించు కొనుచున్నాము.

---

పౌరులకు దొరతనమువా రొసంగియుండు స్వాతంత్ర్యము — ఒసంగినకాలము — నగరవిచారణజిల్లావిచారణసంఘములయేర్పాటు — వానియాదాయవ్యయములు — వానివలనఁ జేయఁబడు సాధారణసౌకర్యములు—పైనఁ జెప్పిన స్వాతంత్ర్యమువలనఁ బౌరులకును రాజ్యాంగము వారికిని గల సౌఖ్యములు.

కుటుంబమునకుఁ దండ్రి యెట్లో, అట్లే రాష్ట్రమునకు దొరతనమువా రని మొదటనే చెప్పఁబడినది కదా. కొందఱు తల్లిదండ్రులు తమకొడుకుల కెట్టి స్వాతంత్ర్యము నొసఁగక కుటుంబకార్యములన్నింటిని దామే గమనించుచుఁ దమయధికారమును బూర్తిగా వారిపైఁ జెలాయించుచుందురు. తెలివియు వివేకమును గలవారు తమకొడుకులకుఁ గుటుంబధర్మములను బాగుగా బోధించి వారివశమునఁ గొన్ని పనుల నప్పగించి, వారికి స్వాతంత్ర్య మొసఁగి, వారియొక్క ప్రేమమును, నమ్మకమును బొంది, తాము ముఖ్య లనెడివిషయమును జూపకయే, మిక్కిలి సామర్థ్యముతోఁ గుటుంబములను నడుపుచుందురు. ఈ రెండు మార్గములలో రెండవది శ్రేష్ఠమయిన దని యందఱు సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఒకఁడు తనకొడుకుల

కెంతెంతటిస్వాతంత్ర్యము నొసఁగునో, దానికిఁ దగినట్లు, కొమరుఁడును తెలివితేటలుగలవాఁ డగుటయే కాక, మర్యాదతోఁ బ్రవర్తింపుచుఁ దానును మర్యాదను బొం దుచుండును. కావున, మనదొరతనమువారు, ఏ పనులు పౌరులే చూచుకొనఁగలరో, ఆ పనుల నన్నింటిని వారివశ ముచేసి యవి బాగుగా నడచుపర్యంతము తా మొదిగి యుండి చూచుచున్నారు. అట్లు దొరతనమువా రొసఁ గినస్వాతంత్ర్యము నెప్పుడైనను బౌరులు చెడ్డమార్గము లలో నుపయోగించి, యొకరితో నొకరు జగడమాడిన ట్లయిన, నప్పుడు పౌరులకడనుండి యాస్వాతంత్ర్యమును గొంతకాలము తామే తీసికొని వారికి బుద్ధి వచ్చునట్లు చేయుదురు.

దేశమును గాపాడి, న్యాయమును బాలించి విద్యను వ్యాపింపఁజేసి, దేశమున కావశ్యకములైన యితరధర్మ కార్యములను దొరతనమువారే చేయుచున్నారు. నగర ము, తాలూకా, జిల్లా మొదలగు ప్రదేశములలో నాయా ప్రదేశములకు వలసిన రోడ్డులు, వైద్యశాలలు మొదలగు వానిని నిర్మించుటకును, వీధులలో దీపములు పెట్టించుట కును, పెంట యూడ్పించి వీధులను పరిశుద్ధపఱచుటకును, సత్రములు చావళ్లు తనిఖీచేయుటకును, ఈ పనుల కన్నిం టికిని గావలసిన స్వల్పపన్ను విధించుటకును దొరతనము

వారు జనులకే యధికారము నొసంగియున్నారు. ఇట్టి యధికారమును జను లే రాజ్యమునను బొందలేదు. 1884-వ సంవత్సరమున రిప్పన్ ప్రభువు రాజప్రతినిధిగా నుండినప్పుడు, దయాళువులగు మనప్రభుత్వమువారు మన కీ యధికారము నొసఁగిరి. అప్పుడు గ్రామవిచారణకును, నగరవిచారణకును గొన్ని చట్టములు (Local and Municipal Acts) ఏర్పఱచి, నగరములను, జిల్లాలను బరిపాలించు తెలుఁగున జనుల కొకవిధముగా స్వాతంత్ర్యము నిచ్చియున్నారు.



రిప్పన్ ప్రభువు.
1880–1884.

పైఁజెప్పిన చట్టములవలన, పెద్దగ్రామములలో యూనియన్ (Union) అనియు, నగరములలో (1) మునిసిపాలిటీ (Municipality) అనియు, తాలూకాలలో (2) తాలూకాబోర్డు (Taluk Board) అనియు, జిల్లాలలో (3) డిస్ట్రిక్టుబోర్డు

(1) పురపారిశుద్ధ్యసంఘము. (2) తాలూకాస్థలనిధిసంఘము.
(3) మండలస్థలనిధిసంఘము.

(District Board) అనియు విచారణసంఘము లేర్పడియున్నవి. యూనియనులలో గ్రామవాస్తవ్యులు కొందఱిని పంచాయతీలను నియమించి స్వల్పమయిన యింటిపన్ను విధించి వానిని వసూలుచేసి గ్రామములను శుద్ధముగా నుంచుకొనునట్లు అధికారమును బొందియున్నారు. మునిసిపాలిటీ యనునగరఫరిపాలనసంఘమునకు సభ్యు లింతమంది యే యుండవలయు నని నియమము గలదు. వీనిలో సగముమందిని దొరతనమువారును, దక్కినవారిని పుర జనులును నియమించుచున్నారు. పురజనులకుఁ గావలసిన సౌకర్యములను గనుఁగొనువారు వీరే. తాలూకావిచారణసభ్యు లందఱు రాజ్యాంగమువారిచేత నియమింపఁబడుచున్నారు. జిల్లాబోర్డుసభ్యులలోఁ (District Board Members) గొందఱు ప్రభుత్వమువారిచేతను, తక్కినవారు సంఘమువారిచేతను నియమింపఁబడుచున్నారు. ఈ సంఘసభ్యులయవధి యొక్కొక్కచోట నొక్కొక్కతీరున నున్నది. క్రిందఁ గనఁబఱచఁబడినవి యీ సంఘమువారి విచారణకు లోఁబడియున్నవి. (1) రోడ్డులు (2) జలదారులు, కాలువలు, వంతెనలు (3) పెంట, జలదారినీరు, అశుద్ధవస్తువులు తీయించుట మొదలగునవి (4) వైద్యశాలలు, సత్రములు, పాఠశాలలు, అంగళ్లు, గుంటలు, బావులు మొదలగునవి.



ఆహారవస్తువులమ్ముచోటు, మద్రాస్.

పట్టణపారిశుద్ధ్యసభకుఁ గ్రిందఁ జూపఁబడిన పన్నులు వసూలగుచున్నవి.

1. వృత్తిపన్ను (Proffession Tax.)

2. సంవత్సరాదాయములో నూటికి 7½కుఁ బైఁబడని నేలపన్నును, ఇండ్లపన్నును.

3. సంవత్సరాదాయములో నూటికి నాల్గింటికిఁ బైఁబడక, ఇండ్లకును, నేలలకును నేర్పడు నీటిపన్ను.

4. పలుతెగలలోఁ జేరిన బండ్లు, పల్లకీలు, పశువులు; గుఱ్ఱములు మొదలగుమృగములు, వీని నుంచు

కొనియుండువారు 6 నెలల కొకపర్యాయము చెల్లింపవల సినపన్ను.

5. ఇతరగ్రామములనుండి పట్టణములోపలికి వచ్చు బండ్లకును, వాహనములకును గొనఁబడుసుంకము.

ఈ యాదాయముల నన్నిటిని గొని పట్టణపారిశుద్ధ్య సంఘమువారు బాటసారుల కావశ్యకములయిన రోడ్డులను, వంతెనలను, వ్యాధులను బోఁగొట్టఁదగినయనేక వైద్యశాలలను, పాఠశాలలను, బీదల కుపయోగపడువిశ్రమస్థలములను, సత్రములను, చావడులను, వ్యాపారమున కావశ్యకములైన యంగళ్లను, మంచినీరు పాఱుటకై జల దారులను, వేసవికాలములం దుపయోగపడఁదగిన గుంటలను, బావులను నమర్చుటయే కాక, సంవత్సర మంతయు, వానిస్థితిని గమనించి చేయవలసిన దిద్దుబాట్లను జేయుచుందురు. అంతియకాక, వీధులలోఁ జెత్త లేక శుభ్రముగా నుంచుటయు, రాత్రులందు వీధులలో దీపములు వెలిఁగించుటయు, జనులు వేడుకగా విహరించుట కైన శృంగార వనముల నేర్పఱచుటయు, అంటువ్యాధులు వ్యాపింపకుండునట్లు ఆపుదలచేయుటయు ఈ పట్టణపారిశుద్ధ్యసంఘమువారివిచారణవలననే జరుగుచున్నవి. పైఁజెప్పినపనులను జేయుటకుఁ బలువురు పనికాండ్రును, ఉద్యోగులును వారిచే నియమింపఁబడియున్నారు. అంటువ్యాధులు వచ్చి

నప్పు డాయంటువ్యాధి సోఁకినవారిని ప్రత్యేకము లగు గుడిసెలలో నుంచి, వారికిఁ దగు చికిత్సచేయుటయేకాక, వారియిండ్లలోపల వ్యాధ్యపనోదకములగునౌషధరసమిశ్ర జలములను ద్రావకములను జల్లి, బాగుగా శుద్ధిచేయించి, వ్యాధి వ్యాపింపకుండుటకుఁ దగిన జాగ్రత్త దీసికొనుచున్నారు.

ఈ క్రిందఁ గనుపఱుపఁబడినపట్టీవలన 1901–వ సంవత్సరమున నెన్ని మునిసిపాలిటీ లున్నవైనము తెలియఁగలదు.

| వివరము. | సంఖ్య. |
|---|---|
| మునిసిపాలిటీలు ... ... | 742 |
| వానిలోని జనసంఖ్య ... ... | 1,38,71,218 |
| మునిసిపల్ సభ్యులు (Municipal Members.) | 9,797 |
| జనులచే నెన్నుకొనఁబడినసభ్యులు ... | 4,937 |

మునిసిపాలిటీలకువలెనే బోర్డువారికిని క్రిందఁజూపిన తెఱఁగున నాదాయములు లభించుచున్నవి:—

1. హద్దులకు లోపల నుండెడియిండ్లకు పన్ను.

2. రోడ్డులలోఁ బోవుబండ్లు, వాహనములు, మృగములు మొదలగువానివలన వసూలయ్యెడు సుంకము.

3. పందిళ్లు, పాకలు మొదలగువానిని వేయుటకై, యొక చదరపుగజమునకు దినము 1-కి 3 పైసాలకు హెచ్చని యనుమతితీరువ. (Licence Fee)

4. సంత కూడునప్పుడును, ఉత్సవములు జరుగునప్పుడును బండ్లపేటలను, సామానులమ్మెడు తావులను, గ్రామచావడీల నుపయోగపఱచుకొనుటకై విధింపఁబడు స్వల్ప తీరువలు.

5. మళయాళము, దక్షిణకన్నడము, నీలగిరి మొదలగు ప్రదేశములలోనిభూములకు సంవత్సరాదాయములో రూపాయ 1-కి రెండణాలును, తక్కిన ప్రదేశములందు రూపాయ 1-కి ఒకణాయును నేలపన్ను.

ఈ యాదాయములమూలమున జనులసౌకర్యమునకై రోడ్లు లేర్పఱచి, వానియిరుప్రక్కల నీడకై చెట్లు పెట్టి పెంచి, వైద్యశాలలను, పాఠశాలలను, సత్రములను, మురికినీళ్లకాలువలను, నూతులను, కోనేళ్లను ఈ మొదలగు మంచిపనులను జేసి, సంవత్సర మాద్యంతము వానిని తనిఖీచేయుచుండి, కఱవుకాలములందు బీదలు జీవించుటకై పను లేర్పఱచి, వైద్యశాలలకును, టీకాలు వేయించుటకును ననుకూలములైన యేర్పాటులఁ జేయుచున్నారు.

ఈ క్రిందఁజూపినస్టేట్‌మెంటు 1901-వ సంవత్సరమున నున్న జిల్లాబోర్డులసంఖ్యను దెలుపుచున్నది.

| వివరము. | సంఖ్య. |
|---|---|
| బోర్డులు ... ... ... | 1,073 |
| జనసంఖ్య ... ... ... | 19,33,00,005 |
| మెంబర్లు ... ... ... | 15,648 |
| జనులచేఁ గోరుకొనఁబడిన మెంబర్లు ... | 5,216 |

సముద్రతీరమునం దుండు కొన్ని పట్టణములం దోడ రేవులవిచారణకయి పోర్టుట్రస్ట్ (Port Trust) అనఁబడు సభ లేర్పఱుపఁబడినవి. ఇవి మొదట 1860-వ సంవత్సరమున స్థాపింపఁబడినవి. ఈసభయం దైరోపియనులును, స్వదేశీయులు నగుకొందఱు సభ్యులును, ఇద్దరు ముగ్గురు సర్కారుద్యోగస్థులును నుందురు. వారు ఓడలు మరమ్మతుచేయుస్థలములకును, ఎగుమతి దిగుమతులకై వచ్చు సరకులను దింపుతావులఁ గనఁబఱచుటకును, దీపగృహములను తనిఖీచేయుచుండుటకును, రేవుమొగములలో దిగునోడలకుఁ దావు చూపుటకును, రేవులను గాపాడు భటులపైతనిఖీ చేయుటకును, ఈ మొదలగు కార్యములను జేయుటకు నధికారము వహించియున్నారు. అయి

నను, గవర్నమెంటువారియనుమతి నొందక, యప్పు తీయుటకును, పన్నులు విధించుటకును, గొప్పపనులు ప్రారంభించుటకును వారికి నధికారము లేదు. ఇట్టి గొప్ప యోడరేవులు కలకత్తా, బొంబాయి, మద్రాస్, కరాచి మొదలగు గొప్పపట్టణములం దున్నవి. అచ్చట నోడ లకుఁ గావలసినయన్నియుపకరణములు సర్వసిద్ధముగ నున్నవి.

ఇవ్విధముగా జనులనే యచ్చటచ్చటఁ బనులను జూచుకొనున ట్లేర్పాటుచేయుటచేతఁ బ్రభుత్వమువారికిని జనులకును గలిగెడి శ్రేయస్సు లనేకము లున్నవి. ఆ యాప్రదేశములలోనుండు నక్కఱలును, కొఱఁతలును నా యా ప్రదేశములలో నుండుజనులకే బాగుగాఁ దెలిసి యుండవచ్చును. మఱియు ద్రవ్యవ్యయముచేయువిషయ మున దొరతనమువారికంటె, నగరవాస్తవ్యులును, మునిసి పాలిటీయధికారులును మిగులఁ బూనికయుఁ బొదుపును జూపించి రాజ్యపరిపాలనవిషయమున బుద్ధికౌశల్యమును జూపి, నానావిధములుగా దొరతనమువారికిఁ దోడ్పడు దురు. మన యొకనగరముయొక్క పరిపాలనమునందలి కష్టసుఖముల నెఱిఁగితిమేని యొకనగరమునకే యిటు లుండ నొక గొప్పదేశము నేలునట్టి దొరతనమువారి కెంతకష్ట ముండునో యని బాగుగా నెఱుఁగఁగలము. అట్లెఱిఁగిన

పిదప మనము వారియెడ నెక్కువ ప్రేమను జూపఁగలుగుదుము. ఇట్టి యధికారమును జనుల కొసఁగియుండుటచేత నుత్సాహమును వివేకమును గల మనుజు లీదేశవాసులకుఁ బలుతెఱఁగుల శ్రేయస్కరము లగుమార్గములను దెలిసికొని వారికిఁ బనులందుఁ దోడ్పడుచున్నారు. జనులు తమ కొసఁగిననగరపరిపాలనకార్యము నెంతెంత బాగుగా జరుపుదురో, అంత కంతకు జనులు పరిపాలనమునందుఁ బైయధికారములకును, స్వాతంత్ర్యమునకును నర్హత గలవారగుదురు.

198

# మూడవభాగము.

## 17. మాగాణపరిపాలనము.

గ్రామాధికారులును, జిల్లాఅధికారులును—జిల్లా కంతకును పెద్ద కలెక్టరు—వీరికిఁ బైయధికారులు ఫలానివారనఁబడునది—గవర్నరు, వారిసభ్యులును — శాసననిర్మాణసభాస్వరూపము — దానియధికారములును, పనులును—ఆ సభవలన జనులకుఁ గలిగెడు మేలులు.

ప్రభుత్వమువారివలన మనము పొందెడు లాభములనుగూర్చియు, వారికి మనము చేసెడి ప్రత్యుపకారములనుగూర్చియు నింతపర్యంతము చెప్పఁబడినది. ఈయుపకారములను దొరతనమువారు మన కే సాధనములమూలమునఁ జేయుచున్నారని తెలియుట యావశ్యకముగదా. వేలకొలఁదియధికారులను, పనివాండ్రను నియమించి మనకుఁ గావలసినయుపకారములను జేయుచున్నారు. గ్రామములందు కరణము, పెద్దకాఁపు, కావలివాఁడు, తోటి, వెట్టి, తలారి మొదలగుపనివారిని, తాలూకాలలో వారికిఁ బైఁబడినయధికారులను, జిల్లాలలో తాలూకాయధికారులకంటె గొప్ప యధికారులను బ్రభుత్వమువారు నియమించియున్నారు. జిల్లాపట్టణమునం దుండు

గొప్పయధికారికి **కలెక్టర్** (Collector) అని పేరు. జిల్లాను ఒకచిన్నరాజ్యముతోఁ బోల్పవచ్చును. ఈ చిన్నరాజ్యమునకు రాజు కలెక్టరే. ప్రభుత్వముయొక్క యంగములన్నిటిని జిల్లాయందుఁ జూడవచ్చును. హిందూదేశము నంతటిని **250** జిల్లాలుగా విభజించి, తగినయధికారులను నియమించి ప్రభువులు రాజ్యపాలనము సేయుచున్నారు. ఇంచుమించుగా నొక్కొక్కజిల్లాయొక్క విస్తీర్ణము 4,500 చదరపుమైళ్లును, జనసంఖ్య లక్షయు నుండవచ్చును.

లక్షలసంఖ్య గల జనులను గాపాడుటకై యేర్పడిన యధికారులకు ఉత్సాహము, సన్మార్గము, తెలివితేటలు, దయ, ధైర్యము, స్థైర్యము, సత్యవాక్యపరిపాలనము మొదలగుసద్గుణము లవశ్యముగా నుండవలయునుగదా. కావుఁ బట్టి యింగ్లాండుదేశమునం దేర్పఱచియుండు **ఇండియన్ సివిల్ సర్వీస్** (Indian Civil Service) అనుపరీక్షయందుఁ దేఱి, పైఁజెప్పిన గుణము లన్నింటితో లెస్సగాఁ గూడియుండి, జిల్లాయిలాకాపనులలో మంచినేర్పును, అనుభవమును గలవారే కలెక్టరులుగా నియమింపఁబడుచున్నారు. పౌరులనుండి పన్ను వసూలుచేయుటయు, న్యాయాధిపత్యము నొంది జనులదోషముల విచారించుటయు, దక్షతలేని గొప్పకుటుంబపుఁబసివారియొక్క యాస్తిని దమ

స్వాధీనతలో నుంచికొని, యా పసివారికి యుక్తవయస్సు వచ్చినపిదప, వారివశమున నా యాస్తి నొప్పగించుటయు, జనులకొఱఁతలఁ గనుఁగొని వారికిఁ గావలసిన మేలులు చేయుటయు వీరియొక్క ముఖ్యవిధులుగా నున్నవి.

చెన్నపురిమాగాణమునందు జిల్లాదొరతనమునకుఁ బైఁబడినది మాగాణదొరతనము. కొన్ని మాగాణముల యందు నాలుగైదుజిల్లాల నొక గొప్పభాగము (Division) చేసి, కమీషనర్ (Commissioner) అనునధికారిని దానికిఁ బెద్దనుగా నియమించియున్నారు.

చెన్నపురిమాగాణమునకుఁ బెద్దయధికారి గవర్నర్ అనఁబడుదురు. వారికి మంత్రులు (Councillors) ముగ్గురు. వీరు నలుగురును 5 ఏండ్లకాలము అధికారము వహించునట్లు చక్రవర్తిగారిచే నియమింపఁబడుదురు. హిందూదేశమునఁ దత్పూర్వ మొకపనియుఁ జూడనియాంగ్లేయులే గవర్నరులుగా నియమింపఁబడి యింగ్లాండునుండి వచ్చుచున్నారు. అయినను మంత్రులలో నిరువు రీ దేశముననే జిల్లాకలెక్టరులుగా నుండి ప్రసిద్ధివడసిన యనుభవపరులగు నాంగ్లేయులై యుందురు. ఒకరు మాత్రము క్రొత్త చట్టముప్రకారము ఘనత కెక్కిన ఇండియాదేశస్థులుగా నుందురు. గవర్నరుగారును, వారిమంత్రులు ముప్వురును అన్ని శాఖలను తమలోపల నొకవిధముగా విభజించికొని,

మాగాణప్రభుత్వమును నెఱవేర్చుచున్నారు. ఏదైన నొక విషయమున నొకరికి సంశయము గలిగెనేని, ఆసంశయమును బ్రతివారమునను గూడెడు నాలోచనసభలోఁ దక్కినవారితో నాలోచించి వారు తమసంశయములను దీర్చికొందురు. ఇట్లేటఁగుననే బొంబాయిమాగాణమునను బ్రభుత్వము జరుగుచున్నది. తక్కినమాగాణములందుఁ బెద్దయధికారులు (గవర్నరులు) ఇండియాగవర్నమెంటువారిచే నియమింపఁబడుచున్నారే కాని, చక్రవర్తిగారిచే నియమింపఁబడుట లేదు. అయినను రాజ్యపరిపాలనక్రమ మివ్విధముననే జరుగుచున్నది. కొన్ని మాగాణములలో నున్న ప్రధానాధికారులకు 'లెఫ్టినెంట్ గవర్నరులు' అని పేరు.

ఆంగ్లేయప్రభుత్వమునకు లోఁబడిన హిందూదేశము 8 గొప్పమాగాణములుగాను, 5 చిన్నమాగాణములుగాను విభజింపఁబడియున్నది. గవర్నరులకు లోఁబడినవి చెన్నపురిరాజధాని, బొంబాయిరాజధానియు, లెఫ్టినెంటుగవర్నరులకు లోఁబడినవి బంగాళము, అయోధ్య ఆగ్రా చేరిన భాగము, పంజాబు, బర్మా, క్రిందిబంగాళము ననునవియు, చీఫ్ కమీషనరునకు లోఁబడిన మధ్యమాగాణములును గొప్పమాగాణములుగా నున్నవి. పశ్చిమోత్తరపరగాణాలు, బ్రిటిష్ బెలూచీస్థానము, అజమీరము, కొడగు,

మీార్వారా, అండమానుదీవులు అను నీ వైదును జిన్న మాగాణములు. లెఫ్టినెంట్ గవర్నరులును కొంచెమెచ్చు తక్కువగా గవర్నరుల కుండునంతయధికారమును గౌరవమును గలవారై యున్నారు. గవర్నరు లుండుచోట్ల మంత్రాలోచన సభలును, శాసననిర్మాణసభలును నున్నవి. అయినను, లెఫ్టినెంటుగవర్నరు లుండుతావులలో శాసన నిర్మాణసభమాత్ర మేర్పఱుపఁబడియున్నది.

జనులయభిప్రాయము లెఱుఁగకయు, వారిలో శ్రేష్ఠులైనవారితో యోచన చేయకయు దొరతనమువారు చట్టము లేర్పాటుచేయుట లేదు. ప్రాఁతచట్టములను సవరణచేయుటకును, క్రొత్తచట్టములను ప్రవేశపెట్టుటకును జెన్నరాజధానియందు శాసననిర్మాణసభ యేర్పడియున్నది. ఈసభకు 1909-వ సంవత్సరమువఱకును గవర్నరును, వారిమంత్రు లిరువురును, అడ్వొకేటుజనరల్ అనువారును, దొరతనమువారియధికారులు తొమ్మండ్రుగురును, దొరతనమువారియుద్యోగములలో నుండనివారు పదునొక్కండుగురును సభ్యులుగా నేర్పడియుండిరి. ఈ యితరసభ్యులలోఁ బదునొక్కండ్రలో నలుగురు దొరతనమువారిచేతను, తక్కినవారు మాగాణములలో నుండు ననేకసభలవారిచేతను నియమింపఁబడుచుండిరి. అయినను, సభవారియొక్క నియమనములను దొరతనమువా



బొంబాయి సెక్రిటేరియట్, లేక గవర్నరుసహాయాధికారుల ఆఫీసు.

రంగీకరింపవలసియుండెను. నగరపరిపాలనసభవారును జిల్లాసభవారును (Municipalities and District Boards) గలిసి నలుగురు ప్రతినిధులను, చెన్నపురిసర్వకలాసంఘము వారు (University) ఒకరిని, చెన్నపురినగరపరిపాలకసభ వారు (Corporation of Madras) ఒకరిని, చెన్నపురివర్తక సంఘమువారు (Chamber of Commerce) ఒకరిని బాగుగఁ బరిశీలించి నియమించుచుండిరి. దొరతనమువారియధి కారులగుసభ్యులు దొరతనమువారిచేతనే నియమింపఁబడు చుండిరి. జనప్రతినిధులమూలమున జనులమనోరథము లను, గోరికలను బాగుగాఁ దెలిసికొనియే కట్టుదిట్టముల నేర్పఱపవలయు ననుతలంపు 1861-వ సంవత్సరమునఁ బుట్టినది. అదిమొదలుకొని జనప్రతినిధులను దొరతన మువారిసభలలో నధికముగాఁ జేర్చుకొన నారంభించిరి. దీనినిమిత్తమే, యిప్పుడు రాజ్యభారము వహించియుండు వారును, ఇండియాప్రభుత్వమువారిప్రథమకార్యదర్శియు నైన జాన్ మార్లేప్రభువు (John Morley) గారు హిందూ దేశపరిపాలనమున ననేకములగు సవరణలు చేయవలయు ననియు, వానిలో ముఖ్యముగా జనులయభిప్రాయము లను దెలియఁజేయఁదగినప్రజాప్రతినిధుల నన్నిసభలలోను హెచ్చుగా నియమింపవలయు ననియు నభిప్రాయపడిరి. వారీ విషయమును గూర్చి యిండియాలోని నానా

రాజ్యాంగములవారితో నాలోచించిరి. ఇప్పుడు వారి యాలోచన లవతారమెత్తినవో యనునట్లు ప్రకటితము లయినవి. ఇంచుమించుగా మూడుసంవత్సరములకాలము, నెమ్మదియు వివేకమును గల యనేకసంఘములతోను నానాజాతులవారియుద్దేశములను బాగుగఁ దెలియఁజేయ శక్తి గల పెద్దలతోను గలిసి యోచించి, వారియభిప్రాయములను దెలిసికొనియె, ఇండియాగవర్నమెంటువారును, ఇండియాకార్యదర్శియుఁ గడచిన 1909-వ సంవత్సరము నవంబరునెల 15-వ తేదియందు శాసననిర్మాణసభలను దృఢపఱచుటకై యిండియన్ కౌన్సిల్స్ ఆక్టు (Indian Councils Act) అనుచట్టమును నిర్మించి ప్రచురించియున్నారు.

ఇంతవఱకును శాసననిర్మాణసభలయందు దొరతనము వారి యుద్యోగస్థులే హెచ్చుగను, తక్కినవారు తక్కువగను నుండిరి. క్రొత్తయేర్పాటుప్రకారము మాగాణ శాసననిర్మాణసభలయందు సర్కారుద్యోగులసంఖ్య తక్కువగను, సర్కారుద్యోగములలో లేనివారిసంఖ్య హెచ్చుగను నగుచున్నది. సార్వభౌమిక (గవర్నర్ జనరల్‌గారి) శాసననిర్మాణసభయందు మాత్రము సర్కారుద్యోగుల సంఖ్య హెచ్చుగానే యుండును. అంతియకాక, అనేక వృత్తులవారు, గొప్పధనికులు, మహమ్మదీయులు, హిందూ

దేశప్రవర్తకులు, ఐరోపాదేశప్రవర్తకులు మొదలగు జనుల కోఱికలను, నభిప్రాయములను దెలుపుటకై వారివారి ప్రతినిధులను నూతనశాసననిర్మాణసభలయందు సభ్యుల నుగాఁ జేయుట కొకచట్టము నేర్పఱచియున్నారు. ఈ సభ్యులను మూఁడుసంవత్సరముల కొకపర్యాయము జనులు నియమించికొందురు.

ఈ క్రిందఁ గనఁబఱచినపట్టీవలన శాసననిర్మాణసభల యొక్క స్వరూపము దెలియును:—

| మాగాణము. | | సర్కారు ఉద్యోగస్థులు. | సర్కారు ఉద్యోగమున నుండనివారు. | మొత్తము. |
|---|---|---|---|---|
| చెన్నపురి. | ... | 19 | 25 | 44 |
| బొంబాయి. | ... | 17 | 28 | 45 |
| బంగాళము. | ... | 17 | 31 | 48 |
| యునైటెడ్ ప్రావెన్సు. | ... | 20 | 26 | 46 |
| తూర్పుబంగాళము. | ... | 17 | 23 | 40 |
| పంజాబు. | ... | 10 | 14 | 24 |
| బర్మా. | ... | 6 | 9 | 15 |

ఆ యా సభయందలి ప్రధానాధికారియు, మంత్రాలోచనసభ్యులును నీ సభలలో సభ్యులుగాఁ జేరుదురు.

సార్వభౌమిక (గవర్నరు జనరల్‌గారి) సభ యీ క్రింది చొప్పున నమర్పఁబడును:—

## ఇండియా గవర్నమెంట్ శాసననిర్మాణసభ.

| | |
|---|---|
| గవర్నర్ జనరల్ ........................ | 1 |
| మంత్రాలోచన సభ్యులు..................... | 7 |
| ఆంగికరాజ్యప్రతినిధులు...................... | 8 |
| 20 మందికంటెఁ హెచ్చుబడకుండులాగున నియమింపఁబడిన సభ్యులు..................... | 28 |
| జనులప్రతినిధులు (జనులచే నెన్నుకోఁబడినవారు)....... .................. | 25 |
| మొత్తము | 69 |

అన్ని శాసననిర్మాణసభలును గొంచె మెచ్చుతక్కువగా నేకరీతినే నిర్మింపఁబడియున్నందునఁ జెన్నపురిలోని శాసననిర్మాణసభాపద్ధతిమాత్రమే క్రిందఁ జూపఁబడియున్నది.

## చెన్ననగరీయశాసననిర్మాణసభ.

### రాజకీయోద్యోగులు.

| | |
|---|---|
| గవర్నరు............................ | 1 |
| మంత్రాలోచనసభ్యులు..................... | 3 |
| అడ్వొకేట్ జనరల్....................... | 1 |

| | |
|---|---|
| 16 ఉద్యోగస్థులకుఁ బైఁబడకుండునట్లు సర్కారు వారివలన నియమనమును బొందినవారు. | 23 |
| నిపుణులు (Experts)........................ | 2 |

జనులచే నెన్నుకోఁబడినవారు.

| | | |
|---|---|---|
| 1. చెన్నపురినగరనిర్వాహకసభవారివలన (Corporation)................ | 1 | 19 |
| 2. ఇతరనగరనిర్వాహకసభలవలనను, బోర్డువారివలనను................ | 8 | |
| 3. సర్వకళాసభవారివలన............ | 1 | |
| 4. రైతులవలన.................. | 4 | |
| 5. కాఫీ, తేయాకు పైరుపెట్టు యజమానులవలన................ | 1 | |
| 6. మహమ్మదీయులవలన.............. | 2 | |
| 7. చెన్నపురివర్తకసంఘమువారివలన (by the Chamber of Commerce)... | 1 | |
| 8. చెన్నపురి వర్తకసంఘములవలన (Trades Association)............... | 1 | |
| మొత్తము. | 49 | |

ప్రాంతయేర్పాటులచొప్పున శాసననిర్మాణసభలలో నన్నింటిలోను మొత్తము 126 మంది సభ్యులుమాత్ర.

ముండిరి. ఇప్పుడు నూతననిబంధనలప్రకారము 370 మంది సభ్యు లేర్పడిరి.

వీరిలోపల జనులచేతను, సంఘములవారిచేతను నెన్నుకొనఁబడి నియమనము నందినవారు 135 మంది. అంతియ కాక యింతపర్యంతము జనులచేత నియమింపఁబడువారు దొరతనమువారిచే నామోదింపఁబడినతరువాత నే సభ్యులుగా నేర్పడవలసియుండినది. ఇప్పుడో జనులచే నెన్నుకొనఁబడిన వెంటనే జనప్రతినిధులుగా సభలయందుఁ జొచ్చి కూర్చుండఁదగినయధికారమును వీరు బొందియున్నారు. ఇంకను జనప్రతినిధులగు సభ్యులు చట్టములి నిరూపించు విషయమమాత్రమె కాక, సాధారణముగా రాజ్యపరిపాలన క్రమమునుగూర్చియు, రాజ్యాంగముయొక్క యాదాయ వ్యయములవివరములఁగూర్చియు, పన్నులయాధారములనుగూర్చియుఁ జక్కఁగా విచారించుటకును, లోపాలోపముల నెఱిఁగించుటకును, తగినయోచనలఁ జెప్పుటకును ...తనశాసనమువలన నధికారము నొందియున్నారు.

... పరలోకాంతర్గతులయిన విక్టోరియారాణియొక్క... ను, ఆమెపుత్రరత్నమగు నెడ్వర్డుచక్రవర్తి ...మును, మననూతనచక్రవర్తియగు ...వమును క్రమక్రమముగా వృద్ధి ...నందలి నానాజాతులవారికి

నానందాతిశయమును గలిగించు ననియే మనము నమ్మి యుండుట యుక్తము.

పైఁజెప్పినశాసననిర్మాణసభలలో శాసనముల నిర్మించుట మాత్రమెకాక, రాజ్యాంగమువారియాదాయవ్యయముల పట్టీలను (Budget) గూర్చి విచారించి, తమయభిప్రాయములను వివరించుటకును, మతము, పన్నులు, సేనలు, తక్కిన దొరతనమువారికిని ఇండిమాదొరతనమువారికిని గల వ్యవహారములు మొదలగువిషయములు తప్పఁ దక్కినవిషయములను గూర్చి ప్రశ్నలడుగుటకును సభ్యుల కధికారము గలదు. ఈ కారణమునుబట్టియే ప్రజలప్రతినిధులు జనులయొక్క తలంపులను, కోరికలను దొరతనమువారికిఁ దెలిపించి, రాజ్యపరిపాలనము చక్కఁగా జరుగునట్లు చేయుదురు. ఇవ్విధముగాఁ బ్రభుత్వమువారు వివిధోపాయముల చేత జనులకోఱఁతలను నివారించి, వారిప్రేమకుఁ బాత్రులగుటచేత, నాంగ్లేయప్రభుత్వము శాశ్వతమై యుండ ననుట కేమాత్రమును సందియ ముండదు.

# 18. దేశపరిపాలనము.

గవర్నరుజనరలును, వారిమంత్రాలోచనసభయు — రాజ్యాంగ విభాగములు — శాసననిర్మాణసభానిర్మాణము — మంత్రాలోచనసభవారి యధికారములు— దేశాధిపతుల కొసంగియుండు నధికారములును, స్వాతంత్ర్యమును.

ఈదేశము 13 మాగాణములుగా విభజింపఁబడి ప్రత్యేకప్రత్యేకరాజ్యాంగమువారిచేఁ బరిపాలింపఁబడుచున్నదని ముందటియధ్యాయమునఁ జెప్పఁబడినది. మాగాణములపరిపాలనములను బైవిచారణచేయుటకును, అన్నియంతర్గతరాజ్యాంగపరిపాలన లించుమించుగా నేకరీతిగను, బాగుగాను నడచునట్లు చూచుటకును, ఈ దేశమునకును నన్యదేశములకును సామాన్యమగు విషయములను తెలిసికొనుచుండుటకును నొక దేశాధిపతి యుండవలసినది యావశ్యకము కదా! కాఁబట్టి విశాలమైన యీ దేశమును బాలించుటకై యైదుసంవత్సరముల కొకపర్యాయము ఆంగ్లేయఘను లొక్కరు చక్రవర్తిచే రాజప్రతినిధిగా నియమింపఁబడి యీ దేశమునకు నింగ్లాండునుండి వచ్చుచున్నారు. వారికి **గవర్నర్‌జనరల్** అని పేరు. ఈ దేశపరిపాలనవిషయమున నేర్పరులయిన యాఱుగురు ఘనులు వారికి యోచనాసహాయులుగా నైదుసంవత్సరముల కొక

తూరి చక్రవర్తిగారిచే నియమింపఁబడుచున్నారు. వీ రాఱుగురు చేరినసభకు **మంత్రాలోచనసభ** యని పేరు. ఈ దేశపుఁబ్రధానసేనాధిపతియు నీ సభలో నొకసభ్యుఁడుగా నుండును.

ఇండియారాజ్యపరిపాలనము 10 శాఖలుగా విభజింపఁబడియున్నది. ఒక్కొక్కశాఖకును నొక్కొక్కకార్యదర్శిని నియమించి, గవర్నరుజనరలును, వారియాలోచనసభ్యులును దామే యొక్కొక్క శాఖకుఁ దగినపనులను జరిపించుచున్నారు. ఆ 10 శాఖ లేవనఁగా:—

1. ఇతరరాజ్యాంగవిచారణశాఖ. (Foreign Department)
2. ఇండియాకు సంబంధించినదిగా నింగ్లాండులో జరిగెడురాజ్యపరిపాలనశాఖ. (Home Department)
3. వ్యవసాయముయొక్కయు, పన్నులయొక్కయు శాఖ. (Department of Revenue and Agriculture)
4. బొక్కసములశాఖ. (Finance Department)
5. వర్తకము, చేతిపనులు, వీని శాఖ. (Department of Commerce and Industry)

6. శాసననిర్మాణములశాఖ. (Legislative Department)
7. జనసామాన్యోపయుక్తములగు కట్టడముల నిర్మించుశాఖ. (Public Works Department)
8. సైన్యములశాఖ. (Army Department)
9. సైన్యసామగ్రీసంపాదనశాఖ. (Military Supply Department)
10. విద్యావిచారణశాఖ. (Educational Department)

ఈ దేశమునం దాంగ్లేయులపరిపాలనమునకు లోఁబడిన తావులందు వసించెడి యందఱు జనులను, వారిపరిపాలనమునకు లోఁబడనితావులందు వాసముచేసెడి హిందువులను, స్వదేశరాజ్యములందు (Native States) వసించెడి యాంగ్లేయులనుగూర్చి శాసననిర్మాణసభయందుఁ జట్టము లేర్పఱుపఁబడుచున్నవి. దీనినిమిత్తమే మంత్రాలోచనసభ శాసననిర్మాణసభగా మాఱుటయే కాక, 16 గురు క్రొత్త సభ్యులను సహాయులనుగాఁ గలిగియుండెను. వీరిలోపల 8 మంది సభ్యులైనను సర్కారుద్యోగములేనివారుగా నుండవలయుననియు, ఈ యెనమండ్రుగురిలోపల నలుగురిని చెన్నపురి, బొంబాయి, కలకత్తా, అలహాబాదు అను మాగాణములం దుండు శాసననిర్మాణసభవారిలో సర్కారుద్యో

గములలో లేనివారును, ఒకరిని కలకత్తావర్తకసంఘము వారును నియమింపవలయు నని విధి యేర్పడియుండెను. తక్కినవారి నందఱిని గవర్నరుజనరలుగారే తమయిష్టాను సారముగ నియమించుకొనుచువచ్చిరి. ఇప్పుడు నూతన యిండియాకౌన్సిల్ చట్టముప్రకారము ముందు చెప్పినరీతిగా నీ సభ యేర్పఱుపఁబడియున్నది.

గవర్నరుజనరలుగారును, వారియాలోచనసభ్యు లాఱుగురును నీదేశమునకుఁ బ్రధాను లని చెప్పవలెను. రాజ్యపరిపాలనవిషయము లన్నియు వీరిపేరితోనే ప్రచు రింపఁబడుచున్నవి. ఈదేశముయొక్క ప్రభుత్వమునకు సంబంధించిన విషయముల నన్నిటిని, ఈదేశమునకును నితర దేశములకును గల వృత్తాంతములను శాసననిర్మాణము నకుఁ గావలసిన యాధారములను విచారించుటకై కొన్ని దినముల కొకపర్యాయము వీ రందఱు గూడి యోచన చేయుదురు. ముందు గుర్తించిన కొన్నిదినములలో మం త్రాలోచనసభవారి నడుగకయే గవర్నరుజనరలుగారే తీర్పులను చేయవచ్చును.

ఇంగ్లాండునం దీదేశపుఁగార్యదర్శిగా నుండువారు గూడ పైఁజెప్పినప్రధానులయధికారమునందుఁ బ్రవేశిం చుట లేదు. ఇండియాప్రభుత్వమువారికిఁ గావలసినంత స్వాతంత్ర్య మియ్యఁబడియున్నది. హిందువు లీ ప్రకా

రము నడచుకొనవలయు నని యింగ్లాండు దేశములో నుం డువా రిక్కడ నుండునధికారుల కెప్పుడు నాజ్ఞాపించుట లేదు. గవర్నరుజనరలు అడిగినప్పుడు మాత్రము సీమ యం దుండుకార్యదర్శిగారు తమయభిప్రాయములను బయలుపఱతురు. ఈదేశమున నుండునధికారులయెడ నిట్టియపార మయిన నమ్మిక యుంచుట యెన్నటికిని నపా యకరము గాదు. మన మొకని కొక కష్టమైనపని యొ సంగి మాటిమాటికి నడుగుచు వచ్చినయెడల, నది గందర గోళమై పోవును. ఆ పని చేయువానికిని దానియందుఁ బూనికయు, నుత్సాహమును దగ్గును. కాఁబట్టి సీమయం దుండువా రీ దేశముయొక్క పరిపాలనము వహించియుండు నధికారులమీఁద నెంతవఱకు నమ్మిక యుంచి, వారు చేయుపనులలోఁ దలఁ దూర్పక యుందురో, దానిపరిమితి కానుగుణ్యముగ రాజ్యపరిపాలనవిషయము చక్కఁగా నడచుటయే కాక, జనులకు వారియెడ ననురాగమును, మర్యాదయు హెచ్చుచుండును. ఈ దేశము సీమలోని వారికి శ్రేష్ఠమయిన మూలధనముగా నుండుటంబట్టి, వారిచే నంపఁబడునధికారులును నీ దేశమునకు మేలును దమదేశమునకుఁ గీర్తిని నభివృద్ధిచేయువారుగా నుండవలెను.



## 19. ఇంగ్లాండునందు నడచు నిండియా రాజ్యపరిపాలనము.

---

ఇండియాకార్యదర్శియు, వారికి సహాయమైన మంత్రాలోచన సభయు—వారికిని చక్రవర్తికినిగల సంబంధము — ఆంగ్లేయరాజులయెడ నీదేశమువారికిఁ గల ప్రేమయు, తత్కారణమును--ఈప్రేమను గనఁబఱచెడి చిహ్నములు.

ఈ దేశ మాంగ్లేయులకు ముఖ్యమయినది యని యందఱెఱేఁగియుండవచ్చును. ఈరాజ్యమునకు శ్రేయోమార్గాన్వేషణమునకును, పైవిచారణ నడపించుటకును, నిచ్చటి సంగతు లున్నవియున్నట్లు తెలిసికొని యాంగ్లేయప్రభుత్వమువారికిఁ దెలిపించుటకును సీమయందే కొంద ఱధికారు లుండుట యావశ్యకము గనుక సెక్రెటరీ ఆఫ స్టేట్ (Secretary of State) అను కార్యదర్శి నింగ్లాండుదేశ ప్రధానమంత్రిగారు నియమించియున్నారు. వీరికచ్చేరీ లండన్‌మహానగరమున నున్నది. దీనికి ఇండియాఆఫీసు (India Office) అని పేరు. చక్రవర్తిగారిమంత్రులలోపల నిండియాలోనికార్యములను గమనించువారును, ఈ దేశ వర్తమానముల నాంగ్లేయులకుఁ దెలియఁజెప్పువారును వీరే. వీరితోడ్పాటుకై 15 గురికిఁ బైఁబడనిప్రభువులు గల మంత్రాలోచనసభ యొక్కటి యున్నది. ఈ సభ

యందు సభ్యులుగా నుండువారు మనదేశమునఁ బదేండ్లకుఁ బైన వసించి, యిచ్చటి సంగతులలో మంచియనుభవము గలవారుగా నున్నారు. ఇప్పు డిండియాకార్యదర్శిగా నుండు వా రగు జాన్ మార్లే (John Morley) ప్రభువుగారు పైఁజెప్పినసభయం దిద్దఱు హిందూదేశస్థు లగుఘనులను సభ్యులనుగా నియమించియున్నారు. ఈ ఘను లిరువురు, తమ్ము నడిగెడి విషయములలోఁ దమయభిప్రాయము లొసఁగుటకును, కార్యదర్శిగా రొసఁగెడుపనులను జేయుటకును నధికారము గలిగియున్నారేకాని, వారు స్వయముగా నేపనినైనను జేయ నధికారులు గారు. అయినను, వీరియనుమతి లేక కార్యదర్శిగారు రాజ్యవ్యయములను జేయఁజాలరు. అంతరంగమునఁ జేయవలసినరాజనీతిక్రమములందు వీరియెఱుక లేకయే యేకార్యమునైనను గార్యదర్శియే పూర్తిచేయవచ్చును. ఇండియాకార్యదర్శిని, ఆంగ్లేయప్రభుత్వమునకుఁ బ్రధానులైన చక్రవర్తిగారికిని, జనప్రతినిధిసభవారికిని (Parliament) లోఁబడిన యధికారినిగా నెంచవలెను. వీరు తమవశమునసప్పగించిన రాజ్యముయొక్క యోగక్షేమములనుగూర్చి పైఁజెప్పిన పైయధికారులకు మాత్ర ముత్తరము చెప్పఁగలవారై యుండవలెను. ఆంగ్లేయులకు నమ్మఁదగిన ప్రతినిధులలో వృద్ధుఁడయిన యొకఘనునిఁ బ్రధానమంత్రిని (Prime Minister) గా

ఇంగ్లాండురాజుగారు నియమించుచున్నారు. వీరు తమకు లోఁబడిన రాజ్యాంగశాఖలను విచారించుటకును, రాజ్య నిర్వాహణకార్యమునందుఁ దమకు సహాయముచేయుటె కును జనప్రతినిధులలోఁ దమకు సరియైనవారిని కొందఱిని ఉపమంత్రులనుగా నియమించుకొందురు. ప్రధానమంత్రియు నుపమంత్రులునుజేరిన సభకు కాబినెట్ (Cabinet) అని పేరు. ఈ సభయం దిండియాకార్యదర్శిగా రొక సభ్యులు. పార్లమెంటునందు జనప్రతినిధులచే నడుగఁ బడెడి ప్రశ్నల కెల్ల వీ రుత్తరములు చెప్పి, ఇండియాపరిపాలనసంబంధమగు నాదాయవ్యయములను గూర్చినవిషయము (Budget) వా రంగీకరించునట్లు చేయుటయే కాక, ఈ దేశమునందలిశాసననిర్మాణసభలలోఁ జేయఁబడుతీర్మానములకుఁ దమసమ్మతము నొసంగి, యాంగ్లేయ జనులయొక్క యభిప్రాయములతో నేకీభవింపవలయును. కాఁబట్టి యీదేశపుఁజక్రవర్తి యయినయాంగ్లేయరాజు, వారికి సహాయులుగా నుండుపార్లమెంటుసభవారుమామంత్రియు నీ దేశమునందు నడచెడుసర్వాధికారములకును న్యాయమునకును బాధ్యపడినవా రని చెప్పవచ్చును.

ఈదేశప్రభుత్వవిషయములం దొక ... యైనను దెలియనివారికిఁ గూడ గతించినచ ... పేరును, కొన్ని దినములక్రిందట గతించిన ... పేరును, బాగు

గాఁ దెలిసియుండవచ్చును. ఆంగ్లేయులకుటుంబములం దీ దేశస్థుల కుండు భక్తియు, మర్యాదయు మితిమీఱినవి.



విక్టోరియామహారాణి.

రాజవిశ్వాసమనునదేయీ దేశవాసులకుఁ బ్రప్రథమ మయినగుణముగా నున్నది. రాజు జనులకు భృత్యుఁడనియు, ఆతఁడు ప్రజలకార్యనిర్వాహణవిషయమున నక్కఱ గలిగియుండునంతవఱకే యాతనిని మన్నన చేయవలెననియు నీ దేశస్థులెన్నఁడునుతలంపఁజాలరు. మనక్షేమమునిమిత్తమే భగవంతుఁ డొక్కనిని నృపాలునిగా నియమించుచున్నాఁడనుట మనవారియభిప్రాయము. మనదేశమాంగ్లేయులప్రభుత్వమునకులోఁబడినది మొదలు, ఈ దేశస్థులపై నాంగ్లేయప్రభువులు ప్రేమను గనఁబఱచి, రాజ్యమునుబలపఱచి, దేశస్థుల కభయహస్తమునిచ్చి పలు విధముల మే[illegible] చేయుచుండుటవలన, నీ దేశవాసు లాంగ్లేయరాజకు[illegible]ాఁద భక్తి గలిగి యుండుట యొక వింత మైనస[illegible]ంచిన విక్టోరియామహారాణి

గారిరాజ్యపరిపాలనమే యిట్టిరాజభక్తికిఁ గారణ మని చెప్ప వచ్చును. 1858-వ సంవత్సరమున నడచిన యుద్ధవీరుల (సిపాయీల)కలహమునకుఁ బిదప నిండియాను ఈ మహా రాణిగారు తమయధీనము చేసికొన్నప్పుడు, ఈదేశమున నుండిన కొందఱ ఆంగ్లేయులు, కలహకారకులై విశేష నష్ట మునకుఁ గారణభూతులయిన హిందువులను మొద లంట నాశముచేయవలయు నని యాజ్ఞ యొసఁగిరి. ఆసమయ మున నపారకారుణ్యనిధి యగు చక్రవర్తినిగారు, గొప్ప నీతిశాస్త్రములందుఁ జెప్పిన తెఱఁగున "విరోధులను బ్రేమచే జయింపవలెను" అను సామెత నవలంబించి, యాంగ్లేయుల వార్తలను బెడఁజెవిని బెట్టి, హిందువుల కభయ మొసఁగి, రాజ్యపరిపాలనవిషయమున, జాతివ్యత్యాసము గమనింపఁ బడదనియు, మతవిషయములందుఁ బ్రవేశించుట లేదని యు, ఏజాతివారికైనను, ఏమతమువారికైనను, ఏవంశమునఁ బుట్టినవారికైనను యోగ్యతకుఁ దగిన యుద్యోగము లియ్యఁ బడుననియు ఢిల్లీమహానగరమునఁ బ్రచురముచేయించిరి. అంతియకాక, యీ దేశపుసామంతరాజులు సీమకుఁ బోయినప్పుడు, వారిని బ్రేమతో గౌరవించి, ఇండియా దేశస్థులక్షేమలాభములను వారిమీఁదిప్రేమతో విచా రించి తెలిసికొని తమరాచనగరునందు సైతము గొన్ని యుద్యోగములలో మనదేశస్థులను నియమించి, పలు

తెలుఁగులుగా నీ దేశమువారిమీఁద నున్నప్రేమను గనఁబఱచుచుండిరి. ఆకారణముచేతనే 1901-వ సంవత్సరమున నీమహామాతగారు కాలధర్మము నొందినప్పుడు, ఆవును బోఁగొట్టుకొన్న దూడవలె నీ దేశస్థు లీమె యొక్క వియోగదుఃఖ మాఱకుండుటచే మిక్కిలి వగలపాలయి, యిట్టి గుణనిధియగు మహారాణి మన కెప్పుడు లభించు నని మిగులఁ జింతాక్రాంతులైయుండిరి. అయినను, వీరిపుత్త్రరత్న మగు ఎడ్వర్డుచక్రవర్తిగారు పట్టాభిషిక్తులైనపిదప, తల్లివలెనే రాజ్యభారము వహించి, పరదేశీయరాజులతో సమాధానముచేసికొని, 1876-వ సంవత్సరమునఁదామే సంచారము చేసి చూచివచ్చిన యీదేశమును బ్రేమతోఁ బాలించి, కడచిన 1908-వ సంవత్సరము డిసంబరునెలయందుఁ దమసువాక్యములచే నా మహారాణిగారివాగ్దానపత్త్రికను దృఢపఱచుటచేఁ బైఁజెప్పిన వ్యసనము తొలఁగినది. మఱియు, వీరి పుత్త్రరత్నమై



ఎడ్వర్డు చక్రవర్తిగారు.




యువరాజసంచారము 1875—1876.

పూర్వము యువరాజుగాను నుండి, ప్రకృతము చక్రవర్తి పదవినొందియున్న **అయిదవ ఎజ్వార్డ్** అనువారు 1906-వ సంవత్సరమున నీ దేశమంతయుఁ జుట్టి చూచి, జనులతో సంభాషించి, యీ దేశములోని వింతలనెల్ల దర్శించి కడపట నింగ్లాండుకుఁ బోయినపుడు, ఈదేశమువారిని 'ప్రేమ' యను పాశముచేతనే కట్టవలె నని చెప్పిరి. ఈ ప్రియవాక్య మీదేశమువారి కమృతమును బోలియున్నది. ఇత్తెఱఁగుననే యాంగ్లేయనృపాలు రీ దేశమువారిపై మితిమీఱిన ప్రేమను గనఁబఱచుచుండుటవలన, వారి కుటుంబములం దీదేశమువారికిఁ గల భక్తివిశ్వాసములును నానాట వృద్ధిచెందుచునే యున్నవి.

ఉత్తమపరిపాలనపద్ధతులకంటెను రాజుయొక్క సుగుణసంపదయందే యీదేశప్రజనులకు దృష్టి యెక్కువ. జనులే రాజ్యభారము వహించుట యనునది యీ దేశస్థులకు నూతనము. రాజు గుణవంతుఁ డనియు, దయాళు వనియు జను లభిప్రాయపడుదు రేని, వారు రాజ్యపరిపాలనలోని లోపముల నంతగాఁ బాటింపరు. ఈదేశమున గొప్పయధికారులు వచ్చి కొంతకాలముండి పోవుచున్నను, ఈ దేశపరిపాలన మింత చక్కఁగా జరుగుట యా చక్రవర్తిగారియొక్క యుదాసీనతాశక్తిప్రభావముచేతనే యని జనులు తలఁపవలసియున్నది.

మనలను బాలించెడిప్రభువులను దేవతలనువలెఁ బూజించి కొనియాడవలె నని యీ దేశస్థులకుఁ బారంపర్యమయినవాడుక. చిన్నపిల్లలు చదివెడిపాఠశాలలందు "మహీశులు క్షేమంబుగా నుందురుగాక" యని చెప్పెడి దీవనయు, వివాహకాలములందు రాజసంభావన లేర్పడి యుండుటయు పైఁజెప్పిన వాడుకను బలపఱచుచున్నవి. మఱియు జనులు తమ మితిలేని రాజభక్తిని బ్రకటించు నిమిత్తము కాలధర్మము నొందినవిక్టోరియామహారాణిపేరిట, సొగసయిన గొప్ప ప్రాసాదము నొక్కదానిని పూర్వ మొకప్పుడు మొగలాయిచక్రవర్తులచేఁ గట్టింపఁబడినకట్టడమునువలెనే, చెన్నగరమందలి జనులు కట్టించి, దానియందు మన యీ దేశస్థు లగు పనివాండ్రు నేయు వస్త్రములు, కంబళ్లు, కొయ్యసామానులు, ఇత్తడిసామానులు, దంతపుసామానులు మొదలగు మేలైనవస్తువులను రప్పించి యచ్చట నుంచి విక్రయించుచున్నారు. భిన్నాచారములు గల జాతులవారు వసించెడి యీ దేశమునందు, రాజభక్తి యైకమత్యమునకు ముఖ్యమయిన యొక కారణ మని చెప్పవచ్చును.



## 20. ఇంగ్లాండుయొక్క యేకాధిపత్యము.

ఇంగ్లాండురాజు ఇండియాదేశపుచక్రవర్తి యనునది—స్వదేశరాజ్యములతీరును, వానివైశాల్యమును — వానికిని బ్రభుత్వమువారికిని గల సంబంధము—వానియొక్క కాపుదలచేయుటచేఁ బ్రభుత్వమువారిపాలన సామర్థ్యము ప్రకటిత మగుచున్నదనునది — ఆంగ్లేయులపైవిచారణవలన సామంతరాజులకుఁ గలుగుచుండు సౌఖ్యములు—స్వదేశరాజ్యములవలనఁ గలుగు మేలులు.

అనేకసామంతరాజులకుఁ బైఁబడినరాజులను చక్రవర్తి యనియు సామంతరాజులు లేని దేశాధిపులను రాజు అనియుఁ జెప్పుట వాడుక. కావుననే, ఘనతవహించిన అయిదవజార్జిప్రభువు, సామంతరాజ్యములు లేని యింగ్లాండునకు రాజు అనియు, మైసూరు, తిరువాన్కూరు, పుదుక్కోట, బరోడా, హైదరాబాదు మొదలగు సామంత రాజ్యములతోఁజేరిన యిండియాదేశమునకుఁ జక్రవర్తి యనియుఁ జెప్పఁబడుచున్నారు.

ఈ దేశమున స్వదేశీయసామంతరాజులపరిపాలనకు లోఁబడినదేశములవైశాల్యము రమారమి 7 లక్షలచదరపు మైళ్లనియు, ఆదేశములందలి జనసంఖ్య 7 కోట్లనియుఁ దెలియవచ్చుచున్నది. పైరాజ్యములలో 175 సంస్థానము

లిండియాదొరతనమువారిచేతను, చిన్నవిగానుండు 500 సంస్థానము లాయామాగాణములదొరతనమువారిచేతను విచారణచేయఁబడుచున్నవి. వీనిలో ననేకరాజ్యములు మిక్కిలి కలిమిగలవి. మైసూరురాజ్యము బంగారుపండెడు భూమి యని ప్రసిద్ధికెక్కినది. విస్తారమయిన నిజాము రాజ్యమునందు నేలబొగ్గు, ఇనుము మొదలగు నుపయుక్తములయిన వస్తువులు దొరకుచున్నవి. బరోడారాజ్యమును గుజరాతదేశముయొక్క నందనవన మని చెప్పవచ్చును. కాశ్మీరము, తిరువాన్కూరు రమ్యములయిన నైసర్గికప్రదేశ సృష్టులకును, రన్యప్రదేశములకును బ్రసిద్ధికెక్కినవి.

ఈదేశమున 20 చదరపుమైళ్లకుఁ బైఁబడనివిస్తీర్ణము గల మిక్కిలి చిన్నరాజ్యములును నున్నవి. సామాన్యముగా, రాజపుత్రస్థానమునందును, మధ్యఇండియాలోను నుండు రాజ్యము లన్నియు చిన్నవే. దక్షిణయిండియాయందును, ఆంగ్లేయప్రభుత్వము చెలరేఁగకమునుపే, బలశాలురగు నృపాలురు చిన్నరాజ్యముల నన్నింటిని వశపఱచుకొని, వానిని వృద్ధిపఱచికొనిరి. ఆస్థితియందే యా రాజ్యము లన్నియు నిప్పటికిని నున్నవి. క్రిందఁ జూపఁబడిన పట్టీ వలన స్వదేశసంస్థానములపేరులు మొదలగునవి తెలియ వచ్చును:—

1. ఇండియాగవర్న మెంటువారిపైవిచారణకు లోఁబడిన సంస్థానములు.

| సంస్థానముల పేరు. | విస్తీర్ణము; చదరపు మైళ్లు. | 1901-వ సంవత్సరము ప్రకారము జనసంఖ్య. | ఎన్నిలక్షల రూపాయలు కప్పము కట్టుచున్నారనునది. |
|---|---|---|---|
| 1. నేపాళము. | 54,000 | 40,00,000 | 150 |
| 2. నైజామురాజ్యము. | 82,698 | 1,11,41,142 | 359 |
| 3. మైసూరు. | 29,444 | 55,39,399 | 190 |
| 4. బరోడా. | 8,099 | 19,52,692 | 123 |
| 5. కాశ్మీరము. | 80,900 | 29,05,578 | 87 |
| 6. బెలూచీస్థానముఏజెన్సీ. | 78,034 | 4,28,640 | 10 |
| 7. మధ్యఇండియా ఏజెన్సీ: 148 రాజ్యములు. | 77,395 | 85,10,317 | 421 |
| 8. రాజపుత్రస్థానము ఏజెన్సీ: 20 రాజ్యములు. | 1,28,918 | 98,41,765 | 320 |

పైనఁజెప్పినసంస్థానములయందు హిందువులు, మహమ్మదీయులు, బౌద్ధులు, సీక్కులు, క్రైస్తవులు మొదలగు ననేకమతస్థు లున్నారు. ఆంగ్లేయప్రభుత్వమువలనఁ గలిగెడు సౌఖ్యముల నన్నింటిని వీరును బొందుచున్నారు. ఒక్కొక్కరాజ్యమును తత్తత్ప్రభువులచేత నేలఁబడుచున్నది. వీనిపరిపాలనవిషయములందు ఇండియాప్రభుత్వమువా రనావశ్యకముగాఁ జొరఁబడుట లేదు. దేశవా

2. మాగాణదొరతనములవారిపైవిచారణలకు లోఁబడిన సంస్థానములు.

| మాగాణముల పేరు. | | రాజ్యముల సంఖ్య. | విస్తీర్ణము. | 1901-వ సం॥ ప్ర. జనసంఖ్య. | కప్పము ఎన్నిలక్షలు. |
|---|---|---|---|---|---|
| చెన్నపురి | ... | *5 | 9,969 | 41,88,086 | 141 |
| బొంబాయి | ... | 354 | 65,761 | 69,08,648 | 420 |
| బంగాళము | ... | 30 | 58,652 | 39,98,544 | 78 |
| పంజాబు | ... | 34 | 36,532 | 44,24,398 | 155 |
| బర్మా | ... | 52 | 67,011 | 17,77,987 | 13½ |
| మధ్యపరగణాలు | ... | 15 | 29,435 | 19,96,383 | 21 |
| ఆసాస్సము | ... | 26 | 12,356 | 3,94,984 | 4½ |
| ఆగ్రా | ... | 2 | 5,079 | 8,02,097 | 36 |

*తిరువాన్కూరు, కొచ్చి, పుదుకోట, సాండూరు, బంగనపల్లి.

సులకైన కట్టుదిట్టము లన్నియు నా దేశములరాజులచే తనే చేసికొనఁబడుచున్నవి.

అయినను, దొరతనమువారికిని సామంతరాజులకును సంబంధపడినవిషయములందు మాత్రము దొరతనమువారిచేఁ దమప్రతినిధులుగా నియమింపఁబడి స్వదేశసంస్థానములలో వసించెడి దొరతనమువారిమంత్రులు (Resident) శ్రద్ధ దీసికొనవలయును. అంతియకాక, ఈ సంస్థానాధి

పతులు తమసంస్థానములలోనియుద్యోగముల కాంగ్లేయే తరులైన యైరోపీయులను నియమింపఁ దలఁతురేని, ఇం డియాదొరతనమువారియనుమతి నొందవలయును. మఱి యు, స్వదేశసంస్థానాధిపతు లాంగ్లేయేతరరాజ్యములవారి తోఁ బ్రసక్తి గలిగించుకొనుట గూడదు. ఆ యధికారము వారికి లేదు. ఈ సంస్థానములలో నున్న సేనలన్నియు నాంగ్లేయరాజులకే లోఁబడియున్నవి.

ఈసంస్థానము లన్నిటియందుఁ గలహములు సంభవింప కుండఁ బైవిచారణ చేయుచుండవలె ననియే కాని, వీని నెట్లయినను దమరాజ్యమునఁ గల్పుకొనవలె నని యాం గ్లేయప్రభుత్వమునకుఁ దలంపు లేదు. 1858-వ సంవత్సర మున ఘనతవహించిన విక్టోరియామహారాణిగారు జనుల కొసఁగినపత్రిక (Charter) యందు "ఇతరులదేశముల నాక్రమించుకొనవలె నని యెడి యాశ మాకు లేదు. ఇత రులు మాదేశములందుఁ బ్రవేశించునట్లుగా నున్నను, వారికి మే మవకాశ మియ్యఁ జాలము. వారిదేశము లపహరింపఁబడునవిగా నున్నను జూచుచుండఁజాలము. సామంతరాజులయొక్క స్వాతంత్ర్యములను, గౌరవమును, వంశబిరుదులను మాసొంతమైనవానివలెనే చూచుకొను చుందుము; దేశముయొక్క స్వభావమువలనను, రాజ్యపరి పాలనపాటివలనను బొందఁగూడినకలిమిని, నాగరికతయొక్క

పెంపును మా దేశమున నుండుజనులవలెనే తద్దేశవాసులు గూడ ననుభవింపవచ్చు ననునదే మాకోరికయై యున్నది" అని యానందకరములైన వచనములు వ్రాయఁబడియున్నవి.

స్వీకారముచేసికొనియైనను వంశాభివృద్ధిచేసికొనుట హిందువుల కాచారమగుటవలన, సంతతిలేని సామంత రాజులు గూడ నెవరినైనను స్వీకారముచేసికొని, తమ వంశపారంపర్యముగా వచ్చెడురాజ్యమును బొందవచ్చునని దొరతనమువా రంగీకరించియున్నారు. దీనికి విరుద్ధముగా నేఁబదిసంవత్సరములకుఁ బూర్వము, సంతతిలేని వారిరాజ్యములను తూర్పిండియాసంఘమువారు స్వాధీన పఱచుకొనుచుండిరి. అదే "సిపాయీలకలహము" అనఁబడు యుద్ధవీరులకలహమునకుఁ గారణ మాయెను. కాఁబట్టి, జగడమడఁగినతోడనే సామంతరాజుల కేవిధమైన యపాయము లేకుండనే పరిపాలనము చేయఁబడు నను దృఢమైన వాగ్దానమును ప్రభుత్వమువారు చేసియున్నారు.

ఇత్తెఱంగున లెక్కలేనిసామంతరాజుల నీదేశంబున నుంచుకొని, మిక్కిలి నెమ్మదిగాను, శ్లాఘనీయముగాను నాంగ్లేయులు పాలనసేయుటఁ జూచి యన్యదేశస్థులు మిక్కిలి యాశ్చర్య మొందుచున్నారు. తక్కినరాజ్యము లన్నింటిలో ననేకములయందు సామంతరాజులు క్షీణించిన

పిదపనే ప్రభుత్వము బలపడుచున్నది. కాఁబట్టి మృగేంద్రుఁడగు సింహముచుట్టును గజము, వ్యాఘ్రము, అశ్వము, గోవు, మృగము, జంబుకము మొదలగు మృగము లన్నియు నీదేశమునఁ గించిత్తైనను భీతి లేక చెలిమితో మెలఁగుచున్నవి యని చెప్పవచ్చును.

సామంతరాజ్యములందలిప్రజలును ఆంగ్లేయులవలన ననేకము లయిన మేలులను బొందియున్నారు. సామంతరాజు లందఱును నాంగ్లేయరాజులపరిపాలనపద్ధతుల నవలంబించి పౌరులను గించిత్తయినను బీడింపకున్నారు; కట్టుదిట్టములు, విద్య, ధర్మపరిపాలనము మొదలగు విషయములం దాంగ్లేయుల ననుసరించి, శిశుహత్య, సహగమనము, సిళ్లగ్రుచ్చుకొనుట మొదలగు క్రూరము లయిన దురాచారముల నాఁపివేసిరి. ప్రయాణమునకును, వర్తకమునకును నాటంకములయిన సుంకము, పన్ను మొదలగు వానిని తగ్గించుటవలన యాత్రచేయుటయు, వర్తకమును స్వదేశసంస్థానములం దభివృద్ధి యయ్యెను. కొన్ని స్వదేశసంస్థానములం దినుపదారులు నిర్మింపఁబడి, దేశవాసులకు మితిలేని సౌఖ్యము లభివృద్ధి చేయఁబడియున్నవి. ఆంగ్లేయదొరతనమువారిచే నిర్మింపఁబడియుండెడియయోమార్గములవలనను అచటిజనులకు మేలులు గలుగుచున్నవి.

కొన్ని స్వదేశసంస్థానములు రాజచిహ్నముల నన్నింటిని బాగుగా వహించి, యాంగ్లేయప్రభుత్వమువారి దేశముల వలెనే వెలుంగుచున్నవి.

స్వదేశరాజకుమారుల నాంగ్లేయప్రభువులు దగినపండితులను నియమించి, వారినగళ్లయందైనను, లేక, వారి నిమిత్తమయి యేర్పఱపఁబడియుండు రాజకుమారకలాశాలలయందైనను జదువు నేర్పించుటయేకాక, రాజ్యపరిపాలనక్రమములనుగూడఁ జక్కఁగా నేర్పుచున్నారు. రాజపుత్రస్థానంబునఁ గల అజ్మీరుకలాశాలయును, కత్తియవారునం దుండు రాజకోటకలాశాలయు రాజకుమారులు చదువుట కైనకలాశాలలే.

ఆంగ్లేయప్రభుత్వ మేర్పడుటకు మునుపు, ఈదేశపు రాజులు తమ్ము మిక్కిలి గొప్పవారినిగఁ దలఁచి, తమకుఁ దామే పట్టబిరుదులను బెట్టుకొని, స్వకీయక్షేమలాభముల నిమిత్తము జను లేర్పడియున్నారే కాని, వారియొక్క క్షేమలాభములను గమనించునిమిత్తము దామేర్పడియున్నామన్న తలంపు లేనివారు వోలె నడచుచుండినట్లు తెలియవచ్చెడి. అయినను, ఇప్పు డుండెడిసామంతరాజు లాంగ్లేయరాజులపరిపాలనపద్ధతులను, ఆంగ్లేయదేశము లందు జనులకును రాజులకును గలసంబంధమును, ప్రపంచమున నుండెడియనేకప్రదేశములలో నాంగ్లేయులవంటి

పలుజాతులవారు చేసియుండెడియాశ్చర్యకరములైన దిద్దుపాట్లను గమనించి తెలిసికొని, తామును నాప్రకారమే చేయుటకుఁ బ్రయత్నపడుచున్నారు. ఇవ్విధముగా సామంతరాజులు తమసాకర్యములనే పాటింపక, యాజ్ఞలనుత్సాహముతోఁ జెల్లించుచుండుటవలన, వారియొక్క దేశములు ప్రసిద్ధిఁ జెంది ప్రకాశించు ననుట క్షేమైనను సందియంబు గలదా!

సామంతరాజ్యము లుండుటచేఁ గొన్నిమేలులు నున్నవి. విశాల మైన యిండియాదేశమున మూఁడింట నొక భాగము సామంతరాజులపరిపాలనమునం దుండుటచే, దేశమంతయు నాంగ్లేయులే యేకదేశముగా నేలవలసిన శ్రమ తగ్గినది. వేఱువేఱుగు నడతలు, ఉడుపులు, తలంపులు గల తావులకుఁ దగినట్లు ప్రభుత్వములు నేర్పడి పైదేశము లుండుట దేశములయొక్క నెమ్మదికిఁ గారణమై యున్నది. అంతియకాక, వివేకమును, సూక్ష్మబుద్ధియుఁ గల హిందువులు తమబుద్ధికౌశలమును, ధైర్యసాహసములను నాంగ్లేయులకుఁ జూపుటకు స్వదేశసంస్థానము లవకాశము నొసఁగుచున్నవి. అనేకులు బుద్ధిమంతులగు హిందువులు స్వాభావికమైనజ్ఞానమునందును, కార్యనిర్వహణమునందును బాగుగాఁ గడతేఱి స్వదేశసంస్థానములందు మంత్రిపదవి వహించి రాజ్యమునకును జనులకును



సర్ సాలర్ జంగ్.

లెక్కలేని మేలులను గావించి ప్రసిద్ధిచెందియున్నారు. అట్లు ప్రసిద్ధిచెందినవారలు, నిజామురాజ్యమున ప్రముఖులుగా నుండిన నవాబు సర్ సాలర్ జంగు బహదర్ గారును (Nawab Sir Salar Jung Bahadur, G.C.S.I.), మైసూరు రాజ్యమును మంచిస్థితికిఁ దెచ్చినవారగు దివాన్. సి. రంగాచార్యులగారును (Dewan C. Rangacharlu, C.I.E.) సర్. కే. శేషాద్రిఅయ్యరుగారును (Sir K. Seshadri Ayar, K.C.S.I.) తిరువాన్కూరు, ఇందూరు, బరోడా మొదలగుచోట్ల లెక్కలేనిదిద్దుపాట్లు చేసిన రాజా, సర్.

టి. మాధవరావుగారును (Rajah Sir T. Madhava Row, K.C.S.I.) తిరువాన్కూరుసంస్థానమును మేటి యైన స్వదేశ సంస్థానమునుగా నొనర్చినవారును, పుదుకోటసంస్థానమును మంచిస్థితికిఁ దెచ్చినవారునైన సర్. ఏ. శేషయ్యశాస్త్రులు గారును (Sir A. Seshayya Sastrigal, K.C.S.I.), ఆంగ్లేయప్రభుత్వమున ననేకము లగునుద్యోగము లొనర్చి ఇందూరుసంస్థానమున దివానుగా నుండి, జనులకొఱఁతలను దీర్చి యనేకమేలులను జేసినదేకాక, వార్ధక్యదశయం దుండినను దేశక్షేమమునకును జనులక్షేమమునకును బాటుపడుచుండినవారగు మ. రా. రా. శ్రీ. దివాన్‌బహదూర్ ఆర్. రఘునాథరావుగారును (M. R. Ry. Dewan Bahadur R. Raghunatha Rao Avl., C.S.I.) ముఖ్యులు. ఇప్పుడును ఇండియాలో నుండు ప్రముఖులును, 'అధికారి పదవియందుండువారు దేశమున కివ్విధము లైన మేలులను జేయవచ్చు' నను సంగతిని దమసత్కార్యములమూలమునఁ జూపుచు వచ్చుచున్నారు. వీరివంటి సత్పురుషు లీ దేశమునందుఁ బ్రబలను బ్రబలను దొరతనమువారి కీ దేశజనులయెడ విశేషమయిన విశ్వాసమును, బ్రేమయు హెచ్చుచు వచ్చును.

ఆంగ్లేయప్రభుత్వము క్రింద స్వదేశసంస్థానములపరిపాలనయొక్క చక్కఁబాటును తెలియుటకై హైదరా

బాదుసంస్థానమును లేక నైజామురాజ్యమును నిదర్శనము గాఁ గైకొనవచ్చును. ఆంగ్లేయప్రభుత్వ మీదేశమున స్థాపితము గాకమునుపు హిందువులును—ముఖ్యముగా మహారాష్ట్రులును మహమ్మదీయులును నొండొరులు పోరాడుచుండిరి. ఇప్పు డాంగ్లేయులరక్షకహస్తముక్రిందికి వచ్చిన తర్వాత, వారందఱును నిమ్మళించుటయే కాక, ప్రకృతపు నైజాముప్రభువగు నైజామ్ మీర్ మహబూబ్ అలిఖాన్ బహాదరువారిప్రభుత్వమున శ్లాఘ్యమయినయనురాగముతో వర్తిల్లుచున్నారు. 1869 సం॥మున వీరు 3 యేండ్లప్రాయముననే సింహాసనమునకు వచ్చిరి. వీరు మైనరుదశలోనున్నంతకాలము ప్రసిద్ధులైన సర్ సాలర్‌జంగ్ అను మంత్రిశేఖరునిచే నీరాజ్యము విశేషబుద్ధికౌశలములతోఁ బాలింపఁబడుచుండినది. వారు జను లందఱు కొనియాడునట్లనేకసవరణలు సంస్థానమునఁ జేసిరి. వా రామరణాంతము ఆంగ్లేయపరిపాలనపద్ధతులనే తమసంస్థానమునను వాడుకకుఁ దెచ్చిరి. ఈ సమర్థుండగు మంత్రిగారు 1883 సం॥మునఁ బరలోకగతులైరి. మఱుసటిసంవత్సరముననే ప్రస్తుతపునైజాముగారిని రిప్పనుప్రభువు సింహాసనాసీనునిఁ జేసిరి.

మంత్రియే సంస్థానమునకు సర్వాధికారి. ధనసంబంధమయిన, కోర్టుకు సంబంధపడిన, సేనలకు సంబంధపడిన, తక్కిన చిల్లరవ్యవహారములకు సంబంధించిన వ్యవహార

ములను విచారించుటకై నలుగురు ఉపమంత్రులు గలరు. అన్ని సందేహములు సభలయందే తీర్మానింపఁబడుచుండును.

ఈ గొప్పసంస్థానము నాలుగు మాగాణములుగా విభజింపఁబడియున్నది. ఆ మాగాణాధికారులకు **సుబేదారులు** అని పేరు. ఈ నాలుగు మాగాణములును 15 జిల్లాలు చేయఁబడియున్నవి. వీనియధికారులు 'తాలూకుదారు' లనఁబడుదురు. గ్రామపద్ధతి మిక్కిలి శ్లాఘ్యముగా పని చేయుచున్నది.

శాసననిర్మాణసభలో నిర్ధారణమైనపిదపనే శాసనములు వెలువడుచున్నవి. ఆ శాసననిర్మాణసభకు 17 గురు సభ్యులు గలరు. ఆ సభకు మంత్రి అగ్రాసనాధిపతి. వారిలో 11 గురు సర్కారుద్యోగములో నుండువారు. 6 గురు సర్కారుద్యోగములో లేనివారు. వీరిలో నిద్దఱు జాగీరుదారులచేతను, ఇద్దఱు హైకోర్టువకీళ్లచేతను కోరుకోనఁబడుదురు. తక్కిన యిద్దఱిని మంత్రిగారు తమసంస్థానము వారినుండి యేర్పఱచుకొందురు. న్యాయవిమర్శనవిషయమునను ఇదే కౌశలము చూపఁబడుచున్నది. అనేకములగుమతవిషయకములైన కష్టములను బరిగణింపక రాష్ట్రమంతయు, బాల్యవిద్యయు, ప్రౌఢవిద్యయు, స్త్రీవిద్యయు నానాటికి వృద్ధినొందుచున్నవి. రాష్ట్రమునందలి జనసంఖ్యలో 100-కి 10·4 గురు మాత్రమే మహమ్మదీయు

లున్నారు. 100-కి 83 గురు విద్యార్థులు కలాశాలల లోను, 100-కి 45 గురు ప్రౌఢవిద్యాశాలలలోను, 100-కి 42 మంది ప్రైమరీపాఠశాలలలోను జదువుచున్నారు. శిల్ప విద్యాశాలలును, విశేషవిద్యాశాలలును పునరుద్ధారణ చేయఁబడుచున్నవి. శిల్పముల కనేకముల కీ సంస్థానము మిక్కిలి ప్రఖ్యాతివడసియున్నది. ముఖ్యపట్టణమునందు యూరోపియనులకు యూరేషియనులకు ననియే 8 పాఠశాలలు ప్రత్యేకముగా నేర్పఱపఁబడియున్నవి. ప్రభుత్వమువారు వైద్యశాల లేర్పఱచియున్నారు; ఊరూరికిఁ బోయి జనులను నిర్బంధించి టీకాలు వేయుచున్నారు; నాణెము లచ్చువేయుచున్నారు. తపాలు ఏర్పఱచియున్నారు. భూములను కొలఁత వేయించుచున్నారు; ఇవి మొదలగు నెన్నియో యుపయుక్తకార్యములను జేయుచున్నారు.

ఆంగ్లేయప్రభుత్వమువలన నివ్విధముగా స్వదేశసంస్థానములప్రభుత్వము నానాటికిఁ బ్రసిద్ధిఁ జెందుచున్నది. జనులు రాజభక్తివిశ్వాసములు గలవారై యున్నారు. నిదర్శనముగాఁ గైకొన్న యీసంస్థానమునందలిసవరణలం జూచిన పిదప, నాంగ్లేయప్రభుత్వము దేశమునకును జనులకును మేలు గావింపలేదని చెప్పుట కెవ్వఁడు సాహసింపఁగలఁడు?



## నాలవభాగము

### 21. ఆంగ్లేయులరాకకు పూర్వము హిందూదేశస్థితి.

మునుపటికాలస్థితివలన నిప్పటికాలపు మేలును దెలియవచ్చు ననునది—ఈ దేశముయొక్క పూర్వస్థితి—మొదట వాసము లేర్పఱచుకొన్న యార్యులు — వారికిఁ బిదపవచ్చిన పలుజాతులవారు — దండెత్తుటవలని నష్టములు—అగ్బరుయొక్క రాజ్యపరిపాలనము—ఆతనిసంతతివారిచేష్ట నడతలు—ఔరంగజీబుకు వెనుకవచ్చిన రాజులపరిపాలనలోని యన్యాయములు.

నీడయొక్క మహిమ నెండవలనఁ దెలిసికొనునట్లు, ఆంగ్లేయప్రభుత్వమునందు, ఈ దేశమునకు లభించిన మేలులను బూర్వకాలమున నీ హిందూదేశ మున్నస్థితి నెఱుఁగుటవలన బాగుగఁ దెలియవచ్చును గనుక, దానిని వరుసక్రమముగాఁ గ్రిందఁ జెప్పుచున్నాము.

ఆకాశమును దాఁకుచుండు హిమాలయపర్వతముచేఁ బార్శ్వదేశములనుండి వేఱుచేయఁబడిన యీ దేశమునందుఁ బూర్వకాలమునుండి పలుసమయములలోఁ బలుజాతులవారు వసించుచుండిరి. కొంచె మెచ్చుతక్కువగా 4,000 యేండ్లకుముందు, ఏదో యొక వాయవ్యదేశము

నుండి పైనఁజెప్పిన హిమాలయపర్వతములను దాఁటి తెల్ల వారివలెనె రూపమును వన్నెయుఁ గల మనుష్యు లనేకు లీదేశమునఁ బ్రవేశించి, మొదటమొదట సింధునదీతీర



అలెగ్జాండర్.

ప్రాంతములందు నివాసము లేర్పఱచికొని తమనాగరికతను స్థాపించిరి. కాలక్రమమున వీరు వృద్ధినొంది, యీ దేశ వాసులను జయించి, గంగాతీరమునం దనేకరాజ్యములను

స్థాపించికొని, మతము, తత్త్వశాస్త్రము, వేదాంతశాస్త్రము మొదలగువానియందుఁ బేరు పొంది, తూర్పుసముద్రము మార్గమున లంకాద్వీపమువఱకును దమనాగరికతను వ్యాపింపఁజేసిరి. అయినను, వీరిని దైవము బహుకాలము మంచిస్థితియందుంచలేదు. క్రీస్తు పుట్టుటకు సుమారు 500 యేండ్లకుమునుపు ఒక పారశీకవీరుఁడు దండెత్తి యీదేశము యొక్క సింధునదీతీరప్రాంత్యమును స్వాధీనపఱచుకొనెననియు, దీనికిఁ బిదప 200 సంవత్సరములలోపల గ్రీసుదేశమునుండి మహాచక్రవర్తియయియుండిన యలెగ్జాండర్ (Alexander the Great) అను ప్రాయపువీరుఁ డొకఁడు సింధునదీతీరమున నున్న రాజులను జయించి పంజాబుదేశమును దమదేశముతోఁ గూడఁ జేర్చుకొనెననియుఁ జరిత్రములు చెప్పుచున్నవి. ఇతఁ డీ దేశమును వదలి మఱలినంతనే, మగధదేశమున నందవంశమునకుఁ జేరిన చంద్రగుప్తుం డనురాజు గ్రీక్కులను (Greeks) జయించి, యుత్తరహిందూస్థానము నంతయు వశపఱచుకొని పాటలీపుత్రమను పట్టణమున నుండి యేకచ్ఛత్రాధిపతియై రాజ్యపరిపాలనము చేయుచుండెను.

ఇంతలో, గౌతమశాక్యముని యనునొక మహాజ్ఞాని యార్యమతమునఁ దనకుఁ దోఁచిన కొన్నిలోపములను దొలఁగించి, యుపయుక్తము లైనయనేకము లగు మంచి

విషయములను దానినుండి తనమతమునకుఁ దీసికొని,



గౌతముఁడు.

మనుజు లొండొరులను సోదరులమాడ్కిఁ బ్రేమించుకొనవలయు ననియు, భూతదయ యుండవలయు ననియు బోధించి, యాశ వదలిననేకాని మోక్షము దొరకదనియు నుపదేశించెను. వీరిచే నేర్పఱుపఁబడిన మతమునకే బౌద్ధమతమని పేరు. ఇది యీదేశమున బహుసులభముగ వ్యాపించి, యాదికాలమందలి యార్యమతముతో సమముగా నుండినది. ఈసమయమున, చంద్రగుప్తునిమనుమఁ డగు **అశోకచక్రవర్తి** యనునతఁడు మగధదేశమును బాలించుచుండినపు డీ మతము నవలంబించి, యీ మతము నీ దేశమున వ్యాపింపఁజేసెను. దీనింబట్టి యీతనికి బౌద్ధచక్రవర్తి యని పేరు గలిగెను. ఇప్పుడు క్షీణస్థితియందున్నను, ప్రపంచమునందలి జనులలోపల నించుమించుగా నూటికి ముప్పదుగురి కీ మతము మహశ్శాంతి నొసఁగుచున్నది. అశోకుఁడు ప్రభుత్వపద్ధతులందుఁ బ్రఖ్యాతి వహించి, జనులకు సౌఖ్యములను గలిగించి, యేకచ్ఛత్రాధిపతియై యధికారముఁ జెలాయించుచుండెను. ఆతనికిఁ

పిమ్మట వచ్చిన హిందూరాజులలో నతనివలెఁ బ్రసిద్ధిఁ జెందిననృపాలురు తఱచుగా లేరు. ఆతనికాలమునకుఁ బిదప 750 సంవత్సరములవఱకును ఏష్యాఖండముయొక్క మధ్యదేశములనుండి వచ్చిన శాక్యులు, హూణులు, యవనులు, గ్రీక్కులు, తురుష్కులు మొదలగుజాతివారివలన నీదేశము నెమ్మది దప్పి యల్లకల్లోలమై యుండెను.

క్రీస్తు పుట్టినతర్వాత 700 సంవత్సరముల కంతయు మహామ్మదీయు లీదేశముపై దాడివెడలి దీనిని స్వాధీన పఱచుకొన నారంభించిరి. వీరియొక్క యుపద్రవములును, ఆర్భాటములును 1761-వ సంవత్సరమువఱకును దీఱని వయ్యెను. మొదటమొదట నీ దేశమునందలి విస్తారమయిన సంపదను దోఁచుకొనిపోవలయు ననియు, మహమ్మదీయమతమును వ్యాపింపఁజేయవలయుననియు, విగ్రహారాధనచేయువారిని దుంపద్రెంచవలె ననియు వీ రీ దేశమునకు వచ్చిరి. ఈ పనులను దమయుద్దేశములప్రకారము గావలసినంతమట్టునకుఁ జేసి రనుటకుఁ గావలసినన్ని యాధారము లున్నవి. ఆదియందు, గజనీ(Ghazni) రాజ్యమునకుఁ జేరిన మహమ్మదు(Mahmud) అనునతఁడు పదునేడుతూరులు హిందూదేశముపై దాడివెడలి, నగళ్లను, బొక్కసపుటిండ్లను (ధనాలయములను), కోవెలలను గొల్లవెట్టి, హిందువులచేఁ బూజితము లయినవిగ్రహాము

లను బొడిసేసి, తనచేతఁ జిక్కినద్రవ్య మంతయుఁ దన వెంబడి రాలేదు గదా యనెడి యత్యాగ్రహముతోఁ బల్లములు త్రవ్వి, వానిలోఁ బూడ్చిపెట్టెను. ఈతనివలెనే **మహమ్మదుఘోరీ** (Mahomed Ghori) **యనునతఁడు** తొమ్మిదిపర్యాయములు దండెత్తి, హిందూరాజులను జయించి, ఢిల్లీపట్టణమున రాజ్యమును స్థాపించెను ఈ దేశమున వాసము లేర్పఱచుకొన్నపిదపఁ **గూడ** మహమ్మదీయులు స్వలాభములనే యుద్దేశించి, జనులకుఁ గావలసిన సౌకర్యములను గించిత్తయినను గమనింపక, వారియొక్క మతమునకు భ్రంశమును గలిగించినదియే కాక, వారికి ద్రవ్యనాశమును గూడఁ గలిగించిరి. పన్నులు చెల్లింపలేక యడవులలోఁ దాఁగిన బీదలను వేటాడి, తననోటినుండి పడినపంటికిఁ గూడ గోరి కట్టించినమహమ్మదీయుఁ డొకఁ డొకకాలమున ఢిల్లీనగరమునఁ జక్రవర్తిగా నుండెను. **చెంగిస్ఖాన్** (Chenghiz Khan) **తామర్లేన్** (Tamerlane) అను నిరువురు క్రూరనరహింసకులు గుంపులుగుంపులుగా **మొగలాయీలను** జేర్చికొని యీ దేశజనులను వేలకొలఁదిగఁ దమయాయుధముల కాహారములనుగాఁ జేసి, యనేక నగరములను రక్తమయములనుగా నొనర్చి నొచ్చియుండు జనుల నందఱిని బిచ్చగాండ్రను జేసిరి. రాజబాటలను వేయించి, కోనేళ్లను, కాలువలను త్రవ్వించి సత్రములను

గట్టించినపుణ్యాత్ముఁ డగు ఫిరోజ్‌టోగ్లక్కు (Firoz Tughlak) అనునతఁడు తప్పఁ దక్కిన ఢిల్లీరాజులలో జనుల మేలు గోరినవాఁడు 500 సంవత్సరములకాల మొక్కఁ డైనను లేకుండెను.

అయినను, బదునొక్కండవశతాబ్దమున మహమ్మదీయ మతావలంబులైన మొగలాయీలు ఢిల్లీరాజ్యమును స్వాధీనపఱచుకొన్నప్పుడు దొరతన మొక్కతీరునఁ గుదుటఁ బడినది. వీరికాలమునుండియె జనులు మతభేదములనిమిత్తమై యుపద్రవపఱుపఁబడకుండిరి. రాజ్యముయొక్క యాదాయమున నొక్కింతయైనను దేశక్షేమమునకై యుపయోగింపఁబడుచుండినది. రాజమార్గములు వేసి, కోనేళ్లను, నూతులను ద్రవ్వి, బాటసారులు దిగుటకైన సత్రములను కట్టి, భూములను గొల్చి, న్యాయ్యములైన పన్నులను వేసి, యన్యమతస్థుల కుండినపన్నులను దీసివేసి, హిందువులలో నుండిన సహగమనాదు లగుక్రూరాచారముల నాఁపివేసి, వారిలోఁ దెలివిగలవారికి రాజ్యమున గొప్ప యుద్యోగముల నిచ్చి, ఖిన్నులైనవారివ్యసనములను బోకార్చి యీదేశము నేలిన అగ్బరువలె గౌరవమును, దయయుఁ గలిగిన హిందూరాజులు కొందతే. అగ్బరుసంతతివా రాతనివలె బాగుగా రాజ్యమును బాలింపరైరి. ఆతనికుమారుఁడగు జహాంగీరు (Jahanghir)

అనునతఁడు సౌందర్యమే భూలోకంబున నవతరించెనో యనఁదగిన **నూర్జహాను** (Nur Jahan) అను నతివవల యందుఁ దగిలి, యామెవశమున రాజ్యము నప్పగించి, సుఖభోగిగా నుండెను. పిదప నాతనికుమారుఁ డగు **షాజహాను** అను నతఁడును ననేకపర్యాయములు జయముఁ బొంది, విశేషద్రవ్యమును తాజ్‌మహాల్ (Taj Mahal) మొదలగు వింతలైన కట్టడములందును, రాజులు గూర్చుండఁదగిన నెమలిసింహాసనమునందును వెచ్చించి, రాజ్య పరిపాలనమును మిక్కిలి యాడంబరముతో జరిపెను. తనపుత్రులు తగు యోగ్యత లేనివా రని యెఱిఁగియుండి యు, నారిపైఁ గలవాత్సల్యముచే వారిని గొప్ప మాగాణములకధికారులను జేసి తనకే కీడుఁ దెచ్చుకొని, కడపటఁ దనకుమారులలో నొక్కనిచేతఁ జెఱసాలలో నుంచఁబడెను. ఇట్లు తండ్రికి ద్రోహముచేసిన కొమరుఁడు **ఔరంగజేబు** (Aurangazeb) అనునతఁడు. ఇతఁడు మహమ్మదీయమతమునం దపారమైన భక్తిగలవానివలె నటించిన వేసదారి; అగ్బరు ప్రభుత్వమునాటినుండి వాడుకలో నుండిన పరిపాలనపద్ధతుల నన్నింటిని మార్చివేసి, మత పన్నులను విధించి, హిందువుల నుద్యోగములనుండి తొలఁగించి, రాజపుత్రుల నలక్ష్యపఱచి, పనికిమాలినజగడము లాడి, తమరి నాశ్రయించినవారిమీఁదను నమ్మిక

లేక, యభివృద్ధిచెందియున్నరాజ్యము నడు గంట నాశము చేసినవాఁ డితఁడే.

ఇంతకు లోపలనే దక్షిణదేశమున నుండు మహారాష్ట్ర మనెడి కొండవీటిసీమలం దుఁడుహిందువు లొక్కటయి, శివాజీయనునాతని ముఖ్యునిగాఁ జేసికొని, హిందూమతమును రక్షింపవలె నను నెపమున, మొగలాయీరాజ్యములను కొల్లపెట్టి, మెక్కా మొదలగు పుణ్యస్థలములకు యాత్రపోవుబాటసారులను దొందరపెట్టి, పన్నులను వసూలుచేసి, పలుతెఱఁగులుగా మహమ్మదీయులకు సంకటములను గలిగించిరి. ఈకారణముచే, మహమ్మదీయభక్తశిరోమణి యగు ఔరంగజేబు కోపావిష్టుఁడై, బహుకాలమునుండి మట్టిచెట్టువలె నీ దేశమున వేళ్లుపాఱి, యూడలు దిగి, వ్యాపించియుండుహిందూమతమునకుఁ దమ్ము నొక గొడ్డలినిగాఁ దలఁచి, విస్తారమైనసైన్యమును సేకరించికొని, దక్షిణదేశమున, 24 సంవత్సరములవఱకు శత్రువులచేతిలోఁ జిక్కక, శత్రువులు చేర్చియుంచియుండునాహారపదార్థములు మొదలగువాని నపహరించుటయందే దృష్టిగలవాఁడై, జగడములు వేయుచు వచ్చిన కొండవీటిసీమవారితోఁ బనిలేనిపోరుసేయుచు, నంతమునఁ దాను దలఁచినమనోరథమును నెఱవేర్చుకొనకయే 89-వ ప్రాయమున నుత్తరహిందూస్థానమునకుఁ

బందుముసలివాఁడుగ వచ్చి, తనజీవితకాల మెల్ల వ్యర్థ మాయెఁ గదా యనియెడు విచారముతో అహమ్మదు నగరమున 1707-వ సంవత్సరమునఁ గాలధర్మము చెందెను.

ఇతఁడు గతించిన 50 సంవత్సరముల కెల్ల మొగలా యీలవంశము క్షీణించెను. రాజ్యమును ఛిన్నభిన్నమై క్షీణించి నానాటికి శత్రువుల కెర యయ్యెను. ఇట్లు పాడైపోయినదేశముగూడ పారశీకరా జగు నాదర్షా (Nadir Shah) అను క్రూరునిచేఁ గొల్లపెట్టఁబడి, క్షీణ దశ నొందినది. అంతమాత్రమేకాక యుద్ధపద్ధతులందుఁ గట్టివా రనిపించుకొన్న సిక్కుజాతివారును మహారాష్ట్రులును ప్రబలులయి ఢిల్లీరాజ్యము నాక్రమించికొనిరి. ఈ దేశమిట్లల్లకల్లోలమైయున్నప్పుడే తూర్పుసముద్రతీరమున నాంగ్లేయు లుదయించిరి.



# 22. ఆంగ్లేయవర్తకులయధీనతలోనున్న యిండియాదేశము.

అశోకచక్రవర్తికిఁ బిదప ఇండియాయొక్క స్థితి — ఆంగ్లేయులరాక —వారివ్యాపారస్థలములును, వ్యాపారపద్ధతులును — ప్రథమమున సంభవించిన కలహములకుఁ గారణములు — బెంటిఁకుప్రభువు చేసినసవరణలు—డల్హౌసీప్రభువు చేసినమహోపకారములు—కానింగ్ ప్రభువువలనను, ఘనతఁజెందినశ్రీవిక్టోర్యామహారాజ్ఞివలనను లభించినయనుగ్రహములు.

ఆదికాలమునందు, అశోకునియొక్క కాలమునకు వెనుక నీ దేశము నెమ్మది, చక్కనిరాజ్యపరిపాలనాపద్ధతులును సర్వదేశసామాన్యముగా గలిగియున్నకాలము లేదనియు, క్రూరులైనదోపిడిగాండ్రనేకులచేతఁ గొల్లపెట్టఁబడినదనియు, రాజులు మాటిమాటికి మాఱుట గలహములకును, హింసలకును గారణమాయె ననియు, రాజ్యమందు లభించిన ద్రవ్యమెల్ల విశేషముగా రాజులు స్వోపభోగములకై యుపయోగించుకొనుచుండిరే కాని, సర్వజనసాధారణములైనమేలులకై వ్యయపఱచినవారు కారనియు, రాజ్యపరిపాలనవిషయమున జనులకెట్టి హక్కును, సంబంధమును లేక యుండె ననియు, మతవిషయములందు సహితము జనులు దమమనోరథానుసారముగాఁ బ్రవ

ర్తింప స్వాతంత్ర్యము లేకయుండి రనియుఁ, బై యధ్యాయమున సవిస్తరముగాఁ జెప్పితిమి. ఈదేశ మాంగ్లేయుల వశమున నెట్లెఱఁగున వచ్చినదియు, నీ యీ కాలములందుఁ బైనఁజెప్పిన ప్రభుత్వపద్ధతు లీయీవిధముగా మాఱినవనియుఁ, బ్రకృతము జనులకుఁ గలసౌకర్యము లివి యివి యనియు నీ యధ్యాయమునందుఁ జెప్పఁబడును.



తూర్పు ఇండియా
వర్తకసంఘమువారి ముద్ర.

సుమారు 300 సంవత్సరములకుమునుపు ఆంగ్లేయు లీదేశమునకు వర్తకమునకై వచ్చిరి. వా రీదేశమును స్వాధీనపఱచుకొని, ప్రభుత్వము వహింపఁగల రని యప్పుడు కొంచెమయినను తలంపరైరి. వర్తకమువలన మంచి లాభము పడయవచ్చు ననియే వారు తలఁచిరి. కాఁబట్టి, యీ దేశమునకు వచ్చినవెంటనే, మచిలీపట్టణము, చెన్నపురి, బొంబాయి, సూరత్ మొదలగు రేవుపట్టణములందు వారు గిడ్డంగులను గట్టికొని, యించుమించుగా 140 సంవత్సరములవఱకు మిక్కిలి యోర్పుతోఁ దమవర్తకమును మాత్రమే నెఱవేర్చుకొనుచు వచ్చిరి. వీరికి మునుపే మఱి కొంద ఱైరోపియనులు ఈ దేశమునకు వచ్చి చిన్నచిన్న

కొన్ని వర్తకశాలల నేర్పఱచికొనియుండిరి. 1744-వ సంవత్సరమున నింగ్లాండుకును ఫ్రాన్సు (France) కును ఘోర యుద్ధము జరిగెను. అప్పు డిండియాయం దుండిన యాంగ్లేయులను తఱుమఁగొట్టవలె నని ఫ్రెంచివారు తలఁచి, పలువిధములైన ప్రయత్నము లొనర్చియు, నాంగ్లేయులు దమ వర్తకస్థలములను గాపాడుకొని, ధైర్యమును గనఁబఱచినదియెకాక, 16 సంవత్సరములలోపలఁ దమశత్రువులను దలయెత్తకుండులాగునఁ జేసిరి.

వ్యాపారాభివృద్ధికి దేశముయొక్క నెమ్మది యావశ్యకము. కావున, గొప్పసేనలను జేర్చి యుంచుకొని యెప్పుడును జగడమునకు వెడలి, యితరులకును తమజనులకును చెఱుపుగలిగించుచుండినదోపిడిగాండ్రను జయించి, యీ దేశమునకు నెమ్మది గలుగఁజేయుట యత్యంతావశ్యకమని, వర్తకము నుద్దేశించి యీ దేశమునకు వచ్చిన యాంగ్లేయులకుఁ దలఁపు పుట్టెను. 18-వ శతాబ్దమునందు మొగలాయీరాజుల ప్రభుత్వము క్షీణించుటతోఁగూడ, నధికారులే యా యా దేశములను లోఁబఱచికొని, పలుతెఱఁగులగు పన్నులు విధించి, వ్యాపారమును జెఱుపుచుండిరి. కాఁబట్టి వీరిలో నిష్కారణముగాఁ దమరి నెదిరించువారినిమాత్ర మాంగ్లేయులు మొదట నణఁచుట కారంభించిరి. ఈ విషయము ఇంగ్లాండునం దుండువర్తక

సంఘమువారిపైయధికారులకును, సభ్యులకును దృష్టికరముగాఁ దోఁపదయ్యె. ఏలయనిన, కలహములు లేకయే వ్యాపారమును జరుపవలె నని వారియొక్క తలంపు. అయినను, 19-వ శతాబ్దముయొక్క యారంభమునం దీ దేశముయొక్క నెమ్మదిని చెఱుపుచు వచ్చిన మహారాష్ట్రులను జయించియే యీ దేశమునకు స్వాస్థ్యమును వారు కలిగించిరి. ఇంతకు లోపలనే మైసూరునందుఁ దమరాజ్యము నేర్పఱచికొని, దక్షిణదేశమునం దున్నరాజుల సందఱిని గడగడలాడించిన హైదరు. టిప్పు అనెడి మహమ్మదీయ వీరులునుమడిసిరి. కాఁబట్టి, యిది మొదలుకొనియే యాంగ్లేయ ప్రభుత్వము బలపడె నని చెప్పవచ్చును.



లార్డ్ విల్లియంబెంటిక్.

కడచిన 90 సంవత్సరములనుండియే ప్రభుత్వము చక్కఁగా నడచుచున్నది. జనులకు సౌఖ్యములను గలుగఁజేసియే ప్రభుత్వము నిర్వహింపవలయు నని మొదట వాక్రుచ్చినవారు 1818-వ సంవత్సరమున నీ దేశమునఁ బ్రభు

వుగా నుండిన 'లార్డ్ విల్లియంబెంటిక్" అను ఘనులు. చిరకాలమునుండి వాడుకలో నున్న కొన్ని దురాచారములను మాన్పి, నరహత్యచేసి కొల్లవెట్టుటయే ముఖ్యవృత్తిగాఁ గల "తగ్గు" (Thugs) లనెడియొకజాతివారిని రూపుమాపి, తమయభిప్రాయములను స్వేచ్ఛగాఁ బ్రకటింప జనులకు స్వాతంత్ర్య మొసఁగి, జనులను విద్యయం



తగ్గులు.

దును, నాగరికతయందును బేరొందునట్లు చేయవలె నను నుత్సాహము గల్గి, దాని కనుకూలము లగుపనులను బ్రారంభించినవారును, కలకత్తాపట్టణమున వైద్యకలాశాలను (Medical College) స్థాపించినవారును, కచ్చేరీలయందును, న్యాయస్థలములందును నాంగ్లేయభాషనే వాడుకపఱుచవలె నని చట్టము నేర్పఱచినవారును వీరే.

అంతియకాక, యాంగ్లేయులవలననే యన్ని కార్యములను జరిపించుటయందుఁ బ్రభుత్వమువారి కెక్కున వ్యయమగుట వలన, హిందూదేశస్థులను గొప్పపనులందు నియమించి, వ్యయము తగ్గించి ప్రభుత్వమును సవరింపవచ్చు ననియు వీరు ప్రోత్సాహపఱచిరి.

పిమ్మట నాంగ్లేయులకుఁ జెలికాఁడై యుండిన పంజాబు దేశసింహము నాఁబడు రంజితసింగ్ (Ranjit Singh) అను పేరు గల సింగుజాతిప్రధానుఁడు 1839-వ సంవత్సరమునఁ గాలముచేసెను. అప్పుడు వారియమితసేన లధికారులకు లోఁబడక, ఆ రంజితసింగునకు వెనుక రాజ్యభారము వహించిన యాతనిభార్యయొక్క యుత్తరువు ననుసరించి యాంగ్లేయుల దేశముపై దండెత్తఁగా, నాంగ్లేయులు వారిని సంహరించి, 1849-వ సంవత్సరమున పంజాబుమాగాణ మునుగూడఁ దమ పరిపాలనమునకు లోఁబఱచికొనిరి. మహారాష్ట్రులును, సింగుజాతివారినిబోలిన తక్కినవారును నీ ప్రభుత్వమునకు నడఁగిపోయినందున, దేశస్వాస్థ్యము కొఱఁతపడనేర దను నమ్మిక పుట్టెను. ఆసమయమున నీ దేశమునకు రాజప్రతినిధిగా నుండిన డల్హౌసీప్రభువు (Lord Dalhousie) సామంతరాజులయొక్క స్వీకారపుత్త్రులకుఁ దమరాజ్యమున బాధ్యత లేదని చెప్పి, యాదేశములను దమ రాజ్యముతోఁ గూడఁ జేర్చుకొని, పైఁజెప్పిన

రాజులస్వీకారపుత్రులకు, రాజకుటుంబములవారికిని మనస్సంతాపమును గలిగించిరి. అయినను ఈఘనులే, యిండియాలో తపాలా, తంతి, రోడ్లు, ఇనుపదారులు, కాల్వలు మొదలగునుపకారములను మనకుఁ జేసి, పాశ్చాత్యశాస్త్రవిద్యలను వ్యాపింపఁ జేసినవారు. ఈ ప్రభువుద్యోగము చాలించికొని స్వదేశమునకుఁబోయినవెంటనే, యిండియా సేనలకుఁ గ్రొత్తతుపాకులను, తోటాలను ప్రభుత్వమువా రిప్పింపఁగానే, పసరములు, పందులు మొదలగుజంతువులక్రొవ్వుచే నవి పూయఁబడుచున్న వనియు, హిందువులను, మహమ్మదీయులను నగౌరవపఱచుటకుఁగానే యాంగ్లేయులు వానిని దమకొసఁగి రనియుఁ బొరపాటుగాఁ దలఁచి, బంగాళమునందుఁ గొందఱు యుద్ధవీరులు కలహములు చేసిరి. తమదేశములను బోఁగొట్టుకొని, భరణము దీసికొని జీవించుచుండిన కొందఱు రాజవంశస్థులు వారితోఁ గలసికొని, యనేకసేనానివేశములను గొల్లవెట్టి, ఢిల్లీనగరమును స్వాధీనపఱచుకొని, యాంగ్లేయ స్త్రీపురుషులను బలువురను హత్యచేసి, యుత్తరహిందూస్థానము నంతయు రక్తమయముగాఁ జేసిరి. అయినను, అప్పుడు, ఇండియాలో రాజప్రతినిధిగా నుండిన కానింగు ప్రభువు (Lord Canning) మనోధైర్యమువలనను, ఆంగ్లేయవీరులయొక్క బలమువలనను, రాజవిశ్వాసము గల

సింగుజాతివారిలోఁ జేరినవీరులసహాయమువలనను నిక్కలహము చల్లాఱినది.

ఆ సమయముననే, యాంగ్లేయు లీ యిండియాలోని వీరులు చేసినకలహమువలనఁ గలిగిననష్టములకుఁగా నీ దేశస్థులను దండింపవలెనని మొఱపెట్టిరి. గొప్ప నీతిపద్ధతులలో విచక్షణుఁడయిన కానింగ్ ప్రభువు వారిమాటలను గించిత్తైనను సరకుగొనక, జనుల యజ్ఞానమును భయమును మాత్రమే పైకలహమునకుఁ గారణ మని తెలిపి వారి యొక్క విశ్వాసమును బ్రేమను బొంది రాజ్యమునఁ



కానింగు ప్రభువు.

గొన్ని దిద్దుపాట్లు చేయుటయే మంచిదారి యని వక్కాణించిరి. ఈ యభిప్రాయమునే ఘనతవహించిన విక్టోరియా మహారాజ్ఞియు మనసున నుంచికొని, యిండియాను వర్తకసంఘము వారికడనుండి తమయధీనము సేసికొని, యొక

మంత్రిని ఈ దేశముయొక్క కార్యదర్శినిగా నియమించి, యాతనిసహాయార్థమయి, పదునైదుగురికంటె మించని సభ్యులు గల యొక మంత్రాలోచనసభ యేర్పఱచి, యీ దేశస్థులసందేహములను, భయమును దొలఁగించుటకై మేటిప్రభుత్వపద్ధతులు గల యొక యభయపత్రము నిండి యాప్రజల కొసఁగి, యిండియాశాసననిర్మాణసభయందు (Imperial Legislative Council) ముగ్గురు స్వదేశీయులను సభ్యులనుగఁ జేర్ప నవకాశమొసఁగి, యొక్కొక్క మాగాణమునందును బ్రధానన్యాయస్థలములను (High Courts), విద్యాభివృద్ధి కావశ్యకములైన యనేకకలాశాలలను (Colleges), సర్వకలాసంఘములను నేర్పఱచిరి.



## 23. హిందూదేశము—ఆంగ్లేయరాజుల పరిపాలనము.

విక్టోరియామహారాణిగారును, రిప్పన్‌ప్రభువును జేసిన మేలులు —ఈ దేశమునకుఁ గలిగినయెన్నినియిడుములు—కర్జనుప్రభువు చేసినదిద్దుపాట్లు — నూతనముగా వెలుఁవడిన ప్రభుత్వపద్ధతులు — ఈ దేశము యొక్క ప్రకృతపుస్థితి—జనులకుఁ జేయఁబడుసర్వసామాన్యములయిన మేలులు — కఱవులును, వానిహేతువులును — తన్నివారణోపాయములును, దొరతనమువారి తోడ్పాటును — దొరతనమువారికిని జనులకును గల యైకమత్యము దేశముయొక్క యభివృద్ధికే కారణ మగు ననునది.

హిందూదేశ మాంగ్లేయదొరతనమువారియధీనతక్రిందికి వచ్చినవెనుకనే, యాంగ్లేయులవాణిజ్యాభివృద్ధికే కాక, యీ దేశవాసు లగు జనులహితమునిమిత్తముగూడ దొరతన ముండవలసినది యనుతలంపు దృఢముగాఁ గలిగినది. దీనికై యాంగ్లేయప్రభువులే కారణ మని చెప్పవచ్చును. ఈ దేశమును విక్టోరియాచక్రవర్తినిగారు స్వయముగా వచ్చి చూడకపోయినను, తమగారాబుపుత్రులను బంపి వారి వలన నీ దేశస్థితిని జక్కఁగా నెఱిఁగి, యీ దేశమునకు రాజప్రతినిధులను బంపునప్పు డెల్లను వారికిఁ జక్కని రాజనీతులను, దేశవాసులపైఁ బ్రేమఁ గనఁబఱపవలయు నను బుద్ధిని గఱపి, వారి నిచ్చటికిఁ బంపుచువచ్చిరి. ఇనుపదారులను నిర్మించుట, కాలువలు త్రవ్వుట, విద్యను దేశ

మెల్ల వ్యాపింపఁజేయుట మొదలగుజనసముదాయావశ్యక ములయిన మహోపకారములం దెక్కువపట్టుదలఁ జూపిన మేయోప్రభువు (Lord Mayo) రాజప్రతినిధిత్వము వహించియుండినప్పుడు, విక్టోరియా చక్రవర్తినిగారిద్వితీయ పుత్రుఁడును, డ్యూక్ ఆఫ్ ఎడింబర్గు (Duke of Edinburgh) అను పట్టము వహించినవారు నైన ఆల్ఫ్రెడ్ అర్నెస్టు ఆల్బర్టు (Alfred Ernest Albert) ఈ దేశమునకు విజయముచేసి, యనేకప్రాంతములను దిలకించి, దేశీయుల మనసుల నాకర్షించినదే కాక, రాజభక్తిని ప్రసరింపఁజేసిరి. పిమ్మటఁ గొన్ని యేండ్లకు, అప్పుడు యువరాజపదవియం దున్న గతించిన యెడ్వర్డు (Edward) చక్రవర్తిగారు 1875-వ సంవత్సరమున మనదేశమునకు విచ్చేసి, యీ దేశమందలివింతలను, పురాతనపట్టణములను జూచి, సామంతరాజులతోఁ గలిసి సంభాషించి యాంగ్లేయప్రభుత్వ గౌరవమును వ్యక్తపఱచి, హిందూదేశీయులు దమయెడఁ గనఁబఱచిన రాజభక్తివిశ్వాసములనుగూర్చి యింగ్లాండునకుఁ బోయినవెనుక ఘనతవహించిన తమతల్లిగారితో ముచ్చటించిరి.

1877-వ సం॥మున విక్టోరియామహారాణిగారు తమ గౌరవమును, శక్తియు, తమకును ఈదేశపుసామంతరాజు

లకును గల సంబంధమును వెల్లడియగుటకై యిండియా చక్రవర్తిని యని బిరుదు దాల్చిరి. ఆ సమయమున సామ్రాజ్యమకుటాభిషేకము ఢిల్లీనగరమునఁ గడు వేడుకగా జరుపఁబడినది. 1858-వ సం॥మున వ్రాయఁబడిన పత్రిక లోని విషయములు మఱల స్మృతిపథమునకుఁ దెప్పింపఁ బడియెను. మీఁదిపత్రికలోని విషయముల ననుష్ఠానము లోనికిఁ దేవలెననియే వచ్చెనో యనునట్లుగా రిప్పన్ ప్రభువు (Lord Ripon) ఈ దేశమునకు రాజప్రతినిధిగా వచ్చేసిరి. జనులు వీరిని తమదేశమునకు మహోపకారినిగాఁ దలఁచిరి. వారు చెప్పునది యొక్కటి చేయునది యొక్కటి కాక, యెంత చెప్పుదురో యంతయుఁ బనిలోఁ జూపిరి. ఇట్టి ప్రభువులలో వీరిని మిక్కిలి గొప్పగాఁ జెప్పవచ్చును. స్వదేశభాషాపత్రికలకుఁ జేటు గలిగించిన చట్టమును దొలఁగించినవారును, నగరవిచారణ, జిల్లా విచారణ విషయములలో జనుల కధికారము ననుగ్రహించినవారును, విద్యాభివృద్ధికిఁ గావలసిన విధులను విచారించి తెలుపుటకై యొక విద్యావిచారణసంఘము నేర్పఱచినవారును వీరే. దేశవాసులమనస్సులను గనిపెట్టి పరిపాలనము చేయుచుండినందున వీరిపేరు శిలాక్షరములమాడ్కి నందఱిమనస్సులలో నిప్పటికిని నాఁటియున్నది. వీరి ప్రతిమ యొక్కటి చెన్నపురియందు నవీనముగా స్థాపింపఁబడియున్నది.

వీరికాలమునుండియే స్వదేశీయులకు దొరతనవిషయములందు సంబంధమును, బాధ్యతయుఁ బెల్లుగా నేర్పడుచువచ్చుచున్నది. నిపుణు లగు దేశీయుల కింకను గొప్ప యధికారము లొసఁగవచ్చు ననుటను దెలుపుటకై యొక యోచనసభ (Public Service Commission) యీకాలముననే యేర్పడినది. శాసననిర్మాణసభలకు జనులు తమ ప్రతినిధులను బంపుకొనవచ్చు ననియు, ఆ ప్రతినిధులు దొరతనమువారియాదాయ వ్యయములఁగూర్చి విచారింపవచ్చు ననియు 1892-వ సంవత్సరమున నొక్క చట్టము పుట్టినది.

అయినను, దీనికిఁ బిదపఁ బదియేండ్లవఱకు, ఈదేశ మనివార్యము లయినపలుకారణములవలన పలు తెగ లగు కడగండ్ల ననుభవించినది. వైద్యులయూహల కందరాని మహామారి (Plague) యను ఘోరవ్యాధివలనను, ప్రతిసంవత్సరమునను సంభవించు వఱపులవలనను, జనుల మొత్తమును తగ్గించు భూకంపములు మొదలగు అపాయములవలనను, ఎట్టి కట్టుదిట్టములకును లోఁబడకుండిన పర్వతప్రాంతములలోని మహమ్మదీయుల యుపద్రవముల వలనను నీ దేశమువారికిఁ గలిగిన కడగండ్లు—అనఁగా ద్రవ్యనష్టము, ప్రాణహాని, విచారమును వ్రాయనలవి కాదు. "తగిలినకాలికే తగులు"నను సామెతచొప్పున

పైఁజెప్పిన దుఃఖములతోఁ గూడ 1901-వ సం॥మున విక్టోరియాచక్రవర్తినిగారిమరణవ్యసనము గూడ నీదేశ వాసులకుఁ గలిగినది.

తుపానువీచెడి సముద్రముమీఁది యోడను మాలిమి జాగ్రత్తతో నడిపించునట్లు, పలుతెగ లగు నపాయము లతో నిండియున్న యీ దేశ మును జక్కఁగాఁ బరిపాలిం చుటకై ధైర్యశాలియగు కర్జన్ప్రభువు (Lord Curzon) రాజప్రతినిధిగా నియమింపఁ బడిరి. వీరి పరిపాలనకాల మందుఁ జేయఁబడిన దిద్దుపా ట్లకుఁ బరిమితి లేదు. విద్యా బోధనపద్ధతులనుమార్చి, నూ తన సర్వకలాసంఘములను నియమించి, పోలీసుశాఖను బలపఱచి, ఇనుపదారులు మున్నగు సాధనములను వృద్ధిపఱచి, యీదేశపుఁబురా తననాగరికతను దెల్పుప్రాఁతకోటలు, దేవళములు, మండ పములు మొదలగుకట్టడములను దొరతనమువారే మర మ్మతుచేయవలయునని (Ancient Monuments Preservation Act of 1904) చట్ట మేర్పఱచి, బీదలమేలుకై



కర్జన్ప్రభువు.

ఉప్పుపన్నును, ఆదాయపుపన్నును తగ్గించి, యెల్లప్రాంత దేశములలోని క్రూరజనుల నణంచి, యీ దేశమునకు నెమ్మది నొసంగినవారు వీరే.

కొన్ని కారణములచే 1905-వ సం॥మున వీరు స్వయముగా పనికి రాజీనామా యియ్యఁగానే, పరిపాలనపద్ధతులందు గొప్ప యనుభవశాలియు, ప్రజలకుఁ దృష్టి గల్గించువారునైన మింటో ప్రభువు (Lord Minto) రాజప్రతినిధిగా విచ్చేసిరి. వీరివిజయముతోఁగూడ జాన్ మార్లె (John Morley) అను ఘనులు ఇంగ్లాండునం దిండియాదేశపుఁ గార్యదర్శిపదవిని వహించిరి. వీ రిరువురును నీదేశ



మింటో ప్రభువు.

స్థితిని బాగుగాఁ గనుఁగొని, దొరతనము వారికిని జనులకును బహిరంగముగను లోలోపలను గష్టములను గలిగించుచు వచ్చిన దుష్టుల నణఁచి, జనుల కనేక హితముల నను గ్రహించి, వారికి గొప్పహక్కుల నిప్పించుటయే శ్రేష్ఠపద్ధతి యని యెంచి, హిందువులచే నెన్నుకొనఁబడిన ప్రతినిధు

లను శాసననిర్మాణ సభలలో సభ్యులనుగా నియమించుటయే కాక మంత్రాలోచన సభలయందును వారికిం దా విప్పించుచు వచ్చుచున్నారు.

పైని చెప్పిన ఘనకార్యమును జేసి, లార్డ్ మింటోగారు తమమాతృభూమికి మఱలినతర్వాత, ప్రభుత్వవిషయములందారితేఱిన లార్డ్ హార్డింజ్ అనువారు గవర్నర్ జనరలుగా వచ్చియున్నారు. వీరీదేశమునకు వచ్చినది మొదలు కొన్నియనవసరములైన పనులను తగ్గించి, ప్రభుత్వమును మితముగా జరుపవలెననుతలంపు గలవారయియున్నారు. ఇతనికాలముననే కడచిన 1911–వ సంవత్సరము డిసంబరునెల 12–వ తేదినాఁడు మనచక్రవర్తిగారగు పంచమజార్జియనువారును, చక్రవర్తిని యగు మేరి యనునామెయు ఢిల్లీనగరమునందు రాజ్యపట్టాభిషేకము చేసికొన్నకాలమునందు, హిందువులకు మేలుచేయుటయే యాంగ్లేయ



లార్డ్ హార్డింజ్.

చక్రవర్తులకు విధి యని చెప్పి, యీదేశస్థులకుఁ గల కొన్ని వాంఛలను తమ రెండవప్రయాణమువలనఁ దొలఁగించిరి. ఈసమయముననే, యటుమీఁద ఢిల్లీనగరము ముఖ్యపట్టణముగా నుండవలె ననియు, బంగాళము చెన్నపురివలె రాజధానిగా నుండవలె ననియు, అజ్ఞానాంధకారమునుదొలఁగించునట్టివిద్యయొక్క యభివృద్ధికై యేఁటేటను 50 లక్షలరూపాయ లెక్కువగా ఖర్చుపెట్టఁబడు




యువరాజసంచారము 1905.

ననియు, ప్రకటన చేసిరి. ఈమహనీయుఁ డగు చక్రవర్తి గారు ను, చక్రవర్తినిగారు ను దీర్ఘకాలము జీవించి, ఇంగ్లాండుయొక్క గొప్పతనమును, యిండియాయొక్క నెమ్మదిని నెలకొలుపుదురుగాక.

ఆంగ్లేయప్రభుత్వమునకుమున్నుండిన యీ మహాదేశ స్థితియు నిప్పటిస్థితియుఁ జూచునప్పుడు, ఇండియాకుఁ బలుతెఱఁగులైన మేలులు దొరకిన వనుట స్పష్టముగాఁ దెలియును. దుష్టులకలహములును, సముద్రపుదోఁపిడి దొంగలు గలిగించిన బాధలును అరాచరికమువలన సంభవించెడియపాయములును నాంగ్లేయులస్థలసైన్యనౌకా సైన్యములవలన నిర్విఘ్నముగాఁ దొలఁగింపఁబడిన వనియు, ఒక్కొక్కనిబాధ్యతయు స్థిరపడి యున్న దనియు, ఎక్కువైన నెమ్మదివలననే యీ దేశమున వ్యవసాయము, వర్తకము, శిల్పములు మొదలగు జీవనోపాయములు వృద్ధి చెందుచున్నవి యనియు, అన్యదేశములసామగ్రుల దిగుమతి విశేషముగా నగుచున్న దనియు, తపాలు, తంతి, ఇనుపదారులు, కాలువలు మొదలగు సామాన్యపుమేలులు దొరతనమువారి గొప్పధర్మములుగాఁ గన్పట్టుచున్న వనియు, అన్నిమతములవారికి జాతివ్యత్యాస మెంచక చదువునేర్పించుట దొరతనమువారు తమవిధిగా నెంచియున్నా రనునదియు కాలక్రమమున ననేకములైన గొప్ప

యుద్యోగములలో దేశీయులు నియమింపఁబడుచు వచ్చు చున్నా రనియు ముందే చెప్పియున్నాము.

అంతియకాక, విద్యాపరిశీలనమునందే తమయొక్క జీవితకాలము నంతయుఁ గడపి, విద్యను వ్యాపింపఁజేయు నట్టి లోకోపకారకు లగు విద్వచ్ఛిఖామణులకు ను, తమ ద్రవ్యము నంతయు బీదలమేలుకై సర్వసాధారణవిషయ ములందు వెచ్చించుపుణ్యాత్ములకు ను ప్రభుత్వమువారికిఁ బ్రభుత్వమువిషయమున వలయుసహాయము చేయు బుద్ధి మంతులకు ను ప్రతిసంవత్సరమునను జనవరినెలమొదటి తేదినాఁడును, జక్రవర్తిగారివర్షవర్ధంతినాఁడు ను గౌరవ సూచకము లగు బిరుదులను, వెండి, బంగారుమొదలగు వానితోఁ జేసినపతకములను పుష్పములను ప్రభుత్వము వారు సమ్మానించి, పైనఁజెప్పినఘనులకు ముందటికాలము లం దుండినరాజులవలెనే యుత్సాహమును వృద్ధిపఱచు చున్నారు.

పైనఁజెప్పిన యన్నిమహోపకారములకంటె, దొర తనమువారు పేదలనిమిత్తము చేయుచుండు తోడ్పాటులు మిగులఁ బొగడఁదగినవి. వానలు లేక వఱపులు సంభ వించుకాలములలో వేలకొలఁది బీదలచే గుంటలు, కాలు వలు మొదలగువానిని త్రవ్వించి వారికిఁ దగినకూలి యి ప్పించి, వారియొక్క క్షుద్బాధను దొలఁగించుటయే కాక,

ప్రతిసంవత్సరమునను క్షామనిధి (Famine Fund) అను నిధిని కూడఁబెట్టుచున్నారు. ఈనిధిమూలమునఁ బేద వారికష్టములను దొరతనమువారు సాధ్యమయినంతవఱకు



మేరి చక్రవర్తినిగారు.

నివారణచేయుటకు మార్గములు వెదకుచున్నా రనుట మనము దెలిసికొనవచ్చును.



జార్జి చక్రవర్తిగారు.

అయినను, సకలసౌకర్యము లోనఁగూడియున్న యీ దేశమునం దింకను దారిద్ర్య మేల తొలఁగలే దనియు, వెయ్యింటిలో నూఱుగురికి హెచ్చుమంది యేల యొంటి పూటకూటితో నున్నా రనియు, ఈ శ్రమను దొరతనమ వారే యేల తొలగింపఁగూడ దనియుఁ, గొంద ఱ చ్చును. దారిద్ర్య మీ దేశమందు మాత్రమే నెలకొ యున్న దని మనము తలంపరాదు. ఏ దేశమునను, స్థితియందును, దారిద్ర్యము మనుజులను పీడవలె న రించియుండును. రాజ్యపరిపాలనమునఁ బ్రసిద్ధి చెం యింగ్లాండు దేశమునను, ప్రజాస్వామిక మయినఫ్రాన్స దేశమునను, అమెరికాఖండమునను, నిరంకుశప్రభుత్వము గల రాజ్యములందును దరిద్రదశ యనునది నెలకొనియే యున్నది. కాఁబట్టి దొరతనమువారే దారిద్ర్యము నడు గంటఁగాఁ బోఁగొట్టఁజాల రనుట స్పష్టము. ధనముతో ధనము గలియుటయు, దారిద్ర్యముతో దారిద్ర్యము చేరు టయు లోకమున వాడుక. సంపద యొక్కనికడఁ గొం చెము హెచ్చఁగా, నతఁడు ధనికుఁ డన్న పేరు తెచ్చుకొన్న మాత్రముననే, కష్టజీవనముచేయువారు వానికి నౌకరులై, వానినిమిత్తము పాటుపడి, వానిలాభమును వృద్ధిచేసి, తాముమాత్ర మొకటేస్థితిలోనే యున్నారు. తమప్ర యత్న మించుకయైనను లేకయే యితరులయొక్క పాటుల

వలన దొరకులాభ మంతయుఁ దామే పొందునట్టి ధనిక
లును, తమభాగ్యాతిశయమువలనను, నేర్పువలనను బాటు
పడువారిని దమస్వాధీనతయం దుంచుకొని, వారికలిమి
ంపును జెఱచుమూలధనముగలవారును, ఇతరులధన
ను తక్కువవడ్డీకిఁ గైకొని, వారికే యెక్కువవడ్డీలకు
ులిచ్చెడి సాహుకారులును తఱచుగా దారిద్ర్యము
కట వాసముచేయునట్లు చేయుచున్నారనుట యనేకుల
ప్రాయము. అంతేకాక, తమపెద్ద లనుసరించిన మిత
యమార్గములను సదాచారములను విడిచి యతివ్యయ
రణములగు సుఖమార్గములకును దురాచారములకును
నైన కొందఱుజనులమూలమునను దారిద్ర్యము హె
చ్చుచున్నదనియుఁ జెప్పవచ్చును.

మూలధనము గలిగిన యజమానులవలనఁ బనివారికిఁ
గిగెడు పెక్కుతెఱఁగు లగు సంకటములను దొలఁగించుట
ను, నీటియావిరియంత్రముల నుంచికొని పనిచేయుకర్మ
ాలలలోనిపనివాండ్రు క్రమముగాను, సంకటములు
ండునట్లును చూచుకొనఁబడుచున్నారా యను విష
ము గమనించుటకును, కాఫీతోటలు, తేయాకుతోటలు
దలగుతావులలోఁ బనిచేయువేలకొలఁది పనివాండ్రు
బుదారు లగు నాంగ్లేయయజమానులచేతఁ జక్కఁగాఁ
మకొనఁబడుచున్నారా యని చూచుటకును, పినాంగు,

సింగపూరు, మోరీసు మొదలగు పరదేశములలోఁ బెక్కు పనులలో నమరియుండు నీ దేశప్రజనులను రక్షించుటకును, అపాయములు గల సొరంగములలోఁ బనిచేయువారికి నపాయములు రాకుండునట్లు చూచుకొనుటకును ప్రభుత్వమువారు పెక్కం డ్రుద్యోగులను నియమించియున్నారు. దరిద్రులు తమకుఁ గల స్వల్పద్రవ్యము నెవ్విధమున నైనను వృద్ధిపఱచుకొని, తమదారిద్ర్యముఁ దొలఁగించుకొనవచ్చునే కాని, వేఱువిధముగా దానిఁ దొలఁగింప వీలుకా దని ప్రభుత్వమువారు బాగుగ నెఱిఁగి, 1904-వ సంవత్సరమున సహాయపరపతిసంఘముల చట్టమును (Co-operative Credit Societies Act of 190 ఏర్పఱచిరి. దీనిమూలమున బీద లగు గ్రామవాసులును నగరవాసులును దమతమస్థితిగతులకుఁ దగినట్లు నిధు నేర్పఱచుకొని, యితరులమూలధనమున కెదురుచూ కయే, వర్తకము, ఇచ్చుట, పుచ్చుకొనుట, శిల్పము మొ లగునుపాయములచేతఁ దమలేమిడిని దొలఁగించుకో చ్చునుగదా! జనులు తమయాదాయమునందు మిగిలించి పెట్టి యిచ్చునట్టి స్వల్పవస్తువులను గైకొని, వా రడిగినప డిచ్చుటకై యేర్పడియుండు క్షేమనిధి యు దొరతనవు వారియుద్యోగమునం దుండువారు నెలనెలలోను దమజీ ములలో నూటికిఁ బదునాఱవవంతుకంటెఁ దగ్గకయ

నెనిమిదవపాలుకంటె హెచ్చుకయు నిచ్చునట్టి పైకమును జేర్చిపెట్టి వెనుకటికాలమున నుపయోగపడునట్లుగా నొసఁగునట్టి యంత్యకాలసహాయనిధియును (Provident Fund) దొరతనమువారు జనులకలిమి వృద్ధిపఱచుటకై ప్రాని యుండు సదుద్దేశమును దెలుపుచున్నవి; ఐరోపాఖండము లోని దేశములలోని కలిమిపెంపు జనులయొక్క పట్టుదల, ముందాలోచన, ధైర్యము, ఐకమత్యము, పరస్పరానురాగము మొదలగుగొప్పసద్గుణములవలననే కలుగుచున్నది. మనపూర్వికులందును నాదికాలమున నీగుణము లుండెనవి యనుటకు సందేహము లేదు. రాజులు జనక్షేమమునకై యేమియుఁ జేయనట్టికాలములందును, గ్రామవాసు లొక్కటిగాఁ గూడి నీటిపాఱుదలకు వలసిన గుంటలు, కాలువలు, ఆనకట్టలు మొదలగు మితిమీఱినసాధనములను దామే యమర్చుకొని రని తెలియుచున్నది. కనుక, సేద్యము, వర్తకము, శిల్పము మొదలగువానిలో బీద లెంత కెంతకుఁ బాటుపడుచున్నారో, యంతకంతకు వారియొక్క దారిద్ర్యము తొలఁగు నని చెప్పవచ్చును.

ఈలోకమున నాంగ్లేయులు పడసియుండు ప్రఖ్యాతికి హిందూదేశప్రభుత్వమే ముఖ్యకారణ మని యన్యదేశీయులును, మంచిప్రభుత్వపద్ధతుల నీదేశమున వాడుకలోనికిఁ దెచ్చుటయే తమకు గొప్పకీర్తిఁ దెచ్చు నని యాంగ్లేయ

దొరతనమువారును నెంచుచున్నారు. లోకమున లోపము లేనిది యొక్కటియు లేదు. కాఁబట్టి రాజ్యాంగపరిపాలన పద్ధతులలోఁ గొన్నిలోపము లుండవచ్చును. అయినను, అట్టిలోపములను దొరతనమువారు దమంతటఁ దామే తెలిసికొన్నను, ఇతరులు గనుపఱచినను సవరించుటకు వా రెల్లప్పుడు సంసిద్ధులై యున్నారు. ఇట్టి యభిప్రాయము వారి కుండునప్పుడు దొరతనమువారికిఁ గీర్తి గలుగు ననుట కేమి సందేహము?

ఒకతల్లికడుపునఁ బుట్టి, యనేక కారణములచే బాల్యముననే యెడఁబాసి వేర్వేఱుదేశములలో నుండిన సోదరులు మఱలఁ గలిసినప్పుడు విడిపోవక యన్యోన్యప్రేమాస్పదులై పెంపొందునట్లు దైవవశమునఁ దొలుదొల్తనె విడిపోయి వేర్వేఱుతావుల నివసించి ప్రఖ్యాతి గని, యిప్పుడు గలిసియుండు హిందువులును ఆంగ్లేయులును ఐకమత్యము, అన్యోన్యానురాగమును గలిగి వృద్ధిచెందను చెందను, ఈ మహాదేశము భూవలయమునకు నాయకమణియై వెలుఁగఁగలదు.

ఈ దేశస్థులకును, ఆంగ్లేయులకును గలిగిన మనఃఖేదమునకు, ఇప్పుడు పశ్చిమదిక్కునందలి దేశములలో జరుగుచుండుయుద్ధమే వాస్తవకారణ మని చెప్పవచ్చును. పెక్కుసంవత్సరములనుండి మానవకోటిని నశింపఁజేయవలె నని

యెంచి యుద్ధమునకుఁ గావలసినసాధనములను విస్తారముగా సేకరించిపెట్టికొని జెర్మనీదేశస్థు లున్నట్టుండి 1914–వ సంవత్సరమున ఆగస్టునెలలో పొరుగుదేశములను నిష్కారణముగా యుద్ధమునకుఁ బిలుచునప్పుడు, ఈ దేశమునుండి గుంపులు గుంపులుగా యుద్ధవీరులు యుద్ధరంగమునకు వెళ్లి ఇంగ్లాండుయొక్క కీర్తిప్రతిష్ఠలకు లోపము గలుగనీయక శత్రువులతోఁ గయ్య మొనరించుచున్నారు. యుద్ధము చేయ సామర్థ్యము చాలనిహిందూదేశస్థులు ముందువెనుకలు చూడక, వస్తువులను ధనంబును నొసంగుచుఁ దమయౌదార్యమును, రాజభక్తిని దెలుపుచున్నారు. ఇప్పుడే యాంగ్లేయులకు మనదేశస్థులయౌదార్యధైర్యసాహసాదిగుణములు దెలియుచున్నవి. ఈ యుద్ధమునందాంగ్లేయులు జయము నొంది, వినుతి కెక్కినసాగరికతకు నాశకారకులగు జెర్మనుల నడంచి, నెమ్మదిని, ఐకమత్యమును మీఁదు మిక్కిలి వృద్ధినొందునట్లు చేయుదు రని యీ దేశాభిమానులు దైవమును బ్రార్థించుచున్నారు.

"సర్వే జనాః సుఖినో భవన్తు"

సంపూర్ణము

## చెన్నపురిలో ఉపాధ్యాయులకుగాను జరుగు
## పరీక్షలలో ఇవ్వబడు

# ప్రశ్నములు.

## 1907.

మార్కులు.

I. ఒక పల్లెటూరు (పరిపాలనగురించి చేయబడిన) యేర్పాటులనుగురించి మూడవతరగతిపిల్లవాళ్లకు చెప్పబోవుపాఠమునకు క్రమసూచిక (నోట్సు ఆఫ్ లెసన్సు) వ్రాయుము. 16

II. తపాలాఫీసులవలన జరుపబడు పలువిధము లయిన పనులను వ్రాయుము. 8

ఒక యుత్తరము మాటలాడగలదనుకొని అది చెన్నపట్టణము తపాలాఫీసులో వేయబడినదిమొదలు కర్నూలులో నొక సిరునామాదారు (అడ్రసీ) నకు అందచేయబడువరకు దాని కథను ఏరీతి చెప్పునో వ్రాయుము.

III. సివిల్ కేసునకును, క్రిమినల్ కేసునకును భేదమేమి? హత్య (ఖూని) అననేమి? యుద్ధములో సిపాయీలను చంపుట హత్య యని యెందు కనబడదు? 6

IV. లోకల్‌బోర్డులకు ధన మెట్లు వచ్చును? ఆ ధనమును వారు ఏ పనులయందు వినియోగింతురు (ఖర్చు చేతురు)? 6

V. చెన్నపుర రాజధానిలోనుండు ముఖ్యమైన రెండు ల్యాండు రివిన్యూ పద్ధతులు ఏవి? అవి యేలాగున పుట్టినవో చెప్పుము. 8

మార్కులు.

VI. చెన్నపురి చట్టనిర్మాణసభ (లెజిస్లేటివ్ కౌన్సిల్) ను గురించి నీకు తెలిసినంత వ్రాయుము. 6

50

# 1907.

I. (a) ఒక గ్రామములోనుండు బడి యుపాధ్యాయు డొకడు చెన్నపట్టణములోనుండు పుస్తకషాపువానివద్దనుండి చెన్నపట్టణమునకు తాను పోకనే కొన్ని పుస్తకములను క్రయమునకు రప్పించి, పిమ్మట వానికి క్రయము అందచేయుటకు కోరుచున్నాడు. ఈ విషయములో పోస్టుఆఫీసువారు ఏలాటి అనుకూలములను చేసియున్నారు? 3

(b) సాధారణముగా ఒక స్థలమునుండి మఱియొక స్థలమునకు పైకము పంపుటకు పోస్టుఆఫీసువారు చేసియుండు ఏర్పాటులను వివరించుము. మఱియు అతిశీఘ్రముగా పైకము చేరవలసియుండినయెడల, ఏలాటి యేర్పాట్లు గలవు? 3

II. (a) ఒక గ్రామములో దొంగతనము మొదలైన నేరములు తటస్థించినపుడు గ్రామ మేజస్ట్రేటును పోలీసువారును చెలాయించు అధికారములేవి? 4

(b) పై నేరములను విచారించి తీర్పుచేయు అధికారులెవరు? 2

III. (a) ఒక గ్రామ మేజస్ట్రేటు ఏ స్వల్పనేరములను తానుగా విచారించి తీర్పుచెప్పవచ్చును. అతని అధికారము ఎంతకు మించకూడదు? 3

(b) ఏతరహా సివిల్ వివాదములను గ్రామమునసిపు విచారణచేయవచ్చును? వివాదములో ఎంత మొత్తము ఉండిన అతనికి విచారించుటకు అధికారము గలదు? 3

మార్కులు.

IV. (a) గ్రామకరణముయొక్క పనులను సంగ్రహముగా వ్రాయుము. 3

(b) టీకాలువేసుకొనుటవల్ల ప్రయోజనములను వివరింపుము. 2

V. (a) ప్రజలవద్దనుండి గవర్నమెంటువారు ఏల పన్ను వసూలుచేయవలెను? 1

(b) ప్రజలవద్దనుండి పన్ను వసూలుచేయని గవర్నమెంటు ఏదైనను కలదా? 1

(c) గవర్నమెంటువారికి ఏ వృత్తిగల ప్ర... అధికమైన శిస్తు వసూలగుచున్నది?

VI. (a) నీపేర రిజిస్టరు అయియుండు కొంత ... మఱియొకనిపేరటికి (ట్రాన్సుఫరు) మార్చవలసినయెడ... అధికారికి అర్జీపెట్టుకొందువు?

నీ అర్జీ మంజూరు అయినయెడల వెంబడిగా జరుగు ఏర్పాట్లు ఏవి?

(b) "దరఖాస్తు" అనగా నేమి? సాధారణముగా అది ఎట్లు తీర్మానము చేయబడుచున్నది? 3

VII. (a) ఒకరూపాయకు తగ్గినతపాలాబిళ్లలు ఎంతెంత ఖరీదులో నున్నవి? 2

(b) ఇరువదిరూపాయలవరకు స్టాంపుకాగితములు ఎంతెంత ఖరీదులో నున్నవి? 4

VIII. "ఫారెస్టు" లేక అడవి డిపార్టుమెంటును ఏర్పఱచినందుకు ఉద్దేశములను, కారణములను సంగ్రహముగా వ్రాసి దాని వలన జనులకు గలుగు లాభములను తెలుపుము. 4

మార్కులు.

IX. ఒక గ్రామములో నుండు ఎలిమెంటరిపాఠశాల గ్రాంటు పొందుటకు అంగీకరించబడుటకై ఏయే నిబంధనలను అనుసరించి యుండవలెను? ఈలాటి ఎలిమెంటరి పాఠశాలలకు గవర్నమెంటువారు ఎట్టి సహాయమును ఇచ్చుచున్నారు? 4

X. ఒక గ్రామములో జరిగిన నేరమును పోలీసువారు విమర్శించి విచారణకు తెచ్చువిధమును ఏలాగు మీ పిల్లలకు బోధింతువు? 4

50

# 1908.

I. (1) ఇండియా దొరతనమువారు ప్రారంభవిద్య నభివృద్ధిపరచుటకై చేసిన ముఖ్యమైన ఏర్పాటు లెవ్వి? 3

(2) పూర్వపు వీధిబడులకును, ఇప్పటి ప్రథమ పాఠశాలలకునుగల ముఖ్యమైన భేదములను వ్రాయుము. 3

II. (1) జిల్లాలోనుండు ప్రధానోద్యోగస్థు లెవరు? 2

(2) జిల్లా కలెక్టరువారు చేయు వివిధములగు పను లెవ్వి? 4

III. తఱుచుగా పార్టీయొక్క జాతి మత భేదములనుబట్టి యే న్యాయపరిపాలన విషయములు నిబంధింపబడుచున్నవి — దీని యర్థమును దెలుపుము. 3

IV. ఈ దేశమున చెలామణియగు నాణ్యములను జెప్పుము. ఇక్కడ చెలామణియగుచున్న నాణ్యములలో నేది బ్రిటిషుదీవుల యందును చెలామణియగుచున్నది? 3

V. (1) 'భూముల శెటిల్‌మెంటు'—అనగా నేమి? 2

మార్కులు.

(2) ఈ దేశమందములలో నున్న రెండు విధములగు సెటిల్ మెంటులను వ్రాయుము. 2

(3) ఈ రెండింటికి నుండు భేదములను వ్రాయుము. 3

VI. ఈ క్రిందివానినిగూర్చి మీకు తెలిసినది వ్రాయుము.

(1) రాజప్రతినిధిగారి శాసన నిర్మాణసభ.

(2) హిందూదేశరాజ్య తంత్రకార్యస్థానము—(ఇండియా ఆఫీసు.)

(3) తపాలకచ్చేరీలోని ధననిధి (సేవింగ్సుబ్యాంకి.) 6

VII. (1) హిందూదేశ పటమును వ్రాసి, అందున బ్రిటిషు పరిపాలనమునకు లోబడియున్న స్వదేశ సంస్థానములను గుర్తించుము. 5

(2) మైసూరు, రాజపుత్రస్థానము—ఈ రెండు స్వదేశ సంస్థానములనుగురించిన పూర్వచరిత్రను వ్రాయుము. 4

(3) స్వదేశ సంస్థానములందలి రాజ్యపరిపాలనమునకును, బ్రిటిషు దొరతనముక్రిందనుండు దేశముల పరిపాలనమునకును, ఉండు ముఖ్యమైన భేదములను వ్రాయుము. 3

VIII. సేనను గురించినట్టియును, పోలీసు సిబ్బందిని గురించినట్టియును, మొట్టమొదటి పాఠమునకు నాల్గవతరగతికి మాదిరిగానుండు పాఠక్రమ సూచికను వ్రాయుము. 7

50

# 1909.

I. సహాయమునుపొందు ఎలిమెంటరీ స్కూళ్లకు టీచింగు గ్రాంటుక్రింద ఇవ్వవలసిన మొత్తమును ఎట్లు లెక్కించి నిర్ణయించుచున్నారు? పూర్వపు రిజల్టుగ్రాంటు పద్ధతికంటె ఇప్పు

మార్కులు.

డు నిర్ణయింపబడు టీచింగు గ్రాంటుపద్ధతి మంచిదిగా నుండు టకు కారణములేవి? ఎవరు, లేక, ఎట్టి సంఘములు బోర్డుస్కూళ్ల విషయమున జబాబుదారులుగ నున్నారు? ఆ స్కూళ్ల పరి పాలన విషయమగు జబాబుదారీ వీరి కెన్నివిధములుగా నుండును? 6

II. ఒక తావునుండి మఱియొక తావునకు జనులు దొరత నమువారి సాహాయ్యమున ఎన్ని విధముల పైకమును పంపు కొనగల్గియున్నారు? 2

ఏదైన నొక విధమును గురించి సవిస్తరముగ వ్రాయు ము. అట్లు వ్రాయునపుడు ఒకనియొద్దనుండి వదలినది మొదలు తిరిగి మఱియొకనిచేతిలో పడువరకును పైకమునకేమి సంభ వించుచున్నదో తెలియపరచవలెను. 3

III. (1) క్రిమినల్ కేసు, (2) సివిల్ దావా—వీని యర్థ మును సంక్షిప్తముగ జెప్పుము. వీనిలో నొక్కొక విషయము నను ప్రత్యేకముగా విచారించి తీర్పులు చెప్పుటకొరకేర్పడిన న్యాయసభలను ఈ రాజధానిలో నుండువానిని క్రమముతప్పక పేర్కొనుము. 4

పోలీసువారికిని న్యాయాధికారులకునుగల సంబంధము లను జెప్పి వారివారి విధికృత్యములలోనుండు ముఖ్యమగు భేద ములను దెల్పుము. 3

IV. రివిన్యూ శెటిల్‌మెంటనగా నేమి? భూముల సర్వేకును దానికినుండు సంబంధమేమి? 5

V. లోకల్ బోర్డులకు పబ్లికు వ్రయమునిమిత్తము ధనమెట్లు వచ్చుచున్నది? అట్లు వచ్చుధనమును వారే యే పనుల కుపయో గింపవచ్చును? ఈ జమా ఖర్చుల సముజాయిషీని వీ రెవరి కివ్వవలెను? 6

మార్కులు.

VI. (1) నీటి పారుదల, (2) రైలుమార్గములు—ఈ విషయములపైని దొరతనమువారు తమ యధికారమునెట్లు చెలాయించుచున్నారో సంక్షిప్తముగ తెలియపరుపుము. 4

VII. చెన్నపట్టణపు దొరతనమువారికి లోబడిన స్వదేశసంస్థానములను జెప్పి వీరు వానిపై చెలాయించు నధికారమెట్టిదై యున్నదో తెలియపరుపుము. 5

VIII. దొరతనమువారి యిలాకానుగాని, లోకల్ ఫండు ఇలాకానుగాని నవుకరుగానుండని సామాన్యజనుడు—(1) దొరతనమువారికిని, (2) తానుండు సంఘమునకును ఎన్నివిధములతోడ్పడవచ్చునో విశదపరుపుము. 6

IX. అడవుల పరిపాలనశాఖ (ఫారెస్టు డిపార్టుమెంటు) నుగురించి మూడవతరగతికి పాఠక్రమ సూచికను (నోట్సు ఆఫ్ లెసన్స్.) వ్రాయుము. (కాలము 40 నిమిషములు) 6

50

## 1910.

I. మూడవ స్టాండర్డు పిల్లలకు "గవర్నమెంటు" అన్ననేమో బోధపడునట్లు దృష్టాంతములతో ఎట్లు తెలిపెదవు? 4

II. (1) ఈ రాజధానిలోని ఎడ్యుకేషనల్ ఏజెన్సీలు ఎన్ని విధములు? 4

(2) వానికి దొరతనమువారు చేయుచున్న సహాయము ఎట్టిదో సంగ్రహముగా వ్రాయుము. 2

(3) టెక్నికల్ ఎడ్యుకేషన్ అన్ననేమి? నీకు తెలిసిన టెక్నికల్ బడులను రెండింటిని తెలుపుము. 2

మార్కులు.

III. (1) గ్రామ మునసబులకు ఉన్న నేరవిచారణ సంబంధమైన (జ్యూడిషల్) అధికారములు ఏవి? 2

(2) జిల్లాలో ముఖ్యమైన రాజ్యాధికారి (ఎగ్జిక్యూటివ్ ఆఫిసర్) ఎవరు? 1

(3) తన అధికారభాగము (జ్యూరిస్‌డిక్‌షన్) లో ఆయన ఏలాగు నెమ్మది కలుగజేయునో, ఏలాగు నేరములు అణచునో, తెలుపుము. 3

IV. (1) ఇండియన్ ఇనుపదారులతో (రెయిల్వేలతో) సర్కారుకు గల సంబంధము ఏమి? 3

(2) అట్టి సంబంధమువలన సర్కారుకును, ప్రజలకును, గలుగు లాభములను తెలుపు పాఠమునకు ముఖ్యాంశములను (అవుట్లైను) వ్రాయుము. 4

V. (1) దొరతనమువారు పెట్టు కర్చులు.

(2) సర్కారువారు వర్తక వాణిజ్యములకు గలుగజేసిన సదుపాయములు.

ఈ రెంటిని గూర్చి బోధపరుచుటకొరకు పిల్లలు స్కూలు ఎక్స్‌కర్షన్‌లో కనిపెట్టిన ఏ సంగతులను ఉపయోగించెదవు? 4

VI. (1) హిందూనాణ్యములు చేయుటకు ప్రస్తుతము ఏలోహములు ఉపయోగమగుచున్నవి? 2

(2) జనులు కొన్ని నాణ్యములను తక్కినవానికంటె వేగముగా నాశనము చేయుచుండుటకు కారణములు ఏమి? 3

(3) నాణ్యమునకును కర్రెన్సీ నోటునకును గల భేదాభేదములు తెలుపుము.

మార్కులు.

VII. నెలకు 500 రూపాయలు జీతముగల ఉద్యోగస్థుడు ఒక పెద్ద పట్టణములో తన సొంత ఇంటిలోనే కాపురము చేయుచున్నాడు. అతనికి ఒక గుర్రము, బండి, రిక్సా, ఒక కుక్క ఉన్నవి. అప్పుడప్పుడు వాడుటకు బైసికులుకూడ గలదు. సారాయి త్రాగుటయు, సిగరెట్టులు కాల్చుటయు, అతనికి ఇష్టము. సాధారణముగా ప్రతి ఆదివారమును అతడు జనసమ్మర్దము గల ఆ పట్టణమునకు 5 మైళ్ళ దూరమున ఉన్న తన పెద్ద పూలతోటయందు గడుపుచుండును. అతడు చెల్లించవలసిన పన్నులు మొదలైనవి ఏమి ఉండునో సంగ్రహముగా తెలుపుము. 5

VIII. (1) సర్కారువారు స్వదేశ రాజ్యములను (నేటివ్ స్టేటులను) తమ అధికారమునకు ఏ విషయములయందు లోబడ జేయుచున్నారు? 3

(2) నీకు తెలిసిన ఏ స్వదేశ రాజ్యము (నేటివ్ స్టేటు) మీదనైనను బ్రిటిషువారు చెలాయించుచున్న అధికారమువలన గలుగు ఫలితములను తెలుపుము. 3

(3) బ్రిటిషువారి పరిపాలనమునకు పూర్వము మన పూర్వులకు లేని సదుపాయములు, మనము ఇప్పుడు అనుభవించుచున్నవి, రెండు తెలుపుము. 2

50

## 1911.

I. ఈ క్రింద కనబరచియుండు మాటల సహాయముచే నాల్గవతరగతి బాలురకు గ్రేటు బ్రిటనులో ప్రభుత్వపు పద్ధతి నెట్లు స్పష్టముగా తేటపరతువు:— 6

మార్కులు.

హిస్ మేజస్టి రాజుగారు, ప్రభువులు (లార్డుసు), సామాన్య జనులు (కామనుసు), కక్షులు, స్థానములు, ఏడు సంవత్సరములు, ముఖ్యుడు (లీడర్), ప్రధానమంత్రి, క్యాబినెట్ సభ, ఇండియా కార్యదర్శిగారు, ఇండియా ఆలోచనసభ, ఇండియా ఆఫీసు.

II. ఇండియా ఆకారపు పటమును వ్రాసి (ఔట్ లైన్ మ్యాప్) అందు ఇండియాలోని రాజ్య పరిపాలనాభాగములును, తిరువాన్కూరు, మైసూరు, హైదరాబాదు, యీ స్వదేశసంస్థానములను గుర్తువేయుము. 6

III. ప్రథమ విద్యాభ్యాసమును (ఎలిమెంటరీ ఎడ్యుకేషన్) ప్రత్యేక విద్యాభ్యాసమును (స్పెషల్ ఎడ్యుకేషన్) తేటపరుపుము. ఈ రెంటిని వృద్ధిపరచుటకై ఇండియా గవర్నమెంటువారేరే యేర్పాటులను చేసియున్నారు? 6

IV. "పబ్లిక్ వర్క్సు" అనగా నేమి? దేశముయొక్క వర్తకవ్యాపారములను వృద్ధిపరచుటలో యీ డిపార్టుమెంటెట్లు పయోగకరముగా నున్నదో దృష్టాంతములతో చూపుము. 6

V. (1) ఇండియాదేశము నన్యులు బాధించకుండునట్లును,

(2) ఇండియాలో నెమ్మది కలుగునట్లును,

(3) ఇండియాలోని ప్రజల ఆరోగ్యమునకును, గవర్నమెంటువారిచే నెట్టి ఏర్పాటులు చేయబడినవి? 5

VI. యీ క్రింద కనబరచియుండు వానినిగురించి నీకు తెలిసినంత వ్రాయుము:—

(1) జమాబంది.

(2) అరణా, అణా టప్పాలు బిళ్లలు.

మార్కులు.

(3) ఖూనికేసులో జిల్లా జడ్జిగారి కుండు అధికారములు.

(4) రివిన్యూ సెటిల్‌మెంటు, రివిన్యూ సర్వే.

(5) జమీందారీ, రైతువారీ యేర్పాటులు.

(6) 1909-వ సంవత్సరపు (నవంబరు నెల 15-వ తేది) ఇండియా సభలచట్టము.

(7) జ్యూరర్లు (పంచాయతీలు), అసెసర్లు.

(8) నవరక్ష నాణ్యము. 8

VII. మదరాసు గవర్నమెంటువారి యాధీనములోనుండు రాజధాని యుద్యోగస్థుల నందరిని బేర్కొనుచు యీ రాజధాని పరిపాలనలో వారివారి కార్యములను తెలియపరచుము. 6

VIII. యీ క్రిందివానిని వ్రాయుము:—

(1) మూడు తరగతుల మ్యాజిస్ట్రేట్లు (దండనాధికారులు) వారి యధికారములు. 3

(2) ఇండియాలోని జనుల జాతి మత విచారముల హక్కులను స్థిరపరచుటలో జడ్జీల కనుగుణ్యములగు చట్టములు. 3

(3) లోకల్ సెల్ఫ్ గవర్నమెంటులోని భాగములను తెలియజేయు వివిధ చిరునామాలు. 4

(4) స్వదేశ రాజ్యములలో గవర్నమెంటువారి ప్రతినిధులు. 2

IX. (1) సెంట్రల్ గవర్నమెంటు అనగా నేమి?

(2) దాని ముఖ్య పట్టణ మెయ్యది?

(3) దాని యజమాను డెవరు?

(4) అతని ముఖ్య కార్యము లెయ్యవి? 5

60

మార్కులు.

# 1913.

I. 4-వ స్టాండర్డుకు పోలీసు డిపార్టుమెంటు చేయుపనిని గూర్చి పాఠమును ఎట్లు బోధపర్చెదవో సూచికల మూలముగా తెలియజేయుడు. 6

II. (1) నీ గ్రామములో పొరంబోకు భూములు కొన్ని సంపాదించవలెనన్న నీవు అవలంబించవలసిన పద్ధతి యేమి? నీ దరఖాస్తు యెవరెవరిద్వారా పోవలెను. 3

(2) రెవెన్యు ఆఫీసరుల గ్రేడు లన్నియు తెలియజేసి, ఆయాగ్రేడు ఉద్యోగస్థుల అధికారముల వ్రాయుడు. 5

III. పన్నులు విధించ నగత్యమేమి? సర్కారుకు వచ్చు పన్నులో ఎక్కువ భాగము దేనివలన వచ్చును? తాటికల్లు మొదలయిన మత్తు పదార్థములపైన పన్ను ఎందుకు కట్టవలెను? 5

IV. రయితువారి రెవెన్యు సెటిల్‌మెంటుకున్ను పర్మా- రెవెన్యు సెటిల్‌మెంటుకున్ను గల ముఖ్య వ్యత్యాసములను తెలుపుము. 7

V. అడవులను కాపాడుటవలన రయితునకు కలుగు పెక్కు లాభముల చెర్కొనుడు. అట్టి అడవుల గట్టి సంరక్షణ నిమిత్తము గవర్నమెంటువారు అవలంబించిన పద్ధతు లెవ్వి? 5

VI. నాణ్యములు వేయుట మొదలగు టంకసాల (మింట్) వ్యవహారములు గవర్నమెంటువారు స్వయముగా వారి చేతిలోనే ఎందు కుంచుకొనవలెనో వివరింపుడు. 4

VII. (1) సివిల్ దావాల పరిష్కారము నిమిత్తము స్థాపింపబడిన పెక్కు కచ్చేరీలను దెలిపి, వాని అధికార భాగములను (జ్యూరిస్‌డిక్‌షన్) వేరువేరుగా వ్రాయుడు. 6

మార్కులు.

(2) మూడు తరగతుల మేజస్ట్రేటులను, వారి అధికార ములను వ్రాయుడు. 3

VIII. ఒక 'లోకల్ బోర్డు' గాని, లేక ఒక 'మ్యునిసిపాలిటి' గాని లోకోపకారము నిమిత్తము శ్రద్ధ వహించునట్టి పెక్కు విషయములను పేర్కొని, అందుకు కావలసిన సొమ్ము (ఫండ్సు) అది యెట్లు సంపాదించునో వివరింపుము. అట్టి స్థాపనములకు ద్రవ్యసహాయము చేయుటలో గవర్న మెంటువారు ఎట్టి జోక్య మైనను కలుగజేసుకొనెదరా? వాటిపైన సర్కారువారికి ఎట్టి అధికారము కలదు? 8

IX. (1) రాష్ట్రములోపల అంతరకల్లోలములు పుట్టినప్పు డున్ను. 4

(2) పరరాజులు దండెత్తి వచ్చినప్పుడున్ను స్వదేశ రాజులు గవర్న మెంటువారికి ఎట్లు సహాయకారులుగ నుందురో విశదపరుచుము.

X. ఈ దేశములో ప్రథమ విద్యాభ్యాసము (ఎలిమెంటరి ఎడ్యుకేషన్) యొక్క అభివృద్ధి నిమిత్తము సర్కారువారు ఎంత సహాయమును చేయుచున్నారో తెలియజేయుము. 4

60

## 1914.

I. 'సివిక్సు' అనగా నేమి? దానియొక్క ఉద్దేశమును, అభిప్రా యమును సంగ్రహముగా తెల్పుము.

II. (1) 'గ్రాంట్సు ఇనేడ్' అను మాటకు అభిప్రాయమేమి?

(2) ఏ యే విషయములలో అటువంటి గ్రాంటులు ఇయ్య బడునో చెప్పుము.

(3) ఎలిమెంటరీ బళ్లను రికగ్నైజు చేయుటకు కావలసిన ముఖ్యమైన నిబంధనలను చెప్పుము.

III. ఈ క్రిందివాటిలో నేవైన రెంటికి మాత్రమే నీకు తెలిసిన దంతయు వ్రాయుము:—

(1) మనదేశములోనున్నా (ఇగ్లెండు), విదేశములు (ఇంగ్లాండు, అమెరికా మాత్రమే) పంపుటకున్నూ అగు, కార్డులు, ఉత్తరములు, బుక్కు ప్యాకెట్టులు; ఈ మూటియొక్క తపాలాచార్జీలు.

(2) 'సేవింగ్సు బాంకీ.'

(3) సాధారణపు తంతీవార్తకున్నూ, తంతీవార్తపైన పంపబడు మనీఆర్డరు కగు చార్జీలు.

(4) పార్సెల్సును, రిజిస్ట్రేషనుకు నగు ఛార్జీలు.

(5) నేరముల విషయమై పోలీసువారియొక్క మూడు విధములైన విధులు.

IV. 'సెషన్సు' కచేరీలు, మేజిస్ట్రేటు సంబంధమైన కచేరీలు అనగా నేమి? ఈ కచేరీలతో సంబంధించిన అధికారు లెవ్వరు? వారికిగల అధికారములు ఏవి? వారిలో ఏ అధికారులకు న్యాయమైన తీర్పు చెప్పుటలో సమర్థులైన పురజనుల సహాయము అగత్యము? అటువంటి పురజనులకు ఏమి పేరియ్యబడెను.

V. మూడవతరగతి బాలురకు, పన్ను విధించుటయొక్క అగత్యమును, దృష్టాంతరము లిచ్చుచు, ఏ ప్రకారముగా స్పష్టముగా బోధపర్చెదవు?

VI. 'ఆదాయపు పన్ను' అనగా నేమి? ఎప్పుడు, ఏ కారణముల చేత, ఈ పన్ను మొదట ప్రవేశపెట్టబడెను? ఏ నియమముమీద ఈ పన్ను విధించబడినది?

# 1915.

I. సివిక్సు పాఠములలో సత్ప్రవర్తనగురించి బోధించుటకు అవకాశము లెట్లు తటస్థించునో విశదపరచుము.

II. ప్రజలు తమ కార్యములను తామే నిర్వహించుకొనుటకొరకు చేయబడిన పలువిధములగు ఏర్పాటులను వర్ణించుము.

వీని పై మాగాణపరిపాలనమునకు ఎట్టి అధికారముగలదు. (ప్రావిన్షియల్ గవర్నమెంటువారి పైవిచారణ.)

III. 3-వ తరగతి బాలురకు "సర్కారు లేక దొరతనమువారు" అను పదమును ఎట్లు బోధించవలెనో విశదపరచుము.

IV. సివిల్, క్రిమినల్ కోర్టులను ఏ ఉద్దేశ్యముతో దొరతనమువారు స్థాపించిరో విశదపరచుము.

V. హిందూదేశమందలి 4 ముఖ్యమైన స్వదేశరాజ్యములను పేర్కొని వానికిని, బ్రిటిష్ దొరతనమువారికిని గల సంబంధమును తెలుపుము.

VI. (1) ఉపాధ్యాయులకు బోధనకివ్వబడు గ్రాంటు (టీచింగు గ్రాంటు.)

(2) కుర్చీలు, బెంచీలు మొదలగు పాఠశాలోపకరణముల కివ్వబడు గ్రాంటు (ఫర్నిచర్ గ్రాంటు.)

(3) పాఠశాలాగృహమును కట్టుటకు ఇవ్వబడు గ్రాంటు (బిల్డింగు గ్రాంటు.)

(4) గవర్నమెంటు, బోర్డు, మ్యూనిసిపల్ పాఠశాలలో ఉపాధ్యాయులకు ఇవ్వబడు కాపిటేషన్ అలవెన్సు (Capitation allowance).

ఈ పైనాలుగు ఏ యే నిబంధనల ప్రకారము ప్రథమ పాఠశాలల కివ్వబడుచున్నవి?

VII. చెన్నపురి రాజధానిలోని 6 మ్యూనిసిపాలిటీ పట్టణములను వ్రాయుము.

4-వ తరగతివరకు బోధించెడు ప్రథమ పాఠశాలయొక్క ప్రధానోపాధ్యాయుడుగా (హెడ్మాష్టరు) నీవు పనిచేయుచున్నట్లనుకొని, పై పట్టణములలో ఒక పట్టణమునకు విహారార్థము బాలురను తీసికొని పోయినటుల తలచి, బ్రిటిషు ప్రభుత్వమువలన హిందూదేశమునకు కలిగిన లాభములను అక్కడ ఎట్లు విశదపరచవచ్చునో విపులముగా తెలుపుము.



924

# OPINIONS

**Sir J. Thomson, K.C.S.I.,** *Member of the India Council* :—'The scope and purpose of the book are excellent ; and in so far as I have had time to read the text * * * I have found it illuminating. It will doubtless have a wide market and be most useful in education.'

**Sir Theodore Morison,** *Member of the India Council* :— * * * From the head lines I judge that the work must be full of interest and advantage to young students. * * * * I am growing more and more convinced that the important ideas, the ideas which sway humanity, spring, as was said, from the heart ; and to touch the heart one must speak through one's mother tongue.

**The 'Madras Mail'** :—' Mr. T. S. Subramania Aiyar, Assistant Professor of History at the Presidency College, has just published a little work in Tamil of considerable interest and even importance. It is called 'The Elements of Civics for India'. It consists of a series of chapters dealing with subjects such as the family and its duties, the family and the State, what the Sircar does for us, and so forth. It describes in simple language the system of public education, the functions of the Sircar as a judge, as a protector of public order, as a constructor of railways and public works. It explains the system and reasons of taxation, and describes the system of self-government by the Taluq Boards and Municipalities. The third part deals with the system of Government, rising from Provincial through the India Government to the Home Government ; and the fourth part briefly describes the condition of India before and after the establishment of the British *Raj*. All this is related in easy colloquial Tamil, such as may easily be read and understood by people of all grades of education, including school children ; and it is illustrated with numerous photographs. Such a work has been badly needed in Primary schools, and we are

heartily glad to see it done, and well done. We imagine that the book will be eagerly welcomed by all concerned in the management of vernacular schools ; and it should certainly be introduced as speedily as may be, for it must always be of the greatest moment, as Mr. Subramania Aiyar observes in his preface, that honest and law-abiding citizens should be trained in the schools, where much of India's future prosperity and happiness must be decided.'

**The 'Hindu', Madras:**—The author has evidently bestowed much care in the selection of materials and his division of subjects is very appropriate. He has divided the volume into four parts, the first part dealing with the Sircar and its functions regarding education, law and justice, railways, telegraphs ; the second detailing the duties and responsibilities of the people ; the third giving a brief but clear account of the Government and its structure ; and the fourth summarizing the chief events in the History of India within 40 pages. The book has been specially prepared for use as textbook in Training and Elementary schools. But to the Tamil-knowing public generally who require to know about the subject, Mr. Subramania Aiyar's work will be found very interesting and instructive. The language is easy and flowing. We have to congratulate the author on the successful manner in which he has treated the novel subject and we are confident that the book will become popular.'

**The 'United India':**—'The book need only to be known to be bought'

**Sir S. Subrahmania Aiyar, B.L., LL.D., K.C.I.E.:**—'The style is just what in my opinion is necessary for the general improvement of the vernaculars of our country.'

**Dewan Bahadur R. Raghunatha Rao, C.I.E.:**—'I am convinced that this is a very useful work and if studied will make the coming generation more useful to our country.'

**The Hon. Mr. [illegible]ice V. Krishnaswamy Aiyar Avl., B.A., B.L.:**—'The design [illegible] the work are excellent. It has been executed [illegible] and judgment.'

**The Hon. Sir P. S. Sivaswami Aiyar Avl., B.A., B.L., K.C.I.E. :—** 'Though the book is adapted to the requirements of Elementary schools it can be read with advantage by students of the higher Forms and by the mass of the people. The style in which the work is written is as little removed from the ordinary current language of the day as practicable and is just the style needed for books intended to popularize knowledge.'

**Rao Bahadur M.R.Ry. S. Mangesh Rao Avl., B.A. :—** 'I think you have supplied a real want by coming to the rescue of the poor Elementary schoolmaster, who was at sea as to what he should teach on the subject.'

**Rao Bahadur M.R.Ry. P. I. Chinnasami Pillai Avl. :—** 'I should strongly recommend that the book should be introduced in all the Primary schools with the least possible delay, so that pupils in their impressionable age are well grounded on sound principles and duties of good citizenship.'

**M.R.Ry. P. Sambanda Mudaliar Avl., B.A., B.L. :—** 'I regard the book as one of the most useful contributions to the Tamil language in the present day.'

**M.R.Ry. K. Venkatrama Aiyar Avl., B.A. :—** 'I have now been a schoolmaster for 30 years and I do not remember having come across a vernacular textbook so masterly in detail and so accurate.'

**M.R.Ry. Rentala Venkatasubba Rau Garu, B.A., B.L. :—** I have gone through the Telugu rendering of the "Elements of Civics for India" and find it clear and simple in style and interesting not merely to the schoolboy but to the general reader. . . . It gives in a small space a comprehensive view of the mighty machinery and work of Government. . . . It at once initiates the masses into the secrets and strength of good government and stimulates their gratitude to the Rulers for the many and great benefits they have conferred on the people of this land. . . .

---

S. P. C. K. PRESS, VE



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B173 |
| పుస్తకం పేరు | ప్రజాధర్మసంగ్రహము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 307 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | I, II, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haleema |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |